Regd. No 1856




## సబ్బు మాత్రమే

మేము దానిని గురించి ఉన్నదున్నట్లుగానే చెబుతాము. ఈ ప్రకటనద్వారా మేము అమ్మ దలచినది చిన్నా భాగ్యవంతులకూ పేదవారికీ ఒకే మాదిరి అందుబాటులో ఉండే ఒక మంచి రకపు సబ్బు మాత్రమే. కాంతి సబ్బు మీకు సౌందర్యం, ప్రణయం, ఇంకా అనేక ఇతర [illegible] ఇస్తుందని మేము వాగ్దానం చెయ్యబోవటం లేదు.

కాని "కాంతి సబ్బు మనోహరమైన పరిమళంగలది ఎంత సున్నితమైన చర్మాన్నయినా చెడుపుచెయ్యదు." అని మాత్రం మేము యథార్థంగా చెప్పగలం.

స్వస్తిక్ వారి శ్రేష్ఠమైన ఇతర వస్తువులలో కొన్ని : శీకాయ సబ్బు, పరిమళ ఆముదం, స్వస్తిక్ షేవింగ్ స్టిక్, బట్టల సబ్బులు, గోవారిన్ బ్రాండు వనస్పతి మొదలయినవి.




## కాంతి సబ్బు

నాణ్యతకు సాటిలేనిది.

SHILPI Sem. 10—Telugu

స్వస్తిక్ ఆయిల్ మిల్సు లిమిటెడ్, బొంబాయి.

[illegible]



# విషయానుక్రమణిక



## డిసెంబరు,

# భారతి ఇరువదియైదవ సంపుటము, భా-౨

## అకారాది విషయ సూచిక

---



శ్రీ మంగళగిరి పానకాలస్వామి ఆలయము




సంపుటము **25** | డిసెంబరు, **1948** | సంచిక **12**
సర్వధారి మార్గశీర్షము

# ఆచార్యస్వామి

●

శ్రీ వావిలాల రామమూర్తి

౧

గంగావాఃపరిపోషితాంఘ్రితరుశాఖాశీతలచ్ఛాయలన్
రంగుల్ దిద్దు నుషస్సువేళ ముదమారన్ నిద్ర మేల్కాంచి, భ
క్తిం గంగాంబుకృతావగాహుఁ డయి సంగీతంబు కావింతు, వే
డ్కం గుంజత్ప్రణవైకనాదము నిసర్గశ్రీల లీనంబుగా.

౨

ఆ స్వేచ్ఛాత్మకగానసమ్మిళితదివ్యానందవారాశిపీ
చీస్వాభావికభావపుంజములు వీచెన్ వాయులీనంబులై
ఓ స్వామీ! అది యేమి శ్లోకఝరి? వేదోక్తప్రసూనాసవం
బాస్వాదింపగనిమ్ము స్వానుభవగీతార్థమ్ము సర్వస్వమున్.

ప్రచ్చు' చున్నదనియు, నంతకంటె వేఱొండు పరమ పంబు లేదనియు నుడివి దాని కుదాహరణముగా మాల దాసరికథ వివరించెను. వీనికి గోదాదేవిచరిత్రముతో గాని,విష్ణుచిత్తుని చరిత్రముతోగాని యెట్టి సంబంధమును లేదు. ఇవి వారి యుపాస్యదైవతమైన విష్ణుని దివ్య మహిమ నెంతో చక్కగా వివరించు వృత్తాంతములు. శ్రీకృష్ణదేవరాయలకును విష్ణువే యుపాస్యదైవమగుట నాత డితరమతములకంటె వైష్ణవమతమునకు గల యాధిక్యమును విస్తరించు నుద్దేశముతో ప్రధానకథాసంబంధలు కాకపోయినను వీట్లో వాని నాయాచోట్ల చొప్పించి విరివిగా వర్ణించెను. అందును యామునాచార్యకథాప్రసంగమునకు గవి కల్పించిన సందర్భము మిక్కిలియు దూరానీతముగా నున్నది. అది వివాహము కుదురునాటికి ప్రక్కనున్న యింటివారు చెప్పించు హరికథాకాలక్షేపమువలె ననవసరాడంబరమై కానవచ్చుచున్నది. విష్ణుచిత్తుని వాదవిజయమును, పాండ్యరాజదంపతుల శైవవైష్ణవమతావేశములను వర్ణించు సందర్భమున కృష్ణరాయలు పరమతములను, పరమతస్థులను నెంతో పరిహసించినాడు. పాండ్యరాజుది వెఱ్ఱిశైవ మనియే కాని తనది వెఱ్ఱి వైష్ణవ మని యాత డెఱుగకపోయెను. ఘోషయాత్రాసందర్భమున 'మిత్రజనమోదంబును శత్రుజన ఖేదంబును గదా సంపదలకుం దగినేడు ఫలం' బని ...న్నట్లు స్వమతస్థాపనముతోపాటు పరమతోల్లంఘనము నున్నగాని తృప్తి కలుగదు కాబోలును. ఈ ...ముగా నీయవాంతరకథాప్రవేశమువలన గవి మనోరథ నకుపలె గథాశరీరమునకును బెంపు చేకూరుట నిజమే ...ని యీ పెంపు పుష్కలావయవములు కల వ్యక్తికి ...భారమువలె గథ కెంతో వికృతిని జేకూర్చి దాని ...క్యమునకు భంగకరముగా నున్నది.

ఆముక్తమాల్యదయందలి వస్త్వైక్యమునకు భంగము ...గించిన యంశ మింకొక టున్నది. ఇది బుతువర్ణ...ు. కృష్ణరాయలు తన కావ్యమున గ్రీష్మవర్షాశర...ంతములను విరివిగా వర్ణించెను. బుతువుల నింత ప్రకృతిసూక్ష్మపరిశీలనముతో నతివిస్తరముగా వర్ణిం...కవి యాంధ్రవాఙ్మయమున వేఱొకడు లేడన వచ్చును. సందర్భానుసారముగా బుతువర్ణనము కావించుటలో దోస మేమియును లేదు. కాని యది ప్రధాన వస్తువును విస్మరింపజేయునంత యతివిస్తృతముగా నుండరాదు. కృష్ణరాయలు వర్ణన మారంభించినచో భావముల పరిపూర్ణతకును, వర్ణ్యవిషయముల సామగ్ర్యమునకునే చూచునుగాని కథ కది యెంతవఱకావశ్యకమోయను విషయము చూడడు. వస్త్వైక్యభంజనకార్యమున నీబుతువర్ణనమున కాతడు కావించిన రాజనీతివర్ణనయు దోడైనది. సందర్భశుద్ధిని, గథలో వాని కుండవలసిన స్థానమును బురస్కరించుకొని చూచినచో నీ బుతువుల వర్ణన యనవసరమని తోచుచున్నది కాని ప్రత్యేకముగా జూచినచో నది భావసంపదయందును, భావనాసమృద్ధియందును, సూక్ష్మపరిశీలనమునందును, నిసర్గత్వమునందును ననితరసామాన్యమై యతిమనోహరముగా నున్నదనుటలో సందేహము లేదు.

కృష్ణరాయల వర్ణనపాటవమును బరికించినచో నాతడు తన కున్న యనుభవమును బురస్కరించుకొని యామునాచార్యుల దిగ్విజయయాత్ర నెంతో విపులముగా వర్ణించుననని తోచును. కాని యాత డా విషయము నొకేయొక పద్యముతో ముగించివైచినాడు. దానినే యాతడు వర్ణించుట కారంభించిన నొక యాశ్వాసమంత భాగము పెరిగియుండెడిది. ఏలయన, కృష్ణరాయల ప్రకృతిలో నమితత్వమే కాని 'సంసారపక్షు' మన్న మాట లేదు. కాని యిది యొకవిధముగా మేలే యైనది. అత డావర్ణనముకూడ గావించియుండెనిన గథకు సంబంధము లేని కథాభాగ మింకను గొంత యధికమైయుండును.

ప్రధానవిషయమైన గోదాశ్రీరంగేశ్వరుల ప్రణయములో గ్రమపరిణామము లేదు. గోదాదేవి పూర్వజన్మమున భూదేవి. అప్పుడే ప్రేమ యారంభించెనని కాబోలు గవి యందామెవిరహముతో నారంభించినాడు. గోదాదేవి విష్ణుచిత్తునికి వనమున గానిపించిన వెంటనే యనపత్యుడైన యాత డామె నత్యాదరమున నింటికి గొనివచ్చినాడు. ఆమెయు గ్రమముగా పెరిగి యారూఢయౌవన యైనది. వెంటనే విరహావస్థ యారంభించినది. ఈ విరహ మెవ్వరి నుద్దేశించి? శ్రీరంగమున

విగ్రహరూపుడై వేంచేసియున్న శ్రీరంగేశ్వరు నుద్దేశించి. శ్రీరంగేశ్వరు డప్రాకృతుడైన దైవము. విగ్రహమూర్తియే కాని మానవమూర్తిని ధరించి భూమిపై సంచరించువాడు కాడు. గోద యాతని వలచినది. తాను వలచుటయే కాదు వలపించుకొని చివరి కాతని వివాహమాడినది. ఈ దివ్యమానవసంయోగము కథకు గొంత యలౌకికత్వమును, నవిశ్వాస్యతను జేకూర్చినది. పారిజాతాపహరణాదికృష్ణనాయకములైన ప్రబంధములలో కృష్ణునిపై వలపు నిల్పిన కాంతల ప్రణయము వర్ణితమైనది. కాని యచట కృష్ణుడు లీలకైనను మానవవిగ్రహధారియే కాని దివ్యమూర్తి కాడు. శ్రీరంగేశ్వరుడు గోదను వలచి యామెను దన యంతిపురమున జేర్చి పల్లకీలో మాయాగోదాదేవిని గల్పించి యుంచెను. ఛాందసుడైన విష్ణుచిత్తు డింటి కరుగగనే శూన్యమైన యందలమును జూచి మొత్తుకొనెను. శ్రీరంగేశ్వరు డాతని నోదార్చి గోదాదేవి తన యింటికడనే యుండ దన్నట్లు నిందించుట మంచిది కాదని నుడివెను. విష్ణుచిత్తు డింటి కేగి యనుగుగూతు నారసి సంతోషభరితచిత్తు డాయెను. శ్రీరంగేశ్వరు డొనరించిన యీ 'గారడీ'యు గథకు గొంత యలౌకికత్వము నొసగుచున్నది. విష్ణువు తన్నే సకల మని నమ్మిన యమాయికభక్తు నట్లాటాడించుటయు బ్రకృతి విరుద్ధముగనే యున్నది. విష్ణుచిత్తుడు "మోగాంధూబద్ధముగుద్విపద్ద్విరదు"డట. అట్లు బంధించిన కోపము చేతనే కాబోలు విష్ణు డాతని నట్లు విలపింప జేయుట!

నాయికయైన గోదాదేవిశీలమునందును గాన్యమున దగినంత యున్మీలనము గానరాదు. ఆ యున్మీలనమునకు జాలిన విస్తృతియు నచ్చట గథలో మృగ్యమై యున్నది. ఆమె విరహముతక్క మఱేభావమును నిందు వర్ణింపబడియుండలేదు. ఆ విరహముమాత్ర మనన్యప్రబంధసామాన్యముగా, నద్భుతముగా సాగినది. భక్తిగర్భితమైన యిట్టి పవిత్రవిరహము తెలుగువాఙ్మయమున మఱెచ్చటను గానరాదు. ఇతరప్రబంధములలోని విరహము తుచ్ఛకామమునకు సంబంధించినది; ఇది యతిపవిత్రప్రణయమునకు సంబంధించినది. గోదాదేవి సత్త్వసంపన్న యయ్యు శ్రీరంగేశుడు తన్నంతిపురి జేర్చినప్పుడు పెంచి పెద్దగా జేసిన తన తండ్రిమాట యించుకయు స్మరింపకపోవుట యెంతయు వింతగానున్నది.

కృష్ణరాయలు తన కావ్యమునందలి వస్తువు ననవసరదీర్ఘముగా గావించి వస్త్వైక్యమును జెఱచినను నచ్చటచ్చట దృశ్యకావ్యోచితములైన రమణీయసన్నివేశములను గల్పించినాడు. విష్ణువు పాండ్యరాజు సభకు దన్నరుగుమని చెప్పినప్పు డది యోటమికి గారణమగునేమో యని మనవిచేసికొనినప్పుడును, శ్రీరామమిశ్రుడు మీపెద్దలు సంపాదించిన నిక్షేపమును జూపెద నని కొనిపోయి యామునాచార్యునికి శ్రీరంగేశుని పాదపద్మముల జూపునప్పుడును, గోదాదేవి యందలమున గానిపింపకపోగా విష్ణుచిత్తుడు విష్ణునిపై నేరము మోపుచు మొత్తుకొనునప్పుడును నా దృశ్యములు పఠితల మనోనేత్రములకు బ్రత్యక్షములై యింపు గొల్పుచున్నవి. మిగిలిన పురవృష్ణ్యాదివర్ణనము లీగ్రంథమున బ్రబంధసామాన్యముగానే యున్నవి. మొత్తముమీద కృష్ణరాయలలో సంక్షేపశక్తికంటె విస్తరణాభిలాష మెండు.

కృష్ణరాయలకు భక్తిజ్ఞానవిరహితమైన చదువుపై కంటె విద్యారహితమైన జ్ఞానముమీదనే గౌరవము హెచ్చు. ఈ విషయము నాతడు రెండుచూడుచోట్ల వ్యంగ్యముగను, వాచ్యముగనుగూడ సూచించినాడు. విష్ణుచిత్తు "డురుచ్ఛందోబృందతదంతవాగపరనాసంజాతతజ్జన్యనిష్పందద్వైతసుసంవిదాలయుడు", "అపఠితశాస్త్రగ్రంథజాత్యంధుడు." పాండ్యరాజసభలో నాతనితో వాదింపవచ్చినవారు సర్వశాస్త్రపారంగతులైన మహావిద్వాంసులు. కాని విష్ణుచిత్తుడు వారి నందఱ నవలీల జయించి తన మతము స్థాపింపగల్గినాడు. అట్లే మాలదాసరి నిరక్షరాస్యుడు. కాని విష్ణువునకును, దనకును గల శేషశేషిత్వసంబంధం బనాద్యంబుగా దెలిసిన మహాజ్ఞాని. బ్రహ్మరాక్షసుడు వేదవేదాంగపారగుడు. మాలదాసరి తన జ్ఞానముచేతను, శీలముచేతను నాతని కచ్చెరువు కలిగించి యాతని దన భక్తునిగా జేసికొనజాలినాడు. ఈ విషయము నే యాతడు "అఖర్వనిర్వృతిం గాంచి సుఖించు పరమ

యోగికి బహుక్లేశదంబులను చదువులకలనం బని యేమి" యనియు, "నిదురయు గూడు వో జడివి నే నిట గన్నది యేమి? యెవ్వ డీ చదువుల యర్థవాదపు మృషల్ గని చెల్పడు" ననియు వాచ్యముగాగూడ జెప్పినాడు.

విషయలాలసులై హరిస్మరణ మాని కాలము పుచ్చువారిని దత్త్వచింతాసక్తుల నొనరించుటకు గృష్ణరాయ లవలంబించిన మార్గము వింతయైనది. "తొలిబడ విషయాతురు నవి విషవు మనుటకంటె గలదె వేషిపగ, నేర్పెర గథాదుల నొకటంబడి దోపంబలికి మైత్రివాపుట యొప్ప" నని యతని మతము. చిన్నంగిని రక్తము పూర్తిగా గ్రోలనిచ్చి దాని నోరిజింకను దివియు వేటకానివలె విషయాభిలాష దత్త్వష్టీర నిచ్చి మానవుల ద్రిప్పుట సులభ మని యాతడు దాని కిచ్చిన నిదర్శనము. యోగము మఱచి రాజ్యభోగలాలసుడై యుండిన యామునాచార్యునికి శ్రీవిష్ణుపాదముల సంస్కృతికి దెచ్చుటకు శ్రీరామమిశ్రు డుపయోగించిన యుపాయ మిట్టిదే.

పద్యములలోని భావములు, భావనాసంపద, ప్రకృతిదృశ్యపరిశీలనము, వర్ణనలయందలి వైపుల్యసామగ్ర్యములు, సూక్ష్మములో మోక్ష మన్నట్లు చిన్న సమాసములో గొంపెంత యర్థము నిముడ్చుట మున్నగు కృష్ణరాయల కవితాగుణములు మాపెజూపె నెట్లన్నైరువు కలిగించునో కథావస్తునిర్మాణమునను, పదప్రయోగమునను నాతడు చూపిన యశ్రద్ధను జూచిన నంత విచారము కలుగును. విష్ణుచిత్తుని వర్ణనముతో నారంభించిన కథ గోదాదేవివివాహముతో ముగియును. ముద్రారాక్షసమున సిద్ధార్థకు నెన్న త్రీ కావ్యమున ముఖసంధిలో నొకటియు, నుపసంహృతిసంధిలో మఱొకటియు వర్ణింపబడియున్నవి. గోదాశ్రీరంగేశ్వరుల వివాహము మాత్రమే—అనగా చివరి రెండాశ్వాసములందలి విషయము మాత్రమే—ప్రబంధముగా వర్ణించిన వస్తుసంవిధాన మెంతో మనోజ్ఞమై యుండును. కాని యప్పుడు కృష్ణరాయల ప్రధానప్రయోజనము—వైష్ణవమతాధిక్యమును వర్ణించుట—నెరవేరియుండదు. మహారాజు కావున నాతడు కావ్యప్రయోజనముకంటె తన ప్రయోజనమునకే యధికప్రాధాన్య మొసగినాడు.

---

# జిజ్ఞాస

శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్యులు

అది యేనాటి తపఃఫలంబొ గగనోద్యద్దివ్యభాగీరథీ
ముదితోల్లోలతుషారశీతలములౌ భూభాగసచ్ఛాయలం
దుదయంబందిన ఋక్స్రవంతిమధురోహోత్పన్నసంస్కారసం
పద విశ్వంబును ముంచియెత్తినది ప్రాగ్భవ్యప్రభావంబునన్.

చరచర విచ్చి వచ్చెడి యుషఃపరిపూతవిహారవేళలం
గరగిన సృష్టిసంతతి ముఖాముఖి సప్తపదార్థతత్త్వసం
భరితరహస్యమార్గణమునం దది యేమి సమగ్రరూప మం
దిరో కద! వారి సంస్కృతియె సిల్పె జగంబుల సీయుగానికిన్.

ఒక మాని తలచెనా! సకలపరోక్షార్థములు మూతిముంగిట నిలువవలయు;
ఒక సిద్ధు డాడెనా! చకితమై కుధరంబు తలవాల్చి యిల నట్టె కొలువవలయు;
ఒక రాజు దంచెనా! చకచక త్రిదివంబునకు మాఱు త్రిదివంబు నడవవలయు;
ఒక సతి పూనెనా! యిక భాస్కరుడుగూడ వలితక్రమంబున దలకవలయు;
అమరస్రోతస్వి నొక భవ్యు డాచమించె;-పంచభూతంబులుం బరాత్పరుడుగూడ
ఒక్క మానవశక్తి కహో యటంచు-నంజలి ఘటించి దాసోఽహ మనియె నాడు.

త్రికరణవిశుద్ధసుచ్ఛందదివ్యవాత-పరిమళామృతసంపృక్తభారతీయ
విమలవిజ్ఞానరుగ్భగ్నవీర్యమైన-జగము గనుగట్టి క్రమ్మె నీర్ష్యాతమస్సు;
కాలగతి నడుమ దవిలి కవిసికొన్న-దుర్విషాదప్రవర్షి విద్యుత్సమేత
భయదజీమూతవితతు లభ్రంబుమీద-నొక మహాత్ముని సత్యవాగుగ్రవాత
విఘటితంబులుగా బడి విచ్చిపోయె-పునరభీక్ష్ణప్రచండదీప్తుల వహించి
యరుణగిరిపై స్వతంత్రభాస్కరుడు దోచె-కాని యానాటి సంస్కృతిజ్ఞానగరిమ
మఱల వాసించునో; లేక యిరుల బూన్చి కాలయవనిక యడ్డమై క్రాలగలదొ;
కలదు జిజ్ఞాస; ఎవరు నిశ్చితముగ జోస్యముం జెప్పువారలు? శూన్యదృష్టు
ల న్నిరీక్షించవలెనె యిలాతలాన?

# ఆంధ్రులు ఆర్యులు కారా?

○

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

ఆంధ్రులు ద్రావిడు లని, ఆంధ్రభాష ద్రావిడ భాష యని, తన్మూలముగా సంస్కృతాది భాషలకన్న విలక్షణ మని యొక వాదము కలదు. ప్రప్రథమమున ఆంధ్రుల ప్రసక్తి ఐతరేయబ్రాహ్మణమున కలదు. శునశ్శేపుని యుదంతమున నీ ప్రస్తావన గలదు. అజీగర్తుని పుత్రుడగు శునశ్శేపుడు వధ్యపశుస్థానమునుంచి విశ్వామిత్రునిద్వారా విముక్తుడై, విశ్వామిత్రునిచే జ్యేష్ఠపుత్రుడుగా పెంచుకొనబడినాడు.

“తస్య హ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః. పంచాశ దేవ జ్యాయాంసో మధుచ్ఛందసః. పంచాశత్కనీయాంస స్తద్యే జ్యాయాంసో నతే కుశలం మేనిరే. తానను వ్యాజహారాంతాన్వః ప్రజాభక్షీష్టేతి. త ఏతేఽంధ్రాః, పుండ్రాః, శబరాః, పులిందా, మూతిబా, ఇత్యుదంత్యా బహవో భవంతి.” (౭-౧౮)

అని ఐతరేయబ్రాహ్మణవాక్యము. విశ్వామిత్రునకు నూర్గురు పుత్రులు. మొదటి యేబదిమందికి ఈ పెంపుడు నచ్చకపోవుటచే పితృవాక్యమును ధిక్కరించినవారైనారు. క్రుద్ధుడై ఋషి వీరిని శపించినాడు. ఆ శాపమువలన ఆర్యజాతులనుంచి వెలిబెట్టబడి ఆర్యదేశపు సరిహద్దులలో నున్న ఇతరులతో కలసి వివాహాదికముల నెరవేర్చుకొనసాగినారు. వీరివలన నుత్పన్నమైన జాతులు ఆంధ్రులు, పుండ్రులు, శబరులు, పులిందులు, మూతిబులు నని బ్రాహ్మణవాక్యము. ఈ వాక్యమును సరిగా అర్థము చేసికొనకపోవుటచే బయలుదేరినవి ద్రావిడాదివాదములు.

ఆంధ్రాదులు విశ్వామిత్రుని సంతతి యని ఇచట గలదు. అనగా ఆర్యజాతులు, ఆర్యసంప్రదాయము కలవారు ఆంధ్రాదు లని స్పష్టముగా అర్థమగుచుండగా వీరిని అనార్యు లని యెంచుట ‘బుద్ధిజాడ్యజనితోన్మాదము’. అనార్యులతో కలసిన వీరు, కేవలము అనార్యులు కాజాలరు. పైగా అనార్యశబ్ద మీ ప్రసక్తిలో ప్రయోగింపబడలే దనికూడా మనము గుర్తించుకొనవలెను. ఇక ఆంధ్రు లెవరో తెలిసికొనుటకుముందు, సూక్ష్మముగా పుండ్రాదులనుగురించి ఆంధ్రులతో కలిసి వర్తించినవారినిగురించి తెలిసికొనుట యుక్తము.

### ౨

పుండ్రనామధారు లెవరో చూతము. బోధాయనాది సూత్రగ్రంథములలోను (౧-౨-౧౪), మనుధర్మశాస్త్రమునను (౧౦-౪౩-౪) పౌండ్రకశబ్దము కన్పించుచున్నది. బాలేయక్షత్రులగు పుండ్రులు పురాణేతిహాసములలో కన్పించుచున్నారు[1]. అంగ, వంగ, కలింగ, కాశీ, కోశల, కరూషాదులతో పుండ్రులను సహితము వాసుదేవుడు జయించినట్లు ద్రోణపర్వమున కలదు (౧౧). అంగ, వంగ, కలింగ, పుండ్రులకు జరాసంధు డధిపతి యని హరివంశము (౧౧౬). కిష్కింధకాండలో (౪౧-౧౨) పుండ్రదేశము దాక్షిణాత్యము దని కలదు. కావ్యమీమాంసలో (౧౭) రాజశేఖరుడు ప్రాగ్జ్యోతిష, తామ్రలిప్తలతో పుండ్రులను ప్రాచ్యభాగమున నిర్దేశించినాడు. కాని పురాణాదులలో కలింగదేశము వెన్వెంట చెప్పబడుటచే పుండ్రులు దాక్షిణాత్యు లని నొక్కి చెప్పవచ్చును. ఐనను ఒకానొకప్పుడు వీ రార్యు లని, ఉత్తరాపథవాసులని యనుటకు రాజశేఖరుని వచనము ఆధారము. ఈ పుండ్రులకు పౌండ్ర, పౌండ్రక, పౌండ్రిక అను పేర్లు కల వని

---

1. బ్రహ్మపురాణ ౧౩-౩౦-౧; అగ్నిపురాణ ౨౭౫; మత్స్య ౪౮-౧౯; విష్ణు ౪-౧౮. ౧-౨; ఆది పర్వ ౧౦౪; గరుడ ౧౪౩-౫-౭౧.

తెలియవచ్చుచున్నది. కాని సభా (౫౨), భీష్మ (౯) పర్వములలో పుండ్రశబ్దము వేరు, పౌండ్రశబ్దము వేరు అని చెప్పబడినది. భీష్మ (౯), ద్రోణపర్వములలో వీరు ఉడ్ర, ఉత్కల, మేకల, కళింగ, ఆంధ్రులతో పేర్కొనబడినారు. మత్స్యదేశమునకు తూర్పు హద్దుగా పుండ్రవర్ధన మని 'దివ్యావదానము' చెప్పుచున్నది. యువాన్‌చ్వాంగ్ అశోకుని కాలపు స్తూపములను "పున్-న-ఫ-తన్-న" మున చూచినాడు. ఈ పుండ్రవర్ధనము నవీనబోగ్రానగరసమీపములోనిది. కాగా పుండ్రులు ఆర్యావర్తమునుండి వింధ్యపర్వత ప్రదేశములకు వచ్చిన ఆర్యులే కాని వేరు కాదని సిద్ధాంతము.

## 3

ఇక శబరు లెవ్వరో గమనింపవలసిన విషయము. మత్స్య (౧౪౪-౪౬-౮), వాయు (౪౫-౧౨౬) పురాణములు శబరులను 'దక్షిణాపథవాసినః' అనినవి. మహాభారతమున—

"దక్షిణాపథజన్మానః సర్వే నరవరాంధ్రకాః
గుహాః పులిందాః శబరా శ్చుచుకా మద్రకైః సహ"
(౧౨-౨౦౭-౪౨)

అని గలదు. ఆంధ్రులు, గుహులు, పుళిందులు, చుచుకులు, మద్రకులు, శబరులు దాక్షిణాత్యు లని అర్థము. 'శబరై' అనుదేశము నొకదానిని 'టాలెమీ', 'సుఅరి' (*Suari*) అని 'ప్లినీ' పేర్కొనినారు...... పెన్నానదీపర్యంతము వీ రున్నా రని కన్నింగ్‌హామ్ చెప్పినాడు. రామాయణమున (౧-౧-౫౫; ౩-౭౭-౬) శబరీవృత్తాంతము కలదు. శబరిని కాని, గుహుని కాని ద్రావిడు లని, అనార్యు లని చెప్ప వీలులేదు. నేటి విశాఖపట్టణపు జిల్లాప్రాంతములలో కన్పించు సవరలే ఐతరేయబ్రాహ్మణకాలపు శబరులు.

మహాభారతమున నీ జాతులతోపాటు మద్రకులు చెప్పబడినారు. సామవేదీయమగు వంశబ్రాహ్మణమున మద్రగారశౌంగాయని యను వైదికఅధ్యాపకుడు పేర్కొనబడినాడు. వేదాధ్యయనమునకై మద్రదేశమునకు వెళ్లెడివా రని శతపథమున గలదు. యజ్ఞవిధిని నేర్చుకొనుటకై మద్రదేశమున కేగితి నని ఉద్దాలకఆరుణి బృహదారణ్యకమున చెప్పినాడు (౩-౭-౧). ఐతరేయ బ్రాహ్మణమున ఉత్తరమద్రము పేర్కొనబడినది (౮-౧౪-౩). ఈ మద్రదేశము కాశ్మీరప్రాంతమున గలదు. అనగా ఆంధ్ర, పుళింద, శబరాదులు ఉత్తరదేశమునుండి, అనగా కాశ్మీరప్రాంతమునుండి దక్షిణమునకు వచ్చినా రని తేలగలదు.

## ౪

ఈ జాతులతో అనేకపర్యాయములు చెప్పబడినట్టి కళింగులను గమనింతము. గోమతికి పశ్చిమముగా కళింగనగరము కల దని రామాయణము (అయోధ్య ౭౩-౧౪,౧౫). శతద్రువాసులను కళింగులను మార్కండేయపురాణము పేర్కొనినది (౫౭-౩౭). ఇది సత్యదూరము కాజాలదు. మహారాష్ట్ర, మహిషక, ఆభీర, వైశిక్య, శబర, పుళిందాదులతో కళింగులను మార్కండేయమే చెప్పినది (౫౭-౪౬-౭). అనేక కళింగరాకుమారులు ఆర్యస్త్రీలను పెండ్లాడినట్లు మహాభారతమున గానవచ్చుచున్నది (ఆది ౯౫-౩౭౭౪-౫, ౩౭౮౦; ద్రోణ ౭౦-౨౪౩౬). ఆంధ్రదేశపు సరిహద్దులనుంచి, ఒరిస్సాలోని వైతరణీతీరముదాక నున్న రాజ్యము కళింగ మని భారతము (౩-౧౧౪-౪) నిర్వచించినది. బోధాయనుడు (౧-౧-౩౦-౧) కళింగులను 'సంకీర్ణయోనయః' అనినాడు. అనగా ఐతరేయము చెప్పినట్లు, ఆర్యులు తదితరులతో కలసిపోగా వ్యవహరింపబడినవారిలో కళింగు లొకరు. మహాభారతమున (౫-౪౮-౭౬) దంతకూర అనియు, శాసనములలో దంతపుర అనియు, పలుకబడు కళింగుల ముఖ్యనగరము జాతకకథలలో దంతపురనగర మని కన్పించుచున్నది. మహాభారతమున (౧౩-౪-౩) రాజపురము కూడ కలదు. మహావస్తులో నేటి సింగపురమే సింహపురముగా నీయబడినది. సిరిమేఘవణ్ణుని కాలమున సింహళమునకు బుద్ధుని దంతము కళింగమునుండి తీసికొనిరాబడినది.

అలెగ్జాండరు దండయాత్రాకాలమున గంగానదీలోయలో 'ప్రాశీ' (*Prasii*) 'గంగరిడై' (*Gangar-*

*ai*) దేశములు కలవని, వీని రాజు 'క్సంద్రామ్మెస్' (*Kandrammes*) లేక 'అగ్రామ్మెస్' (*Agrammes*) అని పిలువబడినాడు. ప్రాశియొక్క ముఖ్యపట్టణము పాలిబోత్రి లేక పాటలీపుత్రము. వీరికి తూర్పుగా కళింగులు కలరని ప్లినీ. వీరు సముద్రతీరస్థులు; వీరిదేశము పైగా 'మందాపా', 'మల్లు'లు కలవు. కళింగుల ముఖ్యనగరము 'పర్థలిస్'. వీరిదే గాక మక్కో కలింగే (*Maccokalingae*), మొడోకలింగ (*Modokalinga*) అను కూడ ప్లినీ పేర్కొనినాడు. వీరిలో మొదటిది ముఖలింగ మని యెంచుట పొరబాటు గాన ముఖ్యకలింగ మనవలెను. వీరు మేకల కలింగులు కావచ్చు నని కొందరి అభిప్రాయము. మందాపా, మల్లలు సింధునదీతీరవాసులు. కళింగులు ఆ దేశమునుండి బయలుదేరి గంగానదీ తీరమునకు వచ్చి, తూర్పుతీరముల కొంత కాలము వసించి ఆంధ్రదేశమునకు వచ్చిన ఆంధ్రులే కాని అన్యులు కారని ఈ విషయములవలన స్పష్టమగుచున్నది. ఆర్యజాతులలో ఒకరనుటకు నేటి బర్ద్వాన్‌కు సమీపమందలి పూర్వ ... యను గ్రామమే ప్రాచీనకళింగుల ముఖ్యనగరమగు పర్థలిస్ అని ఋజువగుట ముఖ్యకారణము. మహాశివగుప్త యయాతి తాను త్రికలింగాధిపతి నని చెప్పికొనినాడు. ఈ త్రికళింగము వింధ్యకు సమీపము.

"కళింగదేశే పశ్చార్ధే పర్వతే అమరకంటకే" అనుచో కళింగదేశపశ్చిమఖండమున అమరకంటక మను గిరి కలదని పురాణములు పల్కుచున్నవి. కావున కళింగులు ఆర్యులు. వీరే ఆంధ్రులు. ప్లినీప్రకారము (1) గంగరిడే—కళింగే అనగా గంగాతీరదేశపు మనువారగు కళింగులు, (2) మక్కోకలింగే, అనగా ముఖ్యకళింగు లనబడు ప్రధానఆంధ్రులు, (3) కలింగే అనబడు శేషించిన ఆంధ్రదేశవాసులు స్మరింపబడినారు. ఈ మూడు దేశములు కలసి త్రికళింగము, లేక త్రిలింగ మైనది. త్రికళింగమనగా అమరావతీప్రాంతము, మహేంద్రప్రాంతము, వరంగల్ ప్రాంతము—అని అర్థము. గంగాతీరమున నున్న వీరు క్రమముగా దక్షిణమునకు వచ్చినారు. గోదావరీనదికి దక్షిణగంగ యను నామము కలదని అందరకును తెలిసిన విషయమే. వీరు గంగరిడే-కళింగులు. వింధ్యప్రాంతము నుండి ఓరుగల్లునకు వచ్చిన కళింగులు 'మొడోకళింగులు'. ఈ శబ్దమును గాంచి కాల్డ్వెల్, తదనుయాయులు తెనుగులోని మూడను సంఖ్య అతిప్రాచీనమని, అనగా ఆర్యభాషాభిన్నమని పొంగినారు. కాని గ్రీక్ భాషాశాస్త్రమర్యాద ననుసరించినచో 'మొడోకళింగ' మనగా 'మధ్యకళింగ'మని తేల గలదు. అమరావతీప్రాంతపు కళింగులు ముఖ్యకళింగులు. అనగా గోదావరీప్రాంతమువరకు కొందరు, కృష్ణాతీరమువరకు కొందరు, తన్మధ్యభాగమున నొక కొందరు నిలిచిపోయినారు. కాలక్రమేణ గోదావరికి ఉత్తరపువారే కళింగు లని ప్రామాణవాదము వచ్చినది.

యువాన్‌చ్వాంగ్ ఓఢ్రదేశమునుండి 'కంగోదా'కు వెళ్లినాడు. ఇటనుండి చాల యోజనములు అడవులలో వెళ్లి క-లింగ్-క చేరినాడు. 'వీరి భాష, ఆచారములలో వీరు మధ్యదేశీయులకన్న భిన్నులు' అనినాడు. అనగా అప్పటికి ప్రాకృతభాషలలో భేదములు చాలా వచ్చినవి. ఈ కళింగదేశములో పిష్టపుర మనబడిన నేటి పిఠాపుర మున్నది.

౫

మహాభారతమున ఆంధ్రులతోపాటు ఉత్కల, మేకల, నిషాదులుకూడ పేర్కొనబడినారు. 1 సుషేణుని సైన్యము దక్షిణముగా మేకల, ఉత్కల, దశార్ణ దేశములకు పోవలయు నని సుగ్రీవు డాదేశించినాడు (కి-४౨). వనపర్వమున ఉత్కళము కళింగదేశపు భాగమని గలదు (౧౧४). రఘువంశమునాటికి ఉత్కళము వేరు, కళింగము వేరు.

> "సనకైస్తు క్రియాలోపా దిమాః క్షత్రియజాతయః
> వృషలత్వం గతా లోకే బ్రాహ్మణా దర్శనేన చ
> పౌండ్రకా శ్చౌడ్రద్రావిడకంబోజయవనాః శకాః
> పారదః పహ్లవ శ్చీనాః కిరాతా దరదాః ఖశాః."

అని మానవధర్మశాస్త్రము చెప్పుచున్నది. అనగా ఓఢ్రులు, పౌండ్రులు, ద్రావిడులు, కంబోజులు, యవనులు, శకులు, పారదులు, పహ్లవులు, చీనులు,

1. ద్రోణ ४-౧౨౨.

కిరాతులు, దరదులు, ఖసులు మొదలగువారు పతితులై, వృషలత్వము జెందిన క్షత్రియులు. అనగా ఈ కాలమునకు ఆంధ్రులలో ధర్మపరిత్యాగము లేదు. ఐతరేయమున వచ్చిన ధర్మలోపము చక్కబెట్టబడినది.

'మొనెడిస్' (*Monedes*) 'సువరి' (*Suari*) లకు మధ్యగల 'మలెఉస్' (*Maleus*) అనుగిరిప్రాంతమువారు 'ఒరెటెస్' (*Oretes*) అని ప్లినీ వ్రాసినాడు. ముండా జాతులకు శబరులకు మధ్య నున్నవారు ఓఢ్రులు. నర్మదకు మేకలకన్యయని పేరు గలదు. మేకలులు వింధ్యప్రాంతీయులు. వీరుకూడ పతితులైన క్షత్రియులే. నిషాదులు భిల్లులని వాజసనేయి (౧౬-౨౮) వ్యాఖ్యాతయగు మహీధరుని అభిప్రాయము. వీరందరు వింధ్యపర్వతప్రాంతీయులు. వీరు అనార్యులు కారని, పతితులైన ఆర్యులనియు సంప్రదాయ వచనము.

ఇక దమిళులు. బౌద్ధగ్రంథములలో—ముఖ్యముగా దీపవంశ, మహావంశ, చూళవంశములలో—వీరి ప్రసక్తి కలదు. 'విమతివినోదనీ' యను వినయగ్రంథ వ్యాఖ్యాతయగు కస్సపథేరా తమిళదేశీయుడని శాసనవంశమున (౩౩) గలదు. మహావంశటీకలో దమిళులు బౌద్ధస్తూపముల ననాదరించువారని కలదు. వీరు సింహళముపై ననేకపర్యాయములు దండెత్తినారు. యవన కిరాతులకన్న మాత్రమే వీరు భిన్నులుగాక, ఆంధ్రులకన్న వీరు భిన్నులని బుద్ధఘోషుని వ్యాఖ్యాతలు పల్కుచున్నారు. అనగా దమిళులు ఆర్యులు కారు. ఆర్యులగు ఆంధ్రులకన్న భిన్నులు. ఆర్యులు కాని యవనులకన్న భిన్నులు. ఇట్టి ద్రావిడముతో నాంధ్రభాషను ముడిపెట్టుటకు సంప్రదాయముగాని, చారిత్రకవిజ్ఞానముగాని అంగీకరించవు.

కిరాతు లుత్తరదేశస్థులని భారతము చెప్పుచున్నది (౧౨-౨౦౭-౪౩). ఆక్సస్ నదీప్రాంతములోని 'సొగ్డియానా' లోని జాతులలో 'కిర్రహడై' (*Kirrhadai*) లను ప్లినీ గమనించినాడు. గంగానదీ ముఖద్వారమునకు కొంచెము పశ్చిమముగా వీరుండిరని 'పెరిప్లస్'లో గలదు. ప్రాగ్జ్యోతిషేశ్వరుడగు భగదత్తుడు కిరాతసైన్యముతో కురుక్షేత్ర యుద్ధమునకు వచ్చినాడని మహాభారతము. త్రిపురాలో నేటికిని జను లాప్రాంతముయొక్క ప్రాచీననామము కిరాతదేశ మని చెప్పికొనుట గలదు. అనగా ఆర్యజాతికన్న విలక్షణమైన జాతులవారు నాల్గు దిక్కులలోను చిట్టచివరలమాత్రమే యుండెడివారు.

పురాణములలో నుత్తరదేశస్థు లనబడిన ఆభీరులు పశ్చిమదేశీయులుగా టాలెమీ, పెరిప్లస్, శాసనములు, భారతము (సభా ౫౧) చెప్పుచున్నవి. సరస్వతీనది అంతరించుదేశము వీరి దని పల్కు భారతము (౯-౩౭-౧), మహాభాష్యము (౧-౨-౫) వీరిని శూద్రులతో కలిపి పల్కుచున్నవి. అలెగ్జాండరు కాలమున 'సొద్రొఇ' (*Sodroi*) లేక 'సొగ్డొఇ' (*Sogdoi*) లు వీరి పూర్వులు. కాలక్రమేణ వీరు వింధ్యపర్వతపశ్చిమభూములకు వచ్చి సౌరాష్ట్రులతో కలసిపోయినారు. విష్ణుపురాణము, టాలెమీ, పెరిప్లస్ ఇందులకు ప్రబలాధారములు. ఈ ఆభీరులు ఆర్యజాతులు కారనియు పైవిషయములవలన తెలియుచున్నది.

## ౬

శాంఖాయనశ్రౌతసూత్రమున (౧౫-౨౬-౬) మూచీప, మూవీప అను శబ్దములు కలవు. మార్కండేయపురాణమున మూషికు లున్నారు (౫౭-౪౬). నేటి హైదరాబాదు నగర మున్న 'మూసి' నదీతీరవాసులే మూతిబు లని చెప్పవీలున్నది. 'మోస్ట్ల్—గళింగ'కు ఆవలనున్న దేశము నాక్రమించిన 'మోడుబె' (*Modubae*) లను ప్లినీ పేర్కొనినాడు. కాగా ఐతరేయ మందలి మూతిబులు మధ్యకళింగమునకు అనగా ఓరుగల్లునకు పశ్చిమముగా నున్నవారు. వీరిని మూషికులు అనికూడ అనెడివారు. అలెగ్జాండరుకాలమున సింధునదీతీరమున గల 'మూసికనోస్' (*Mousi kenos*) లు మూతిబులే. అనగా మూతిబు లొకానొకప్పుడు ఉత్తరాపథులగు ఆర్యజాతులలోనివారని తేలగలదు. మూసిక నగరమును జయించినట్లుగా ఖారవేలుడు చెప్పికొన్నాడు. దక్షిణమునకు వలసవచ్చిన వీరు హైదరాబాదుప్రాంతమున నిలచిపోయి, రాజ్యమును స్థాపించు

కొని, క్రమేణ ఆంధ్రులలోను, మహారాష్ట్రులలోను గలసిపోయినవారే పూతిబులు.

## ౪

పుళిందులు దాక్షిణాత్యులని మహాభారతవచనము (౧౨-౨౦౭-౪౨).

"తేషాం పరే జనపదా దక్షిణాపథవాసినః
కారూషాశ్చ సహైషీకా ఆటవ్యాః శబరా స్తథా
పులిందా వింధ్యపుషికా వైదర్భా దండకైః సహ"

అని మత్స్యపురాణము (౧౧౪-౪౬-౮)పల్కగా,

"ఆభీరాః సహ చైషీకాః ఆటవ్యాః శబరా శ్చ యే
పులిందా వింధ్యమూలికా వైదర్భా దండకైః సహ"

అని వాయుపురాణము (౪౫-౧౨౬) పల్కుచున్నది. అనగా పుళిందులు వింధ్యపర్వతప్రాంతవాసులు. ఒకానొకప్పుడు యమునానదీపరిసరములలో వసించిన ఈ ఆర్యజాతి కాలక్రమేణ దక్షిణమునకు వచ్చినది. ప్రస్తుతపు బుందేల్ఖండునుండి గోదావరీనదివరకు గల ప్రాంతమున స్వేచ్ఛగా వర్తించసాగిన ఆర్యజాతి ఇది. మార్కండేయపురాణముకూడా పుళిందులను దాక్షిణాత్యులనుగానే (౫౭-౪౫-౮)యెంచుచు పుండ్రక, కేరళ, కళింగ, ఆభీర, ఆంధ్ర, విదర్భ, కుంతులతో చేర్చి పల్కుచున్నది. కాని కిరాత, హూణ, ఆంధ్ర, పుక్కస, ఆభీర, సుహ్మ, యవన, ఖసలతో పుళిందులను భాగవతము కల్పినది (౨-౪-౧౮). దశార్ణదేశమునకు ఆగ్నేయమునగల విదిశాప్రాంతమున వీరి రాజధానియగు పులిందనగర ముండెడిది. నాసిక్, 'ఒజేనె' (ఉజ్జయినీ), మిన్నగర, 'లారికే'లప్రాంతమున, 'బరిగజ' (భరుకచ్ఛ) దగ్గరగా వీరు కలరని టాలెమీ యనినాడు. అనగా ఆర్యావర్తవాసులైన ఈ ఆర్యులు మధ్యదేశమున తమ నాగరకతను చాలకాలము స్థాపించినారు.

ఇక వీరితో జెప్పబడిన దశార్ణులను జాతము. దశార్ణదేశముయొక్క ముఖ్యపట్టణము వేత్రవతీనదీతీరమందలి విదిశానగరము. దీనిని నకులుడు జయించినాడు (సభా ౩౨). భీముడొక దశార్ణదేశమును వశపరచుకొనినాడు (సభా ౩౦). ఇది దక్షిణదేశములోనిది. మేకల, ఉత్కళముల సమీపమున నిది గలదని రామాయణమున కిష్కింధాకాండ. మధ్యదేశమున కాగ్నేయమున నిది గలదని విష్ణుపురాణము. నకులునిచే జయింపబడిన దశార్ణము ఆర్యావర్తములోనిది. అచటినుండి వీరు విదిశాప్రాంతమునకు వచ్చినా రని తేలుచున్నది. కాగా దశార్ణులు, పుళిందులుకూడ ఆర్యులే నన జెల్లును.

## ౮

వాయుపురాణమున (౪౫-౧౨౭) ఆంధ్రులు అంధశబ్దవాచ్యులు. వృష్ణులు, అంధకులు వస్తుతః మధురావాసు లని బ్రహ్మపురాణము (౧౪-౫౪). వీరిని రాక్షసులు ఎదుర్కొనగా, వీరు మధుర వదలి, తమ ముఖ్యపట్టణముగా ద్వారకతిని నిర్మించుకొనినా రని హరివంశమున (౨౭) గలదు. మహాభారతమున (ఉ. ౮౫-౩౦౪; సౌ ౨౫,౨౯) అంధకులకు యాదవులకు అతిసన్నిహితసంబంధము చెప్పబడినది. వీనినిబట్టి ఆంధ్రుల ఆదిమనివాసము బృందావనము. ద్వారవతీనిర్మాణమునకు పూర్వమే మొనసగిన వీరు మధ్యదేశమందలి సాంచీస్తూపముకూడ నిర్మించిరనగా, వీరు ఆర్యావర్తవాసు లని స్పష్టము. 'అపాదాన'మను పాలీగ్రంథమున 'ముండక', 'కోలక', 'చీన'లతో 'అంధక' నామమున ఆంధ్రప్రసక్తి గలదు. 'సుత్తనిపాత' వ్యాఖ్యలో 'అస్సక', 'అళక' లేక 'ముళక' లను నిద్దఱు ఆంధ్రరాజులు అంధకరాజులుగా చెప్పబడినారు. తక్షశిలనుండి విద్యాకాంక్షులటకు ధనార్జనకై వచ్చెడివారు. మంత్రశాస్త్రవేత్త యగు నొక బ్రాహ్మణుడు కోసలదేశమునుండి గోదావరీతీరమందలి అంధకదేశమున కేతెంచినాడని సుత్తనిపాతము చెప్పుచున్నది. ఉద్యోగపర్వమున (౧౮-౫౭౬) వీరు అంధకు లని, భీష్మపర్వమున (౧౦-౩౫౭) ఆంధ్రు లని పిలువబడినారు. సభా (౪-౧౧౯; ౩౦-౧౧౭౫; ౩౩-౧౨౭౦), వన (౫౧.౧౯౮౮) పర్వములలో అంధశబ్దము కన్పించుచున్నది. అనగా అంధ, అంధక, ఆంధ్ర, ఆంధ్రశబ్దములు పర్యాయపదములు.

రామాయణమున (కిష్కింధ (౪౧-౧౧)—.

"నదీం గోదావరీం చైవ
సర్వ మే వానుపశ్యతః
తత్రైవాంధ్రాంశ్చపుండ్రాంశ్చ
చోళాన్ పాండ్రాంశ్చ కేరళాన్"

అని గలదు. గోదావరీప్రాంతమున ఆంధ్రులు తమ రాజ్యమును స్థిరముగా వాల్మీకికాలమునకు స్థాపించుకొనిరి. బృందావనమునుండి బయలుదేరి, దక్షిణమునకు వచ్చిన ఆర్యులు వీరు. ప్రాచ్యదేశీయులనుగా మార్కండేయపురాణము (౫౭-౪౨) 'ఆంధ్రకు'లను లేక 'ఆంధ్రవాకు'లను పేర్కొన్నది. దక్షిణదేశీయులనుగాగూడ నీ పురాణమే (౫౭-౪౯,౯) చెప్పుటచే వస్తుతః ఉత్తరదేశమున తూర్పుగా నున్న ఆర్యులే దక్షిణమునకు వచ్చిన ఆంధ్రు లని భావము. ప్లినీ వీరిని 'ఆందరే' (*Andarac*) అని పిలిచినాడు. యువాన్ చ్వాంగ్ 'అన్-తో-లో' అనినాడు. వీరి భాష మధ్యదేశభాష కాదు కాని లిపిమాత్రము సమానమే నని పలికినాడు. ఈ లిపిసామ్యము అశోకుని కాలముననే గలదు. పైగా అశోకుని రోజులలో భాషాసామ్యము కూడ గలదు. ఈవిషయము లన్నింటివలన ఆంధ్రులు ద్రావిడులు కారని తేలుచున్నది. తన్మూలమున ఆంధ్రభాష ద్రావిడభాష కాజాలదు.

ఇక ఐతరేయవచనమునకు పోవుదము. ఆంధ్రాదులు విశ్వామిత్రుని సంతతి, అనగా ఆర్యులు. కాని ధర్మలోపమువలన, ఆర్యసంస్కృతిసంప్రదాయములకు భిన్నముగా వర్తించుటచేత వీరిని మిగిలిన ఆర్యులు వెళ్లగొట్టినారు. ధర్మపతితులైన వీరు, ధర్మమునకు అంధు లగుటచే వీరిని అంధు లని, ఆంధ్రకు లని పిలిచినారు. అంతే కాని వేరొక కారణ మేమియు కన్పించదు.

## ౯

మహాభారతము కళింగదేశమును మూడు చోట్ల చెప్పినది. ప్రాచ్యభాగమున, మధ్యదేశమున, దక్షిణాపథమున కళింగములు కలవు. ప్రాచ్యమున గంగరిడే-కళింగ మని ప్లినీ. ఈ కళింగ ముత్తరకళింగము నర్మదాతీరమునుండి గోదావరివర కున్న దేశము. మధ్యదేశకళింగమును, ప్లినీ మెడో-కళింగ్ అనినాడు. ఇది వింధ్యపర్వతమునుండి ఓరుగల్లువర కున్న మధ్యదేశము. మూడవది దక్షిణకళింగము అనబడు మరొక కళింగ లేక ముఖ్యకళింగము. ఇది గోదావరినుండి పెన్నానదివర కున్న దేశము. ఇవన్నియు కలిసి త్రికళింగము క్రమేణ త్రికళింగశబ్దము త్రిలింగశబ్ద మైనది. మార్కండేయపురాణమున కూడ ఉత్తర, మధ్య, దక్షిణ కళింగములు చెప్పబడినవి. ఇవి క్రమముగా ఉత్కల, కళింగ, ఆంధ్రదేశము లని చెప్పబడినవి. ఇట ద్రావిడ ప్రసక్తి యే లేదు. కావుననే యుద్ధమల్లుని బెజవాడ శాసనమున సహితము "వేంగీధరణీ పతి రభూ త్త్రికళింగ కోట్యః" అనికలదు. బర్మాలోని దక్షిణభాగమునకు "రమణ్ణదేశ"మను పే రున్నది. ఇచటి ప్రజలను 'తలైంగ్' (*Talaing*) లందురు. మలయాద్వీపకల్పములో 'క్లింగి' లను వారు కలరు. ఈశబ్దములు రెండును త్రికళింగమునుండి,అనగా త్రిలింగమునుండి ఉత్పన్నము లైనవే.



# ఏరు పొంగింది

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

ఏరు పొంగి వచ్చినాది
గోదేరు పొర్లి వచ్చినాది
ఏరు పొడిచి వస్తావుంటే
ఓరి వెఱ్ఱి వెంకటయ్యా !
అడ్డుకట్టు వేస్తానంటూ
అంగలారుస్తావ నీవ్రా — ఏరు.

మంచుకొండల మరగి
బలము చిక్కిందోసి
ఇంతోటి పాయకూ
ఏడుకడియల్లోన
గట్టుకట్టి వేస్తా నంటావు
కట్ట పోయిస్తా నంటావు — ఏరు.

పాటి రేవులు పడిననాడు
ఇసుకతిన్నెలు పిచ్చునాడు
మొలబంటి యేరురా
మోకాలు లోతురా
చీమమందలు తడుప
శక్తి లేదని యెంచి
చిటికెలో వారధి చేరుస్త నంటావు
తటుకున నడచిపోతా నంటావు — ఏరు.

కాలమంటే నిడుపుగీతా
కాదురోరన్నా
కాలమంటే మెఱుపుతీగ
లాస్యమోరన్నా
వెనుకకాలము పోయినాదీ
కాల్చుదినములు గడచినాయీ

వానకారు వచ్చినాదీ
ఏళ్లకు
వయసుపొంగులు విరిసినాయీ
అత్తింటికోడలు అడగిమడగి
యుండబోదా
పుట్టిల్లు జేరిన పొంగి నవ్వకపోన — ఏరు.

ఏరు నిండి పారినాదీ
ఒడ్లు తన్ని పూనినాదీ
ఏటివిభవము ఎంచగలవా
చిన్నబుద్ధితో కొలువగలవా
గోదేరుతల్లికి నీటిధనములు చూడ

కోటానకోట్లురా
శంఖాలు పద్మాలురా
ఏటిశక్తిని ఎరుగగలవా
మందబుద్ధి మరచిపోయావా
మద్దిచెట్లను కూల్చు గంగమ్మా
మఱ్ఱిచెట్లను జీల్చు గంగమ్మా
ఏనుగులు సింహాలు ఎనుబోతు లన్నిని

ఊరలాటబొమ్మలు
చేతిపై చిల్కలు
దారియివ్వని కొండలైనా
గుండె చీల్చి దూసిపోతుంది — ఏరు.

ఏటి విల్లువ జూచి నీవు
గుండె బెదర అడలబోకు
ఏటిసంపద జూచి కుమిలి
కంటనీరు కార్చబోకు

గోదేరుతల్లిని ఎరుగంగజాలవా
కరుణాసముద్రముర
కడుపంత చలవరా
నా గుడిసె తేల్చింది
నాపొలము ముంచింది
దొరసాని కాదనకు
తూలనాడగబోకు
ఈవిగల సానిరా
ఎనకముం దరయదు
నీటిధనములు తెచ్చి
నీయింట పోసింది
ఎత్తుకొనలేవురా - ఇంతనునిషివి నీవు
మోయంగలేవురా - పొట్టివాడవు నీవు
చీకుగుండెలవాడ వైతేను
గట్టెక్కి మ్రొక్కులిడరా
చేవగుండెల వీరుడైతేను
తెప్పగూర్చి తేలిపోవర
రత్నాకరుని చేర్చు రాణిరా యీతల్లి
బంగారుపంటలు బొజ్జగల తల్లిరా-ఏరు.
ఏనాటి గోదారి - ఏనాటి గంగమ్మ
ఏనాటిదో మాత - ఎరుగంగ వశమా
కాకతీయుల వెన్క - చళుక్యవిభుల వెనుక
ఇక్ష్వాకులకు వెన్క - శాతకర్ణుల వెనుక
ఉపనిషత్తుల వెన్క - వేదాలకు వెనుక
నిన్న మొన్న కన్నుదెరిచావు
మిన్ను మన్ను గానకున్నావు
నీతరము గాదురా-ఆబ్రహ్మకునుగాదు
ఈ వెల్లువను గట్టు - పేరాసనూ మాను
తల్లివిభవము కళ్ల ద్రావర
శక్తికొలది జుర్రుకోర!
ఏరు పొంగి వచ్చినాది
గోదేరు పొర్లి వచ్చినాది.





విజయవాడలో క్రొత్తగా స్థాపింపబడిన రేడియోస్టేషన్ భవనము.

# ప్రాక్-పాణిని

శ్రీ శివశంకరశాస్త్రి

## శాకల్య వ్యాకరణము

శాకల్యేన తతో గీతం శాకల్యం దేవరంజనమ్.

"సంబుద్ధౌ శాకల్య స్యేతా వనార్షే" (౧-౧-౧౬), "ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ" (౬-౧-౧౨౭), "లోపః శాకల్యస్య" (౮-౩-౧౯), "సర్వత్ర శాకల్యస్య" (౮-౪-౫౧) అని పాణిని అష్టాధ్యాయిలో శాకల్యుని నాలుగుమారులు పేర్కొన్నాడు. ఇంతే కాక "ఋత్యకః" (౬-౧-౧౨౮) అను సూత్రమున శాకల్యమతము ననువర్తించినాడు. కాత్యాయనుని ప్రాతిశాఖ్యలో శాకల్యుని నామము కానవచ్చుచున్నది. "అవికారం శాకల్యః శషసేషు" అని అందు స్మరించినాడు. శతపథబ్రాహ్మణమునగూడ శాకల్య నామ మున్నది (౧౧-౬-౩౩). శకలమున్యంతరాపత్యము శాకల్యుడు. తత్ప్రోక్తవ్యాకరణనామము శాకల్యము. శ్రీతత్త్వనిధిమతప్రకారము సుప్రసిద్ధ నవవైయాకరణులలో శాకల్యుడుకూడ నున్నాడు.

వటకృష్ణఘోషమహాశయుడు శాకల్యుడు శౌనకీయఋక్ప్రాతిశాఖ్య మూలప్రవక్త యన్నాడు. దీనిపై జర్మన్ విద్వాంసుడు *Paul Thieme* ఇట్లు వ్రాసినాడు: ***"There is no proof as to the statement that Sakalya was the original author of Rik-Pratisakhya, because the tradition is that it is of Saunaka."*** పండితప్రవర క్షేత్రేశచంద్రచట్టోపాధ్యాయుడు ***"Tradition does not know the Rik-Pratisakhya as a work of Sakalya as Ghosh assumes, but ascribes to Saunaka"*** అన్నాడు. ***Max Muller*** మహాశయుడు శాకలప్రాతిశాఖ్య యున్నట్లు వ్రాసినాడు. కాని దాని నే శాకల్యుడు రచించెనో నిస్సందేహముగా చెప్పుటకు వీలులేదు. శాకల్యోక్త నియమావళి ననుసరించి తచ్ఛిష్యులు రచించిన గ్రంథమునకు శాకల్యప్రాతిశాఖ్య మని పేరు వచ్చియుండును. "శాకల్య స్యేమే ఛాత్రాః శాకలాః" (౪-౧-౧౮) అని కాశికలో నున్నది. ఆయనశిష్యులు ముద్గల, గాలవాదు లయిదుగురు ప్రవర్తింపజేసిన శాఖలు— ముద్గల, గాలవ, శాలీయ, వాత్స్య, శైశిరినామముల ప్రసిద్ధములు. "శాకలేన ప్రోక్త మధీయతే శాకలాః" అని జయాదిత్యుడు లిఖించినాడు. కావున శాకల సంప్రదాయసంబంధమగు ప్రాతిశాఖ్య ఉండవచ్చును. మూలపురుషుడగు శకలునివలన శాకలశబ్దము నిష్పన్నమయినను కావచ్చును.

యాస్కుని నిరుక్తమునను, శౌనకుని ఋక్ప్రాతిశాఖ్యలోను శాకల్యుని నామధేయము కానబడుచున్నది. బృహద్దేవతలో అనువాకానుక్రమణికయందు ఆయన పేరు లభించుచున్నది.

"శాకల్యదృష్టే పదలక్ష మేకం
సార్ధం చ వేదే త్రిసహస్రయుక్తమ్
శతాని చాష్టౌ దశకద్వయంచ
పదాని షట్ చేతి హి చర్చితాని." (౪౫)

శాకల్యసంహితలో ౧౫౩, ౮౨౬ పదము లున్నవి. ఋషిసంప్రదాయమున ఈ సంహితకు ఆదరాతిశయ మున్నది. ఏతత్ప్రవచన పూర్తి యగుటతోడనే దేవతలు సంప్రీతులై పుష్పవృష్టి కురిసి రని కింవదంతి.

"శాకల్యస్య సంహితా మను ప్రావర్షత్. శాకల్యేన సుకృతాం సంహితా మను నిశమ్య దేవః ప్రావర్షత్" అని మహాభాష్యమున పతంజలి చెప్పినాడు (౧-౪-౮౪). బ్రహ్మాండపురాణమున శాకల్యుడు దేవమిత్రు డని వర్ణితము (౨-౬౪ అ). ఆయన వేదవిత్తము డని వాయుపురాణము స్తుతించినది.

శాకల్యముని సత్యశ్రీశిష్యుడు; రథీతరశాకపూణి, బాష్కలి, భారద్వాజుల సహపాఠి.

"శాకల్యః ప్రథమ స్తేషాం తస్మా దన్యో రథీతరః
బాష్కలిశ్చ భరద్వాజ ఇతి శాఖాప్రవర్తకాః"—

(బ్రహ్మాండ. ద్వి. పా. ౩౪ అ.) శాకల్య, రథీతరశాకపూణి, బాష్కలి, భారద్వాజులు సత్యశ్రీశిష్యులు, శాఖాప్రవర్తకులు; ముఖ్యులును వైయాకరణులు. అందు శాకపూణి నైరుక్తవైయాకరణుడు. "ఋతో భారద్వాజస్య" (౭-౨-౬౩) అను సూత్రమున పాణిని బాష్కలిభారద్వాజుని స్మరించినాడు. ఈ శిష్యులను గూర్చిన వివరణము వాయుపురాణబ్రహ్మాండపురాణములందును, విష్ణుపురాణమున వీరి పేరులలో కొంచెము భేదమును గోచరించును. తద్భేదము పాఠభ్రంశమూలకము కావచ్చును. శాకల్యుడు ఉత్తరభారతీయమునులయం దగ్రగణ్యు డనియు, విదగ్ధ శబ్దవిశిష్టు డనియు బృహదారణ్యకమునందు గ్రహింపనగును. అతనిని శౌనకుడు ఋక్ప్రాతిశాఖ్యలో స్థవిర శాకల్యు డన్నాడు (౨-౬౪). ఇందుచేతనే ఇరువురు శాకల్యు లున్నా రని కొందరనుట సంభవించినది. వారిమతమున శిక్షాశాస్త్రకారు డగు శాకల్యుడు పదపాఠాదిప్రణేత యగు శాకల్యునికంటె భిన్నుడు. ఇదమిత్థ మని తేల్చుట కిందు వీలు లేదు.

మహర్షి శాకల్యుడు గుణవంతు డయినను దాంభికుడు. మిథిలానగరమున నితడు తరుణయాజ్ఞవల్క్యుని వలన పరాజయము పొందినాడు. (బృహ.) బ్రహ్మాండపురాణమున—

"దేవమిత్ర స్తు శాకల్యో జ్ఞానాహంకారగర్వితః
స జనకస్య వై యజ్ఞే వినాశ మగమత్ ద్విజః"

(పా. ౨. ఆ. ౩౪) అని వర్ణితము. బ్రహ్మవిచారమున నితడు పరాజయరూపమృత్యువును పొందినా డని భావము.

శాకల్యవ్యాకరణవిశేషము లిప్పుడు లభ్యము కావు. అయినను ప్రాతిశాఖ్యాదిగ్రంథములలో బహుస్థానములం దీయనమతము గోచరించుచుండును.

## భారద్వాజీయ వ్యాకరణము

ఉపజీవ్య తతః సర్వం భరద్వాజప్రపంచితమ్
ప్రోవాచ బాష్కలిః శాస్త్రం సుధీశాసనవత్ పరమ్.

"ఋతో భారద్వాజస్య" (౭-౨-౬౩) అని పాణినీయసూత్రము. ఒకప్పుడు భారద్వాజవ్యాకరణ మున్నట్లును, పాణిని దానిని జూచినట్లును దీనివలన స్ఫురించును. భారద్వాజుని గ్రంథనామము తెలియదు. కాని దానిని భారద్వాజవ్యాకరణ మనవచ్చును. ఋక్తంత్రమున మహర్షి శాకటాయనుడు "బ్రహ్మ బృహస్పతయే ప్రోవాచ, బృహస్పతిరింద్రాయ, ఇంద్రో భారద్వాజాయ, భారద్వాజ ఋషిభ్యః..."అన్నాడు. భారధ్వాజ ప్రకాశితమైన ఇంద్రమతవాదమే తరువాతభారద్వాజవ్యాకరణమున ఉపనిబద్ధ మయినట్లు తోచును.

భరద్వాజుని వ్యాకరణము నుద్దేశించియే పాణిని భారద్వాజశబ్దము ప్రయోగించినాడు అని కొందరన్నారు. దీనిని సమర్థించుటకు వీలు లేదు. కాశ్యపవ్యాకరణము కాశ్యపి యనియు, ఆపిశలవ్యాకరణము ఆపిశల మనియు ప్రసిద్ధి యున్నను పాణిని వారిని పేర్కొన్నాడు కాని, గ్రంథములను పేర్కొనలేదు. కావున ఉక్తపాణినీయసూత్రమున గ్రంథకారు నుద్దేశించియే భారద్వాజశబ్దము ప్రయుక్త మయినట్లు గ్రహింపవలెను.

ముండకోపనిషత్తులో భారద్వాజసత్యవాహుని యుల్లేఖన మున్నది. కాని యతడు శాబ్దికాచార్యుడు కాడు. కావున ఆయనను పాణినిస్మృతభారద్వాజు డనుట యుక్తము కాదు. సత్యశ్రీశిష్యుడు బాష్కలి భారద్వాజుడు శబ్దశాస్త్రవేత్త. శాకల్యుడు, శాక

పూణి, ఆయనయు సహపాఠులు. వీ రందరును శాబ్దికులు. గార్గ్యుని బ్రహ్మవిద్యలో పిప్పలాదుని శిష్యుడు. కాని శబ్దశాస్త్రమున ఆయన బాష్కలి భారద్వాజుని శిష్యుడు. గార్గ్యుని నామాంతరము పన్నగారి. బ్రహ్మాండపురాణమున పూర్వభాగములో నిట్లున్నది :—

"బాష్కలిస్తు భరద్వాజ
స్తిస్రః ప్రోవాచ సంహితాః
త్రయ స్తస్యా ఽభవన్ శిష్యా
మహాత్మానో గుణాన్వితాః
ధీమాంశ్చ త్వాపనీపశ్చ
పన్నగారిశ్చ బుద్ధిమాన్
తృతీయ శ్చార్జవ స్తేచ
తపసా సంశితవ్రతాః
వీతరాగా మహాతేజాః
సంహితాజ్ఞానపారగాః
ఇ త్యేతే బహ్వృచః ప్రోక్తాః
సంహితా యైః ప్రవర్తితాః"

భగవాన్ శంకరాచార్యులు బాష్కలి భారద్వాజుని పేర్కొన్నారు. శారీరకభాష్యములో "బాష్కలినా బాహ్వః పృష్టః" (౩-౨-౧౭) అనియున్నది. కావున భారద్వాజుడు శబ్దవిత్తుమాత్రమే కాక బ్రహ్మవిత్తు ననియు తెలియవచ్చుచున్నది.

శాకల్యుని ప్రసిద్ధవ్యాకరణ ముండగా సరిగా ఆకాలముననే భారద్వాజవ్యాకరణ మేల రచిత మయ్యె నను సంశయము కలుగుట సహజము. భిన్నభిన్నసంప్రదాయములను మతములను రక్షించుటకై ఏకకాలమునగాని,ఈషద్వ్యవధిగా గాని నూతన గ్రంథ రచన జరుగుచుండుట విదితమే. హేమచంద్రుడు సిద్ధ సూత్రమును, మలయగిరి ముష్టిసూత్రమును, చంద్రకీర్తి సమంతభద్రవ్యాకరణమును, చంద్రసూరి చంద్రవ్యాకరణమును సమకాలమున రచించినారు.

భారద్వాజసంప్రదాయము గొప్పది; పాణినికి తరువాతకూడ నున్నట్లు గోచరించును. మహాభాష్యమున పలుతావుల "భారద్వాజీయాః పఠన్తి" అని పతంజలి తన్మతమునుగూర్చి యుపన్యసించినాడు. కాత్యాయనునికి పూర్వము భారద్వాజీయులు పాణినీయసూత్రములపై వార్త్తికములు చేసినారు: "దాధాఘ్వదాప్" (౧-౧-౨౦) అను సూత్రముపై "ఘుసంజ్ఞాయాం ప్రకృతిగ్రహణం శిద్వికృతార్థమ్" అనియు; "ఉపవిదజాగృభ్యోఽన్యతరస్యామ్" (౩-౧-౩౮) అను సూత్రముపై "విదేరామ్ కిన్నిపాతనాదా గుణత్వమ్" అనియు; "గోత్రావయవాత్" (౪-౧-౭౯) అను సూత్రముపై "సిద్ధంతు కులాఖ్యాభ్యో లోకే గోత్రాభిమతాభ్యః" అనియు; "భ్రస్జో రోపధయో ర మన్యతరస్యామ్" (౬-౪-౪౭)అను సూత్రముమీద "భ్రస్జో రోపధయో ర్లోప ఆగమో రమ్ విధీయతే" అనియు కానవచ్చుచున్నవి. ఎప్పుడీ సంప్రదాయము లోపించిపోయినదో చెప్పుట కష్టము.

భారద్వాజశ్రౌత సూత్రములు, గృహ్యసూత్రములు నేటికిని కలవు. యాజ్ఞవల్క్యస్మృతిపై 'బాలక్రీడ' యను వ్యాఖ్యలో విశ్వరూపు డిట్లు లిఖించినాడు: "తథా చ భారద్వాజః—'న మ్లేచ్ఛభాషాం శిక్షేత. మ్లేచ్ఛో హ వా ఏష య దపశబ్ద ఇతి విజ్ఞాయతే. తస్మా చ్ఛిష్య ముపనీయ సాధుశబ్దాన్ శిక్షయేత్, సంధ్యోపాసనాగ్నీంధనాని' ఇతి". భారద్వాజుడు ధర్మశాస్త్రకర్త యని దీనివలన తెలియుచున్నది. కౌటిల్యుని అర్థశాస్త్రమునకూడ ఈయననామ మగపడుచున్నది. భారద్వాజుని అర్థశాస్త్రగ్రంథముకూడ నుండెడిదేమో.

## గాలవ వ్యాకరణము

దేవమిత్రస్య శిష్యేణ గాలవేన మహాత్మనా
శబ్దానుశిష్టి రే వైకా వ్యాప్తా తేతి పురావిదః.

"ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య" (౬-౩-౬౧), "తృతీయాదిషు భాషితపుంస్కం పుంవద్ గాలవస్య" (౭-౧-౭౪), "అడ్ గార్గ్యగాలవయోః" (౭-౩-౯౯), "నోదాత్తస్వరితోదయ మగార్గ్య కాశ్యప గాలవానామ్" (౮-౪-౬౭) అను సూత్రములు అష్టాధ్యాయిలో నున్నవి. "ఇకాం యణ్భిః

వ్యవధానం వ్యాడిగాలవయో రితి వక్తవ్యమ్" అని పురుషోత్తముడు లఘువృత్తిలో వ్రాసినాడు. సుపద్మమున "యణో వ్యవధానం వ్యాడిగాలవయోః" అని సూత్రితము (సన్ధి ౪). వీనివలన పాణినికిపూర్వమే గాలవ వ్యాకరణము ప్రచారమున నుండె ననియు, పాణిని దానిని చూచియుండె ననియు ఉపపన్నమగును. పద్మనాభ పురుషోత్తములు గురుపరంపరలోని సంప్రదాయ వచనములు విని యిట్లు వ్రాసియుందురు.

మహాభాష్యములో "ఇకో హ్రస్వో ఽఙ్యో గాలవస్య (౬-౩-౬౧); ప్రాచా మవృద్ధాత్ ఫిన్ బహులమ్" (౪-౧-౬౦); ఇతి గాలవా ఏవ హ్రస్వాన్ ప్రయుంజీరన్, ప్రాక్షు చైవ హి ఫిన్ స్యాత్" (౧-౧-౪౩) అని పతంజలి యన్నాడు. గాలవ వ్యాకరణమునకు గాలవ మనియు, తత్పఠనపాఠనములు చేయు వారికి గాలవు లనియు ప్రసిద్ధి యున్నట్లు గోచరించుచున్నది. గాలవసంప్రదాయ ముండుటచేతనే పాణిని 'గాలవాః' అను పదమును ప్రయోగించెను.

గాలవుని శాకల్యుని శిష్యుడు. అందుచేతనే తత్ప్రవర్తితశాఖకు శాకలశాఖ యని ప్రసిద్ధి కలిగినది. ఏతద్విశేషములు వాయుపురాణమున ౬౦ అధ్యాయమునను, బ్రహ్మాండపురాణమున ౩౫ అధ్యాయములోను చూడవచ్చును. స్మృతిచంద్రికలోను, కాలమాధవమునను గాలవవచనములు ప్రమాణరూపమున నుద్ధృతములు. బృహద్దేవతాగ్రంథమున శౌనకుడు "ఇడస్తుతిం శాకపూణిః పఙ్క్త్యాగ్నీ తు గాలవః"అనియు—

"ప్రాస్తా ప్రేతి ప్రగాథా ద్వౌ
మన్యతే శాకటాయనః
ఐంద్ర మే వాథ పూర్వాం తు
గాలవః ప్రోక్త ముత్తరమ్" (౬-౪౩)

అనియు రచించినాడు.

శాకటాయనునితోపాటు గాలవుని పేరు చూడగా, ఉభయులు సమకాలికు లనిపించును. శాకల్యుని శిష్యుడు, శాకటాయనుని సమకాలికుడు నగు గాలవుడు విశ్వామిత్రశిష్యుడగు ప్రాచీనగాలవుడు కానేరడు. అతడు వేదక్రమకర్త కావచ్చును. వైయాకరణ గాలవుడు గాలవీయశిక్షాప్రవక్త కావచ్చును.

## శాకటాయనీయ త్రిముని వ్యాకరణము

తదా శకటినా సార్థం స్మృతం శాకటినా శుభమ్
శాకటాయనపాదైశ్చ శాస్త్రం వై శాకటాయనమ్.

శాకటాయనవ్యాకరణ మన్నప్పుడు అభినవ శాకటాయనుని గ్రంథ మనుకొనవచ్చును, మహర్షి శాకటాయనుని గ్రంథ మనుకొనవచ్చును. మొదటిది 'శబ్దానుశాసన'మను పేర నేటికిని లభ్యము. అది క్రీ. శ. ౯వ శతాబ్దిలో జైనసంప్రదాయమున ప్రణీతము. రెండవ గ్రంథ మేకాలమున తిరోహిత మయినదో తెలుపుట కష్టము. అది యాస్కునికికూడ పూర్వకాలమున విరచితము. ఇప్పుడు త్రిమునివ్యాకరణ మన్నచో పాణిని, కాత్యాయన, పతంజలివిరచితగ్రంథము. పూర్వకాలమున త్రిమునివ్యాకరణ మన్న యెడల శకటి, శాకటి, శాకటాయన స్మృతగ్రంథ మన్నమాట. కాతంత్రపరిశిష్టమున "అహ్నో ఽరాత్ర్యాద్యనఘోషే" (సంధి ౮౦) అను సూత్రము చేసి, దానిపై వృత్తిభాగమున శ్రీపతిదత్తుడు "విష్వేవ నిషేధో రాత్రిరూపరథంతరే ష్వితి శాకటాయనీయే త్రిమునిమతేచ, తస్మా దహో రజనీతి రత్వం స్యాదేవ. చాంద్రేతు రేఫమాత్రేఽసౌ నిషేధః" అన్నాడు. చాంద్రములోని "లుక్యరి రః" (౬-౩-౧౦౦) అను సూత్రానుసారముగా రేఫమాత్ర నిషేధము కలదు. కాని అభినవశాకటాయనశబ్దానుశాసనమున "రోఽహ్నోఽప్యసుప్ రూపరాత్రిరథంతరే" (౧-౧-౧౬౦) అని సూత్రితము. పాణిని "అహన్" (౮-౨-౬౮) సూత్రముపై కాత్యాయనుడు "రుత్వవిధావహ్నో రూపరాత్రిరథంతరేషూపసంఖ్యానమ్" అని వార్తికము చేయుటయే కారణము. కావున నిచ్చట 'శాకటాయనీయే' అను పదమువలన అభినవశాకటాయనీయ శబ్దానుశాసనము, త్రిమునిపదమువలన పాణినీయ స్మృతియు లక్షితములు. 'శాకటాయనీయే త్రిమునిమతే చ' అను వాక్యాంశముద్వారా ప్రాచీనశాకటాయనీయ వ్యాకరణము—అనగా, శకటి, శాకటి, శాకటాయన గ్రంథము లక్షితము కానేరదు. మహర్షిశాకటాయనుని ఋక్తంత్రములోని "హోరాస్వోరూ" (౩-౭-౨) సూత్రమున రూప, రథంతరశబ్దములు లేవు. కాని వ్యాఘ్రభూతివిరచితశ్లోకవార్తికములోని "నామ చ

ధాతుజ మాహ......వ్యాకరణే శకటస్య చ తోకమ్" అను వాక్యాంశముపై వ్యాఖ్యలో "శాకటాయన శ్చ స్వకృతే వ్యాకరణే ఆహ—'ధాతుజం నా' మేతి"అని కాని "శాకటాయనీయే వ్యాకరణే నామ ధాతుజ మి త్యుక్తమ్" అన్నవాడు ప్రాచీనశాకటాయనగ్రంథమునే లక్ష్యమునం దుంచికొన్నాడు. ఇక కాతంత్రపరిశిష్టమున సంధిప్రకరణములోని "మణీవాదిషుచ" (౪౦) అను సూత్రవృత్తిభాగమున శ్రీపతిదత్తుడు "కశ్చిత్ త్రిముని సముపేక్షణా న్నేద మాద్రియతే" అన్నాడు. ఇక్కడ త్రిమునిశబ్దము ప్రాచీనశాకటాయనము నుద్దేశించియే ప్రయుక్తమయినది; కాని పాణినీయము నుద్దేశించి కాదు. పరిశిష్టప్రబోధమున గోపీనాథ తర్కాచార్యుడుకూడ వ్యాఖ్యావసరమున "త్రిమునీతి వ్యాకరణాంతరస్య సంజ్ఞా, మునిత్రయరచితత్వాత్. శకటి,శాకటి, శాకటాయనా స్త్రయః కర్తారో ఽభిమతాః"అని వ్రాసినాడు. శకటి శాకటుల వృత్తాంత మెచ్చటను గానరాదు. కాని శకటి అను అవ్యుత్పన్నప్రాతిపదికశబ్దము వివిధగ్రంథములో గానవచ్చుచున్నది. మహాభాష్యములో (౧-౧-౩౯; ౧-౪-౧; ౧-౪-౩; ౭-౩-౧౬), బాలమనోరమలో (౪-౧-౪౫), సిద్ధాంతచంద్రికలో (స్త్రీప్రత్యయ—౬౧ సూత్రవృత్తి) చూడనగును. శకటి శకటుని నామాంతరము కావచ్చును, సోదరుడయినను కావచ్చును. ఇట్లయుచో శాకటి శకటుని పుత్రుడుగాని, సోదరపుత్రుడు గాని కావచ్చును. శాకటాయనుడు, అతని యువాపత్యము గాని, గోత్రాపత్యము గాని కావచ్చును. గణరత్నమహోదధిలో వర్ధమానోపాధ్యాయుడు 'శకటస్య చ తోకమ్' అను శ్లోకాంశమును జూచి "శాలాతురీయ శకటాంగజచంద్రగోమి......" ఇత్యాదికారికయందును, దాని వ్యాఖ్యలోను శాకటాయనుడు శకటాంగజు డని వ్రాసినాడు. ఈ మాటలు బాగుగా నాలోచించి వ్రాసినవి కావు. అంగజుడు పుత్రుడు; యువాపత్యముగాని గోత్రాపత్యముగాని కాడు. మేదినీకోశములో "అంగజం రుధిరే ఽనంగ కేశ పుత్ర మదేషు నా"అని యున్నది. మొత్తముమీద వీరికి వంశగత సంబంధ మున్నట్లు భావింపవచ్చును.

శాకటాయనీయ త్రిమునివ్యాకరణమునకు, పాణినీయ త్రిమునివ్యాకరణమునకు నాగమతవ ర్తస్య మిది. ప్రథమప్రవక్తృనామానుసారముగా నొకదానికి పాణినిస్మృతి, పాణినీయత్రిమునివ్యాకరణము అని పేరు వచ్చినది; శేషప్రవక్తృనామానుసారముగా మరియొకదానికి శాకటాయనస్మృతి, శాకటాయనీయత్రిమునివ్యాకరణము అని పేరు వచ్చినది. ఉభయగ్రంథములును స్మృతిపదవాచ్యములు. ధర్మప్రయోగవ్యవస్థవలె కాలానుసారముగా శబ్దప్రయోగవ్యవస్థలో శాకటాయనస్మృతి క్రమముగా పరిత్యక్త మయినది. ధర్మవిషయములో—

"కృతేతు మానవా ధర్మాః
త్రేతాయాం గౌతమాః స్మృతాః
ద్వాపరే శంఖలిఖితాః
కలౌ పారాశరాః స్మృతాః"

అని అభియుక్తోక్తి.

ఉత్తరప్రామాణ్యన్యాయానుసారముగా పాణినీయత్రిమునివ్యాకరణమున పతంజలివాక్యమున కెట్టి ప్రామాణ్యము కలదో, పూర్వకాలమున శాకటాయనీయత్రిమునివ్యాకరణమున శాకటాయనుని వాక్యమున కట్టి ప్రామాణ్య ముండె నని గోచరించును.

శా. త్రి. వ్యాకరణమునకు శాకటాయన మని ప్రసిద్ధనామము. శ్రీతత్త్వనిధిమతప్రకారము ఉత్తమ నవవ్యాకరణములలో నిది యొకటి.

పాణిని బహుపర్యాయములు శాకటాయనుని పేర్కొన్నాడు. "లఙః శాకటాయన స్యైవ" (౩-౪-౧౧౧); "వ్యోర్లఘుప్రయత్నతరః శాకటాయనస్య" (౮-౩-౧౮); "త్రిప్రభృతిషు శాకటాయనస్య" (౮-౪-౫౦); ఇత్యాదులు. కాత్యాయనుడు ప్రాతిశాఖ్యలోగూడ నీతనిని స్మరించినాడు: "ప్రత్యయసవర్ణం ముది శాకటాయనః" (౩-౮;) "జిహ్వామూలీయోపధ్మానీయౌ శాకటాయనః"(౩-౧౨) "లోపం కాశ్యపశాకటాయనౌ" (౪-౫); "సపదే శాకటాయనః" (౪-౧౯౦). ఈ కాలమున శాకటాయన వ్యాకరణము లభించుటలేదు; కాని ఒకప్పుడు ప్రచారమున నుండె ననుట నిస్సందేహము. వాక్త్రయ

భూతికృతశ్లోకవార్తికములోని 'వ్యాకరణే శకటస్య చ తోకమ్' అనుదానివలనను, మహాభాష్యములోని "నైయాకరణానాం చ శాకటాయన ఆహ—ధాతుజం నామేతి" (౩-౩-౧) అను వాక్యమువలనను వ్యాకరణ ముండెనని స్పష్టమగుచున్నది. ఇంతియే గాక ఈ సందర్భమున నాగేశభట్టు "ధాతుజం నామేతి నిరుక్త ఆహ - నిరుక్తకారః శాకటాయనశ్చ స్వకృతే వ్యాకరణే" (శబ్దేందుశేఖరము) అన్నాడు. "చతుష్టాః శాకటాయనాః" అను ప్రాచీనోక్తివలన ప్రాచీన శాకటాయనవ్యాకరణమున నాలుగధ్యాయము లుండెనని బోధపడును. నాగేశుని మతప్రకారము శివసూత్ర సమూహ మీ గ్రంథమున నభ్యుపగతము (లఘుశబ్దేందు శేఖరము). ఇది సంభావ్యమే. శాకటాయనములోని ఔణాదికసూత్రప్రత్యాహారసంజ్ఞాసమూహము శివసూత్రానుసారప్రణీత మని నాగేశుని సమర్థించుచున్నది. లోకవ్యవహారమున ప్రాచీనులలో కొందరు శాకటాయనుడు పాణినిశిష్యుడని యని యనాలోచితముగా నన్నారు. కాని ఆయన చింతాశీలుడనియు, దార్శనికుడనియు ననేకులకు నడుమనడుమ విస్మృతి కలుగుచుండును. మహాభాష్యములో "అథవా భవతి వై కశ్చిత్ జాగ్రదపి వర్తమానం కాలం నోపలభేత, తద్యథా—వైయాకరణానాం శాకటాయనో రథమార్గ ఆసీనః శకటసార్థం యాన్తం నోపలేభే" (౩-౨-౧౧౫) అని యున్నది. ఇదియే కాక శాకటాయనోపనిషత్తువలన ఆయనచింతాశీలత, దార్శనికతయు నవగత మగును. ఇంత యేల? శ్రీశంకరభగవత్పాదాచార్యులు ఈ యుపనిషత్తుకు భాష్యము లిఖించినారు. ***Monier Williams*** ఈవిషయ మంగీకరింపకపోలేదు.

స్మృతిశాస్త్రమునందుగూడ శాకటాయన మహర్షి ప్రామాణికుడు. అపరార్క—యాజ్ఞవల్క్య ధర్మశాస్త్రనిబంధనమున, చతుర్వర్గచింతామణిలో, నిర్ణయసింధువులో, స్మృతిచంద్రికలో శ్రాద్ధమయూఖాదిస్మార్తగ్రంథములలో ఆయన మతవాదము ప్రమాణరూపమున నభ్యుపగత మగును. దీనివలన తదీయ ధర్మశాస్త్రకారత్వముకూడ ప్రతిపాదితము కాగలదు.

శాకటాయనుని ఋక్తంత్రవ్యాకరణము ప్రసిద్ధ గ్రంథము. ఇది వస్తుతః సామవేదీయప్రాతిశాఖ్యవిశేషము. దీని సూత్రసమూహమునకు శాకటాయనుడే వ్యాఖ్యానము రచించెను. పురాకల్పమునందలి కొన్ని కొన్ని ఆక్షేయగాథలు దీనివలన రక్షితములు. చతుర్దశకమందలి "గాథాసు" (౩౪) అను సూత్రవ్యాఖ్యలో నతడిట్లు వ్రాసినాడు: "గాథాసు చ ద్విమాత్రమంతరం నిత్యవిరతే భవతి—'యే నాభిః ప్రతిష్ఠి మానసం కాశ్మీరాః సలిలమ్. మదానస స్థాన శ్వపథే వశీకృథా యుధేంద్రో దివి దానవా నిక. నైవోదకమస్తి పాతవే న పక్షా ఉత్పతనాయ. స్తోమ మకృపణం బత. సారసో మృగో మండూకో విలలాప. ధన్వసన్యపచిత్రకపాండుపలాశకమత్స్యకాశ్చ జహి. జాలకాకేన గరణీషు చ మత్స్యకామా నాహ నాంసకస్య విదిశాని సామికమ్.' ఓ-గ్నా-ఇ (౧-౧) ఇత్యాదీని."

ఋక్తంత్రములోని సూత్రము లనేకము లవికలముగా అష్టాధ్యాయిలో గానవచ్చును. 'అశ్వపత్య మనితోర్య' (శాక. ౧-౨ = పాణిని ౬-౧-౧౪౯); 'కాస్తీ రాజస్తున్దే నగరే' (శాక. ౨-౪ = పాణిని ౬-౧-౧౫౫) ఇత్యాదులు. ఇందులోని కొన్నికొన్ని సూత్రములు ఈషత్పరివర్తనముతో అష్టాధ్యాయిలోనికి చేరినవి. శాకటాయనుని 'మిత్ర ఋషౌ' (౧-౫) పాణినీయములో 'మిత్రే చర్షౌ' (౬-౩-౧౩౦) అయినది. ఋక్తంత్రసూత్రవృత్తి చదువునప్పుడు డెడనెడ అష్టాధ్యాయీసూత్రములు జ్ఞప్తికి వచ్చును. శాకటాయనుడు "అప రథే—అప ఇతి పూర్వరూపం, సకారో వ్యవధీయతే రథే. అపస్కారో నామ రథః; అపకరోఽన్యః" (౬-౧) అన్నాడు. పాణిని "అపస్కారో రథాంగమ్." (౬-౧-౧౪౯) అన్నాడు. శాకటాయనుడు "పార పర్వతే. పార ఇతి పూర్వరూపం, సకారో వ్యవధీయతే పర్వతే; పారస్కరః పర్వతః పారకరోఽన్యః" (౫-౧౦) అన్నాడు. పాణిని "పారస్కరప్రభృతీని" (౬-౧-౧౫౭) అను సూత్రము చేసినాడు. శాకటాయనుడు "సన్నికర్షః సంహితా. సన్నికర్షః సంహితా భవతి. పద స్యైకాధికారః. ఆనంతర్యం సన్నికర్షః..."

..."యః పరః సన్నికర్షో నాన్తరేణ వికారమ్. కో నామ వికారః? శాస్త్రప్రాప్తే లోపే చ సన్ధిః గ్రాహ్యః" అన్నాడు. పాణిని "పర స్సన్నికర్ష స్సంహితా" (౧-౪-౧౦౯) అన్నాడు.

శాకటాయనర్షిమునివ్యాకరణ మిప్పుడు లేకున్నను దానిలోని సూత్రము లనేకములు పాణినీయ వ్యాకరణములో ప్రవేశించినవి. శబ్దతత్త్వప్రకాశనమునకై పాణిని శాకటాయనున కెంత రకు ఋణపడి యున్నాడో చెప్పుట కష్టము. శాకటాయనాదులు కూడ మూలప్రవక్తలు కారు. హరదత్తు డిట్లన్నాడు: "తత్ర యే సాధవ స్తే.....కథం పున రాచార్యేణ పాణినా అవగత - మేతే సాధవ ఇతి? ఆపిశలేన పూర్వవ్యాకరణేన. ఆపిశలినా—తర్హి—కే నావగతమ్? తతః పూర్వేణ వ్యాకరణేన"-మంచిమాట! "శివాద్యా ఋషిపర్యన్తాః స్మారకా నతు కారకాః."

న్యాయమంజరీకారుడు జయంతభట్టు ఇట్లు లిఖించినాడు: "న వ్యక్షపాదాత్ పూర్వం కృతో వేద ప్రామాణ్యనిశ్చయ ఆసీత్? అత్యల్ప మిద ముచ్యతే. జైమినేః పూర్వం కేన వేదార్థో వ్యాఖ్యాతః? పాణినేః పూర్వం కేన పదాని వ్యుత్పాదితాని? పింగలాత్పూర్వం కేన ఛన్దాంసి రచితాని? ఆదిసర్గాత్ ప్రభృతి వేదవ దిమా విద్యాః ప్రవృత్తాః. సంక్షేపవిస్తరవివక్షయా తు తాం స్తాం స్తత్ర కర్తౄ నాచక్షతే."

శాకటాయనుడు పాణినికి బహుపూర్వుడు. శౌనకుడు బృహద్దేవతలో ఈయనను పేర్కొన్నాడు.

శాకటాయనుడు శైశిరిశాఖాంతర్గతుడు. శైశిరీయశిక్షలో ఈయననామముకూడ కలదు. శైశిరిశాఖ శాకల్యశిష్యప్రవర్తితము. కావున శాకటాయనుడు శాకల్యుని తరువాతివాడు.

## గార్గీయ వ్యాకరణము

గార్గ్యేణ మునివర్యేణ సత్కృతం వ్యాకరణం స్వకమ్.

గార్గ్యముని గర్గవంశసంభూతుడు. ఈయన ప్రశ్నోపనిషత్తులోని సౌర్యాయణీగార్గ్యుడు అగునో, కాడో? బృహదారణ్యకములోని గార్గివాచక్నవి ఈయన కేమగునో! ఈయన ఆయనసోదరపుత్రుడేమో. గార్గివ్యాకరణము 'అక్షరతంత్రసూత్ర' నామమున ప్రసిద్ధము. దీనిని సామాన్యరూపమున గార్గీయ వ్యాకరణ మనవచ్చును. పాణిని బహువారములు ఈతని నామము స్మరించినాడు: "అఙ్ గార్గ్యగాలవయోః" (౭-౩-౯౯); "ఓతో గార్గ్యస్య" (౮-౩-౨౦)"; "నోదాత్తస్వరితోదయ మగార్గ్య కాశ్యప గాలవానామ్" (౮-౪-౬౭). పాణిని అక్షరతంత్రసూత్రమును జూచినట్లు స్పష్టము. బాష్కలిభారద్వాజుడు గార్గ్యునికి శబ్దశాస్త్రమున గురువు.

పన్నగారి గార్గ్యుని నామాంతరము. అనార్య నాగజాతిని ఉచ్ఛేదించుటలో నితడు విశేషయత్నము చేయుటవలనగాని, విషవిద్యాపారంగతు డగుట వలనగాని యీ బిరుదము పొందియుండ వచ్చును. శాకల్యుని ఋగ్వేదీయపదపాఠము ఎంత ప్రసిద్ధమో, గార్గ్యుని సామవేదీయపదపాఠముకూడ అంత ప్రసిద్ధము. ఈతడు శాకల్యునికి పరవర్తి యని దీనివలన గానవచ్చును. నిరుక్తమున బహుస్థానములలో యాస్కుడు ఈయనను పేర్కొన్నాడు: ఉపసర్గా ఉచ్చావచా భవన్తీతి గార్గ్యః" (౧-౩) ఇత్యాదులు.

గార్గ్యుడు బ్రహ్మవిద్యలో పిప్పలాదుని శిష్యుడు. ఈతడు శాకటాయనునితో ప్రతివాదము చేసినాడు; అందుచే శాకటాయనునికంటె కొంత చిన్నవాడు.

[దర్శనసాగర, వేదాంతభూషణ, గురుపదహాళ్ బారసరస్వతీకృత వ్యాకరణదర్శనచరిత్ర ననుసరించి రచించినది.]



# సరాగాలు



శ్రీ నండూరి వెంకటసుబ్బారావు

పూవు నేనైతె?
నే
నీవలపు నౌదు!
పూ నిన్నె జగమంత
ధ్యానింపజేతు!

౨

నేను కోయిలనైతె?
నీ రాగమౌదు!
దిశలు ఓ నిన్నె కీ
ర్తింపగా జేతు!

౩

తావి నేనైతె?
నీ
ప్రాణమ్మె నౌదు!
ముజ్జగము తా నిన్నె
మ్రొక్కగా జేతు!

౪

నీవు నేనైతె?
నినె
నాలోన కందు!
నేను నేనుగ నుంటె?
నీలోన యుందు!



# ప్రొఫెసరు హార్డీ

(౧౮౭౭ ౧౯౪౭)

●

గొబ్బూరు వెంకటరఘునాధ కృష్ణారావు

ఇప్పుడే ఒక సంవత్సరం గ్రుగన తిరిగిపోయింది. ...హార్డీ పండితుడు ౧౯౪౭ డిసెంబరులో దివంగతుడైనాడు. ఈయన ఇరవైయ్యో శతాబ్దపు మొదటి ఏభై సంవత్సరములలోనూ పేరెన్నికగన్న బ్రిటిష్ గణితశాస్త్రజ్ఞులలో ప్రముఖస్థానంగా, ప్రపంచ గణిత శాస్త్రజ్ఞులలో ఉన్నతస్థానంగా స్వయంకృషివల్లా, అసమాన ప్రతిభవల్లా గణించాడు...మామూలుగా ఒక వ్యక్తి జీవితకాలంలో అనవరతంగా కృషిచేసి, తదేక చిత్తంతో పనిచేసినా సాధించడానికి వీలులేని నూతన గణితశాస్త్రాంశాలు చాలా కనిపెట్టాడు ... ఒకే విషయంలో కాకుండా వివిధవిషయాల్లోకూడా తన ప్రజ్ఞ చూపించగలిగాడు. ముఖ్యంగా అంకగణితంలోనూ, అంకాల, సంఖ్యల నిజరూప, నిజతత్త్వ శోధనలో ఈయన మనసులో చాలా కాలం దొర్లిపోయింది. ఆ గణితవిషయాల్లో ఈయన మహోన్నతశిఖరాలు అందుకొన్నాడంటే అతిశయోక్తి కాజాలదు...

ఒక అంకెను ఎన్నివిధాలుగా విభజించగలం? ఆ విభాగాల స్వరూపం ఎట్లాంటిది? అనే ప్రశ్న వేసుకుందాం...3 అంకె ఉంటే 2+1, (2ను ఒకటినీ కలిపితే మూడు) 1+1+1, మూడు అని రెండు విధాలుగా, భిన్నములైన (వేర్వేరు) అంకెల కూడిక ఫలితముగా తెలియచెయ్యవచ్చును. అల్లాగే 4ని 4, 3+1, 2+2, 2+1+1, 1+1+1+1 అని అయిదువిధాలుగానూ, ఐదును 7 విధాలుగానూ రకరకాలయిన, వేర్వేరు అంకెల సంయుక్తస్వరూపంగా చిత్రించవచ్చు...అయితే ఏ సంఖ్యనైనా ఇల్లా వివిధరకాల విభాగం చెయ్యగలం. (రకరకాల సంఖ్యల కూడికవల్ల ఆ సంఖ్య ఏర్పడుతుంది...) ఆ విభాగాల సంఖ్య ఎంత? దానికి ఉక్తి ఉన్నదా?...అని తీవ్రముగా పరిశ్రమచేసి, ఆఖరికి ఒక ఎక్స్‌ప్రెషన్ ఉక్తిని కనిపెట్టాడు హార్డీ పండితుడు...తదుపరి ఏ అంకెనైనా కొన్ని అంకెల వర్గాల మొత్తంక్రిందా, కొన్ని అంకెల ఘనాల మొత్తంక్రిందా... అంకెల... కొన్ని (అంకెల) 4 ల మొత్తం క్రింద.........ఇల్లాగ్గా చాలా విధాలుగా తెలియచెయ్యగలం.. [(అంకె) 2=అంకె X అంకె, (అంకె) 3 అంటే అంకె X అంకె X అంకె, ఇల్లాగ్గా (అంకె) క అంటే అంకె X అంకె X అంకె X అంకె X ...(కసార్లు)...... ] ....ఇల్లాగా అంకెల స్వరూపం; వివిధంగా లభిస్తాయి...అనే విషయాలలో చాలా గొప్ప పరిశోధన సలిపాడీయన...

అయితే ఇలా పనిచెయ్యడంవల్ల ఏం లాభం? ఏం కిట్టుబాటు? అని అతనినే అడిగితే, "అబ్బే! ఇదంతా వృథాప్రయాస...ఇది డబ్బు చేసుకొందుకు పనికిరాదు...అని చెప్పే మనిషి, హార్డీ...కాని ఆయన ఏం అనేవాడంటే, "మా లెక్కలు మనుష్యుల్ని చంపడానికీ, ఖూనీచెయ్యడానికీ పనికిరావు.. ఇవి ఎప్పుడూ ఎవళ్లనీ చంపెయ్యలేదు" అని. క్రికెట్ ఆటవల్ల ఏం లాభమో, లెక్కలు చెయ్యడంవల్లా అంతే లాభం అని ఆయన ఉద్దేశం. లెక్కలు చెయ్యడంవల్ల సాధిత మరేవ్య పరమప్రయోజనం ఏదీ చెప్పుకోదగిందిలేదు... కాని ఆ చెయ్యడంలోనే ఉంది ఎంత సరదా ఐనా... అని ఘట్టిగా నమ్మేవాడు ప్రొఫెసరు హార్డీ...ఈ మాటంటే నాకు ఈమధ్య ౧౯ వ ఒలింపియాడ్ పిక్చరు తీస్తూ బేరన్ డి కొబర్టిన్ అన్న మాటలు జ్ఞాపకం వస్తున్నాయి. "ఒలింపిక్ పందెపుటాటల్లో చాలా ముఖ్యమైన సంగతి గెలుపు గాదు.. ఆటల్లో పాల్గొనడం.. ప్రపంచంలో చాలా బాగా ఆడగలవాళ్లందరూ (మంచి ఆటగాళ్లు) కలిసి పోటీపందెములలో చురుకుగా సంతోషంగా ఆడితే కన్నులపండుగ్గా ఉంటుంది...అసలు జీవితంలోనే కావలసిందేమిటంటే నెగ్గడం, ఓడిపోవడం కాదు... వచ్చిన కష్టాన్నీ, చికాకులనీ దాటుకుంటూ నిభాయించుకొని రావడం...అందులోనే ఉంది మజా...గొప్పతనం... ఇటువంటి ఉద్దేశాలు ప్రచారంచేసి మనం మానవజాతి భావిలో బలవత్తరం అయ్యేందుకూ, ధైర్యోత్సాహాలతో పని చేసేందుకూ, మంచిచెడ్డా గ్రహిస్తూ ఆరు

కుంటూ పాడుకుంటూ బ్రతికేంతుకూ దోహదం చెయ్యాలి" అన్నారు బేరన్.

నిజంగా క్రికెట్ ఆడుతూఉంటే హుషారూ, సంతోషం, కులాసాలాంటివే లెక్కలుచేస్తూ (ఈ లెక్కలు రావాలిసుమండీ, రాకపోతే చికాకు, తల నొప్పి వస్తాయి)...ఉంటే, లెక్కలు వస్తూఉంటే లభిస్తుంది. హార్డీకి క్రికెట్‌పందేలూ, అసలు క్రికెట్ అంటే చాలా ఇష్టం, సరదా. అసలు ఈయన ఒకొక్కప్పుడు చిత్రమైన పదాలు వాడేవాడు. గణితశాస్త్రజ్ఞులలో నూటికి ౯౨ మంది ప్రథమశ్రేణికి చెందుతారనీ, ఒక ఏడుగురో ఎనిమిదుగురో 'హబ్స్' తరగతికి చెందుతారనీ బడాయికొట్టేవాడు...[హబ్స్ నక్రేమం ఫలం ఇంగ్లండుకి చెందిన చాలా గొప్ప క్రికెట్ ఆటగాడు.]

"మా లెక్కలు బందిపోటుకీ, నాశనానికీ మారణసాధనంగానూ పనికిరావు" అని హార్డీ అమాయకంగా చెప్పినా, ఈ మాటలు అబద్ధమనే చెప్పాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి...రిమన్ అనే (ఈకాలపు) జర్మను గణితశాస్త్రజ్ఞుడు అపారమైన కృషిచేసి అద్భుతమైన గణితాంశాలని ప్రపంచానికి వెల్లడిచేశాడు. ఆయన పేరిట జీటాఫంక్షను అనే ఉక్తి ఉంది (సమాసము...లెక్కలసమాసము)...ఒక ఇవ్వబడిన ప్రైము* ప్రైముసంఖ్యకంటె తక్కువయిన అంకెలు, వాటి సంఖ్యా...అసంఖ్యకి సామాన్య ఉక్తినీ..(*General Expression*)..కనిపెట్టడం సందర్భంలో రీమను పండితుడు జీటాఫంక్షను కనిపెట్టాడు...దాని లక్షణాలని ఉద్ఘాటించి గ్రంథస్థం చేశాడు. హార్డీకి ఈలెక్కలంటే ప్రాణం. నిజంగా జీవితోపకారానేవాడు. అయితే ఈలెక్కలు ఈ ౨౦ వ శతాబ్దంలో 'పైరోమెట్రి' (*Pyrometry*) [గొప్ప బట్టీలు, కొలుములు, *Furnaces* ల్లో వాట్ల ఉష్ణోగ్రతని తెలుసుకోవడం] ఆ మార్గాను చిత్రించుకోవడానికి, ఇంకా చాలా విషయాల్లోనూ ఈ జీటాఫంక్షను చాలా పనికి వచ్చింది...ఆధునికమారణహోమాల్లో బ్లాస్ట్ ఫర్నేసులు...ప్రేలుడుబట్టీలు, మునుపటి హోమాల్లో

---

* ప్రైము సంఖ్య దానంతటదేగాని, ఒకటిచేత గాని భాగహరింపబడుతుంది...ఇంక దేనిచేత భాగారం చేసినా తెగదు...మాటికి ౨, ౫, ౭, ౧౧, ఇవి ప్రైమ్ అంకెలు...3 కంటె తక్కువయిన ప్రైమ్ సంఖ్య ఒకటి మాత్రమే.

ఆజ్యంలాగ చాలా చురుకుగా పనిచేస్తున్నాయి. ఇలాగ్గా లెక్కలుగూడా ధ్వంసధూళి చెయ్యడానికి ఉపయోగ మవుతున్నాయి.

క్రికెట్‌లాంటి ఆటలు ఆడడంవల్ల కొంత సాంఘికమర్యాదలూ, సంఘజీవితం ఎల్లా మానవుడికి ఉపయోగిస్తుందో, అటువంటి సంగతులుకూడా బోధపడతాయి. ఉదాహరణంగా బ్రిటన్ - ఆస్ట్రేలియాల మధ్య స్నేహం—మిత్రత్వం, సహృదయత్వం పెంపొందడానికి చాలా తోడ్పడింది క్రికెట్ ఆట, క్రికెట్‌పందెములున్నూ......లార్ వుడ్ బంతి విసిరితే (*Boul* చేస్తే) బ్రిటిష్ వాళ్లకి క్రికెట్‌పందెగాళ్లకి హాయిలుగా ఉండేది...అతడాభా చూచాక ఆస్ట్రేలియన్ క్రికెట్‌పందెగాళ్లకి సత్కారాలు బాగా జరిగాయి, జరుగుతున్నాయికూడా...శ్వేతజాతులకి నల్లవాళ్లని చూస్తే సహజంగా ఏవగింపూ, అసహ్యమూను. సాధారణంగా వాళ్ల అభిప్రాయం ఇది: "ఇండియన్లూ సౌత్‌ఆఫ్రికన్లూ...(హిందూ దేశీయులూ, దక్షిణాఫ్రికావాళ్లూ...) ఎందుకూ పనికిరానివాళ్లు...చవటలు" అని మనసా నమ్ముతారు వాళ్లు...కాని క్రికెట్‌పందెములలో వాళ్లు చూపించిన చాకచక్యమూ, సామర్థ్యమూ...వారిలో మార్పు తీసికొచ్చింది...నవాళమంటేటట్టు నల్లవాళ్ల శక్తిసామర్థ్యాలు తెలియడంతో ఒక్కసారి వారి దురభిప్రాయం పటాపంచ లయింది...నల్లవాళ్లని మన్నించారు, ఆదరించారు...ఆదరిస్తున్నారు...ఇంక విధిలేక మీరుగూడా క్రికెట్ చాలా బాగా చేతనవును అని ఒప్పుకున్నారు...అదేమాదిరిగా గొప్ప సాంఘికశక్తులు వెలువడ్డాయి హార్డీ ప్యూర్‌మాథమెటిక్స్ పరిశోధనలవల్ల...గణితశాస్త్రజ్ఞు లందరూ ఒక కుటుంబంలోలాంటివాళ్లు...వాళ్లకి దేశం, పాత్రం, కాలం విభాగం అక్కరలేదు...అనే అంశాలు విస్పష్టంగా కనిపిస్తాయి హార్డీ చేసిన కొన్ని గొప్పపనుల్లో. అసలు ప్యూర్‌మాథమేటిక్సు అంటే ఏమిటో తెలుసుకోవడం అవుసరం. బీజగణితం, రేఖాగణితం, త్రికోణమితీ, కలనచలనం, అంకగణితం, రేఖాంకగణితం, ఇవన్నీ శుద్ధగణితంలో భాగాలు...కాగా అప్లైడు మాథమేటిక్సు అంటే గతిశాస్త్రం, ఖగోళశాస్త్రం మొదలైన విభాగాలన్నమాట. ప్యూర్ మాథమాటిక్సు శక్తులు పనిచెయ్యని...శక్తులతో సంబంధించని గణిత విషయా లన్నమాట...అప్లైడు మాథమాటిక్సు శక్తులు పనిచెయ్యడంతో సంబంధించింది...శక్తుగణితం, శక్తి

గణితం అందాం వీట్లని...౧౯౧౩ లో మద్రాసులో గుమాస్తాపనిచేస్తూ శ్రీనివాసరామానుజం హార్డీపండితుడి కొక ఉత్తరం వ్రాశాడు...అందులో తను స్వయంగా కనిపెట్టిన అత్యంతకష్టసాధ్యంగా పైకే కనిపించే ఒక నూరు అద్భుతమైన థీరములను *తెలియజేశాడు...

వెంటనే హార్డీ పండితుడు వాట్ల గొప్పతనాన్నీ, విలువనీ, అసాధారణమైన గణితప్రజ్ఞగల రామానుజం దీనస్థితినీ గుర్తించి, శ్రీనివాసరామానుజాన్ని (హిందూదేశీయుణ్ణి) స్వయంగా ఇంగ్లండు రప్పించాడు. చాలా గౌరవం సత్కారం చేసి అతనికి సదుపాయాలు చేశాడు. అప్పట్లోనే రామానుజం మొట్టమొదటి కేంబ్రిడ్జి ఫెల్లో (*Fellow of Trinity College, Cambridge*) అయ్యాడు...ఇది చాలా గొప్ప గౌరవం. ట్రినిటీ కాలేజిలో చదవడమే అసలు గొప్ప అదృష్టాలలో ఒకటి...అటువంటిది ఆ గౌరవం లభించడంతో రామానుజం కీర్తి విశ్వం జగద్వ్యాప్తి చెందింది...ట్రినిటీమన్నన లందుకొని, రామానుజం అచిరకాలంలో రాయల్ సొసయిటీ—(*Royal Society*-ఇంగ్లండులో ఉండే ప్రపంచఖ్యాతి నొందిన సంఘం) ఫెల్లో అయ్యాడు. ఇది కూడా చాలా ప్రత్యేకమయిన, అసాధారణమయిన గౌరవం. ఈనాడు హిందూదేశంలో రామన్, సాహాలాంటి వాళ్లు (ఓపదిమందిలోపే) ఈ గౌరవము నందినారు. ఇల్లాగ్గా ఓ తారలాగ మెరసిపోయాడు శ్రీనివాస రామానుజం, ఇంగ్లండులో.

కాని క్షయరోగం రామానుజాన్ని పట్టుకొని వేధించేసింది. చివరకు చంపేసింది కూడా. రామానుజం మరణశయ్యమీద గిలగిల లాడుతున్నాడు. స్నేహితుణ్ణి చూడడానికి హార్డీ పండితుడు కారులో (*taxi cab*) వచ్చి రామానుజం వసతిదగ్గర దిగి, రామానుజంమంచం ప్రక్కదగ్గరగా కూర్చొన్నాడు. రామానుజం హార్డీ ఎక్కి వచ్చిన మోటారుకారు నెంబరు అడిగాడు. హార్డీ, "౧౭౨౯. ఈనంబరులో ఏం ప్రత్యేకత, ఏం విశేషముంది—నువ్వింత గుచ్చి అడిగేందుకూ ?" అన్నాడు. వెంటనే రామానుజం తపేమని, "లేకపోవడమేం ! ఉంది...మామ్మూటికి ఉంది...రెండువిధాలుగా, రెండు ఘనాలమొత్తంగా...రెండు (అంకెల)$^3$ మొత్తంగా చెప్పగలిగే †అతిస్వల్పసంఖ్య కాదూ ౧౭౨౯ ?" అన్నాడు. హార్డీ ముక్కుమీద వేలువేసుకొని నిర్ఘాంతపోయాడు. ...ఇటువంటి కథలు గాథలుగా రామానుజం గొప్పతనం చెప్పుకోవడం పరిపాటి...ఇతరదేశాల్లో కూడా...శ్రీనివాసరామానుజానికి ౧౦,౦౦౦ కి లోపు ప్రతీసంఖ్యా పిలిస్తే పలికేది...అతని కవి చాలా ప్రాణస్నేహితుల్లాగా ఎప్పుడూ అతనిలో భాగంలాగ ఉండేవి...నిద్రలో కూడా సంఖ్యలే......అసాధారణగణితశాస్త్రజ్ఞుడు రామానుజం........గణిత లోకంలో ఓ మెరుపులా మెరిసి మాయమయ్యాడు...శ్రీనివాసరామానుజంగణితంలో సాధించిందంతా రెండు పెద్దవాల్యూములలో హార్డీ ప్రచురించడానికి చాలా ప్రయత్నం చేశాడు...సఫలుడయ్యాడు అల్లా ఏకోదరులలాగ వెలిగారు రామానుజం, హార్డీ పండితుడున్నూ.

...హార్డీ లెక్కల్లో అంత నిశిత ప్రజ్ఞ చూపించాడుగాని సంఘకట్టుబాట్లను గట్టిగా ప్రతిఘటించి, వృథాప్రయాసానికిగూడా సాధారణంగా లోనవుతూ ఉండేవాడు. అన్యాయం, మూఢవిశ్వాసాలూ, మూఢాచారాలూ...వీట్లని ఖండిస్తూ, తెగనాడుతూ జీవితకాలం యావత్తూ ప్రతిఘటిస్తూ ఉండేవాడు... హార్డీకి సోషలిజం నచ్చింది. ఆయన సోషలిస్టూ, ట్రేడు యూనియనిస్టూ అయ్యాడు. విజ్ఞానవిషయిక పరిశ్రమలచేసేవాళ్ల సంఘాలకీ, వాట్లకీ లెక్చర్లిస్తూ, ప్రభుత్వచర్యలని తీవ్రంగా నిరసిస్తూ సామ్యవాద సిద్ధాంతాల్ని ప్రచారం చెయ్యడానికి తాపత్రయపడేవాడు. ౧౯౨౭ లో *Union of Scientific workers* కీ, *Association of Scientific workers* కీ ఈయన ఇచ్చిన ఉపన్యాసాలు చెప్పదగ్గవి. విజ్ఞానాన్ని...విజ్ఞానపరిశ్రమలతో పాటుపడేవాళ్లనీ ప్రోత్సహించమనీ, నాయకులని ఈసంఘాలలో చేరమనీ చాలా మంచి లెక్చర్లిచ్చేవాడు హార్డీ...

విజ్ఞానం, లెక్కలూ, వీటిలో పరిశ్రమ చెయ్యగా చెయ్యగా గొప్పఅంశాలు తెలుసుకోవస్తాయి., బయటపడతాయి...నిశితప్రజ్ఞ సంపాదిస్తే, అల్లా పని

---

* థీరం లంటే విశిష్టమైన గణితాంశా లన్నమాట...వీటికి ఉపపత్తులూ అవీ ఉండాలి...చూ. శుల్బసూత్రములు.—భారతి, ఆగస్టు, ౧౯౫౬.

† 1729 ని రెండు విధాలుగా రెండు (అంకెల)$^3$ ల మొత్తంగా చెప్పవచ్చు. $10^3 + 9^3 = 1729$, $12^3 + 1^3 = 1729$.

చెయ్యడంలోనే, లెక్కలు చెయ్యడంలోనే కూడా బాగా, హాయిగా జీవితం గడపవచ్చుననేవాడు హార్డీ... బొగ్గుత్రవ్వే కూలివాళ్ళపనికీ లెక్కలుచేసే గణితులపనికీ చాలా తేడా ఉన్నా, వీరిద్దరికీ ఇంగ్లండులో చాలా దగ్గర బంధుత్వం ఉందని అనేవాడు హార్డీ పండితుడు... కాని లెక్కలవాళ్లకీ, ధనస్వాములకీ... పెట్టుబడిదార్లకీ పొత్తు ఏనాటికీ కుదరదు...గణితుడూ, బొగ్గుపనివాడూ చాలా కష్టపడుతారు...నాణెంకో అని రాత్రింబగళ్లు శ్రమించి అందులోనే మునిగిపోతారు...ఆయా పనుల్లో కాలం గడుస్తూంటే పాటవం, నేర్పూ సంపాదిస్తారు. అది మళ్లీ వాళ్లకే పనికొస్తుంది...

"మేం అమాయకులం. మా లెక్కలూ మేమూ! అంతే... మాకింకేం అక్కర్లేదు...మాలాగే బొగ్గు కూలీలున్నా...బొగ్గూ, వాళ్లూ... అంతే...ఏ దేలా పోతే మాకేం.. మేము మిగిలిన వేళ్లకి అంత కొతకీ చెయ్యం...మేం ధనస్వాములూ పెట్టుబడిదార్లూగా ఒకళ్లని పీల్చిపిప్పిచేసి పైకొచ్చి, విర్రవీగుతూ దుస్సహమైన పరపీడా, వ్యాపార కపటం...ఇంక మరి వీల్లేదు, ఊరుకుంటే కృశించుతోందన్న పరిస్థితి వచ్చినప్పుడు మా లెక్కలవాళ్లం, బొగ్గుకూలీలూ కలిసి ధనస్వాముల పెడకొక్కుని పోరాడి మా బలం చూపిస్తాం," అని చమత్కారంగా మాట్లాడుతూ ఉండేవాడు.

"కళ కళకోసమే" అని గట్టిగా నమ్మేవాళ్లూ "లెక్కలు లెక్కలకోసమే" అనేవాళ్లూ ఈ శతాబ్దంలో చాలా ఎక్కువయ్యారు. కాని ఇలా అనటములో కొన్ని చిక్కులున్నాయి...ఈ మాటలలో రంధ్రాన్వేషకులకు పని కల్గించే సంగతులు చాలా ఉన్నాయి...

...అయినా ఇవి "సబ్బుకోసం కళ", "ఇంజనీరింగు కోసం లెక్కలూ" అనటంకంటె చాలా విశాల, వెయ్యిరెట్లు నయం. (ఇంజనీరింగు మానవాభ్యుదయానికి ఉపయోగిస్తారో, లేక మారణసాధనంగా ఉపయోగిస్తారో, ఇక్కడ మనకి అప్రస్తుతం...)...కళ కళకోసమే అని విశ్వసించినవాడు కళను ప్రేమించే ప్రతి వ్యక్తికీ కళారాధనకీ, తన్మయులంగా సుఖం పొందడానికీ అవకాశం అందరికీ ఉండాలనే కోరిక రేకెత్తుకుంది...మనలో...కళారాధకులు స్వయంగా కళాభివృద్ధికి పాటుపడేందుకూ, అవిరళంగా వారి వాంఛితం, మనోభీష్టం సిద్ధించడానికీ, వాంఛితాలీడేరడానికీ కావలసిన పరిస్థితులేర్పర్చడం మన బాధ్యతే అని అప్పుడు మనం గుర్తిస్తాం...అంటే ప్రతి వ్యక్తికీ, కళారాధనకీ, కళల విషయంలో స్వయంగా కృషిచెయ్యడానికీ, కావలసిన తీరుబాటూ, ఓపికా, ధనం, ప్రభుత్వ సాహాయ్యం... మొదలైనవి ఉండక వీల్లేదనడం...ఇది సామ్యవాదపు నిగ్గు...కాగా సోషలిజం ప్రవేశపెట్టేందుకూ, ప్రచారానికీ పూనుకుంటాం...ఈ మార్గాలనే హార్డీ అన్వేషించాడు...చాలామటుకు సాధించాడనే అనాలి...

...తర్వాత వెట్టి, కళారాధకుడు కళ అనే సాధనం వల్ల సంఘంలో విప్లవాన్నీ, పరివర్తననీ తీసికొని రావడం...ఈ మార్పువల్ల సంఘానికి ఉన్నతీ, సంస్కారమూ లభిస్తవి.

...విలియమ్ మారిస్, అల్డాక్ బుష్, మొదల్లో జార్జి బెర్నార్డుషా ఈ పంథానే త్రొక్కారు...... అయితే ఓకసీ, నవలారచయితా, నాటకకారుడూ, ఈ మార్పు త్వరలోనూ, సులువుగానూ తమతమ రచనలవల్ల తీసికొనిరావచ్చును. ఎందుకంటే వారు వ్రాసిన సంగతులు మనస్సుకు నాటుతాయి... హృదయాలని ఊపివేస్తాయి...ఒక్కసారి వారిలో యీ మార్పు రావడం కూడా జరుగుతుంది...అయితే లెక్కలంటే అందరికీ తలనొప్పి...మన దేశంలో విద్యాలయాల్లోనే నాటికి అలవైనంది పైగా లెక్కలజోలికి వెళ్లరు: లెక్కల నితరు జోలికి రానివ్వరు. అసలు దాని ప్రసక్తి అంటేనే శిరోవేదన ఆరంభమౌతుంది కొందరికి...లెక్కలవల్ల పాఠకుల మనస్సు చూరగొనడం, వారిని ఆవేశపూరితుల్ని చెయ్యడం ఇంచుమించుగా అసాధ్యం అని చెప్పాలి. అందుచేతనూ, లెక్కలు మనలో ఏ గొప్ప భావాన్నీ రేకెత్తించలేదు గాబట్టి కూడా లెక్కల మూలంగా సంఘంలో మార్పు తీసికొనివస్తానని ఒకవేళ ఏ గణిత శాస్త్రజ్ఞుడైనా అంటే అతడు భ్రమపడుతున్నాడని అనవచ్చును. సోషలిజం వచ్చాక, లెక్కలలో సరదా కల్గించడం మటుకు సుసాధ్యం.

హార్డీ చాలా గొప్ప మేధావి. గణితశాస్త్రపారంగతుడు...అతని పనివల్ల ఒకళ్లు బాధపడలేదు.. అతని పని ఒకడికి లాభంగా, ఇంకొకనికి నష్టంగా గలిగించలేదు. తన బుద్ధిబలాన్ని, తెలివితేటలనీ బాగా వినియోగించి, కనిపెట్టిన సాధనాలూ, పనిముట్లూ 'సరదా' సంఖ్యల మీద ప్రయోగించి, చాలా గొప్ప గణితాంశములను కనిపెట్టాడు.....మనం ఓ విజ్ఞానశాఖలో—మాటకి రసాయనశాస్త్రంలో పనిచేసిన ప్రావీణ్యుడూ,

పేరూ, ప్రతిష్ఠా సంపాదించే స్థితికి రాగానే దానికి ఎక్కువ విలువ ఇవ్వడంగానూ, దాన్ని గురించే అస్తమానం మాట్లాడడం, ఇంకోళ్లు కొంచెం అదోరకంగా అంత ప్రాముఖ్యం లేదంటే కళ్లలు వేగిపోవడం సామాన్యంగా జరిగేవే. ఏదైనా ఒక క్రొత్త సంగతి మనంతట మనం కనిపెడితే ఆ సంతోషం పట్టలేక పిచ్చిగా అందరితోటే చెపుతాం. మామూలు వాళ్లకే అల్లా ఉంటే, ప్రపంచ గణకుల్లో ప్రముఖ స్థానం వహించిన హార్డీ 'శుద్ధ' గణితాన్ని గురించి చాలా గొప్పగా మాట్లాడడం, ఆ సంగతి ఎత్తితేనే పరవశుడవడం ఇవంతా సులువుగా భావించవచ్చు.

హార్డీ కనిపెట్టిన గణితాంశాలూ, థీరమ్‌లూ, అప్లైడు...శక్తి...గణితం వాళ్లు యంత్రకూటాలకి (టెలిఫోను సిస్టములలాంటివాటికి) సజీవమైన మనిషి మెదడుకి ఉపయోగించి పనిచేస్తూఉంటే ఆయనకి నచ్చేదికాదు.. ఉదాహరణగా *J. B. S.* హాల్డేన్ *F. R. S.* అనే ప్రసిద్ధ జీవశాస్త్రవేత్త, గణితశాస్త్రజ్ఞుడూ హార్డీకి అత్యంతప్రియమైన 'థియరీ ఆఫ్ నంబర్స్' అంకగణితవిశేషాలని, అంకవిభాగం గురించిన సంగతులనూ, స్టాటిస్టిక్స్‌లో జనాభా లెక్కలలో ఉపయోగించాడు. ఒక కుటుంబంలో పెద్ద వాళ్లకు (ముందుపుట్టినవాళ్లకు) చిన్నవాళ్లకంటే (వెనకపుట్టినవాళ్ల)కంటే రోగనిరోధకశక్తి ఎక్కువా? తక్కువా? అనే విషయం పరిశోధించడంలో కుటుంబభోగట్టాలు (రికార్డ్సు) విచారించడంలో హార్డీ కనిపెట్టిన గణితాంశాలు ఆయన ఉపయోగించాడు. హాల్డేన్ హార్డీని గురించి ఇల్లా అన్నాడు: "హార్డీలాంటి ప్రపంచగణితశాస్త్రజ్ఞులూ, గణితశాస్త్రంలో చాలా గొప్ప పరిశ్రమ చేసినవాళ్లూ, గణితశాస్త్రంలో విశిష్టమైన సౌందర్యంగానూ, సౌష్ఠవమూ ఉన్నవని గ్రహించి, ఆ సౌందర్యపిపాస, సౌందర్యగ్రహణాలతో ఉత్తేజం చెందుతారు. అల్లా సౌందర్యగ్రహణం చెయ్యడంవల్ల వారికి ఇంకా ఎక్కువ సరదా, ఉత్సాహమూ కలుగుతాయి. ఆ విధంగా వారు ఇంకా గొప్ప గణితవిశేషాలని కనిపెట్టి, గణితశాస్త్రాభివృద్ధికి తోడ్పడతారు..." మనలో చాలామందికి, శాస్త్రకట్టుగా శ్రావ్యంగా ఆలాపించే కర్ణాటకసంగీతం వినడంవల్ల కలిగే హాయీ, తన్మయత్వంగానూ, గణితవిద్యార్థులకు (ఆస్థాయికి వచ్చి సంగతులు తెలిసికొని మెచ్చుకోగల్గినవాళ్లూ, సరదా ఉన్నవాళ్లూ...అంటే—ఈనాడు మన రాజధానిలో బి. ఏ. సీనియరు తరగతీ, ఎమ్. ఏ. చదివేవాళ్లు) హార్డీ థీరంలూ, గణితశాస్త్రవిశేషాలూ కల్గిస్తాయి... జి. హెచ్. హార్డీకి శ్రద్ధాంజలి సమర్పించి, అప్రస్తవణం చేస్తూ *Prof. M. H. A. Newman* ఇల్లా అన్నారు: (*B. B. C.* రేడియోలో 3 వ ప్రోగ్రాం ప్రసారణ) "శుద్ధగణితవిషయాల్లో ఉద్దండ గణితశాస్త్రజ్ఞులు కృషిచేసి సాధించిన గొప్పవిషయాల్ని చూసి మామూలువాళ్లూ, శక్తిగణితంలో ప్రావీణ్యం సంపాదించిన ప్రముఖశాస్త్రజ్ఞులూ ఒక గట్టి ప్రశ్న వేస్తారు. "పైకి స్పష్టంగా కనిపించే ఈశుద్ధ గణితవిశేషాలకి ఉపపత్తి కల్పించడం, ***Proof*** ఇవ్వడం అనే అవసరంలేని గడ్డుపనికి పూనుకొని అతినిశితంగా ప్రజ్ఞచూపించి...ఏళ్ల తరబడి కష్టపడి ఉపపత్తి తయారు చెయ్యడం ఎందుకూ?" అంటారు. హార్డీ ఇల్లా అనేవాడు: "శక్తిగణితం వాళ్లకి కావలసింది వాదన కాదు; గణితాంశాల ఉపపత్తి కాదు; ఆ ఉపపత్తి తేల్చే సారాంశం" ఆ ఉపపత్తిని నిర్మించడం సృజించడంలోనే ఉంది ఎంత కష్టమయినా. అందులో నిమగ్నుడౌతాడు శుద్ధగణితశాస్త్రజ్ఞుడు. అసలు ఉపపత్తి చాలా స్పష్టంగానూ, ఏవిధమయిన లోపం లేకుండానూ ఉండాలి...లేకపోతే శుద్ధగణకులకి అసలు తోచదు. అసలు అది ఉపపత్తే కాదంటారు వాళ్లు...

ఇంకో ముఖ్యమయిన సంగతి ఏమిటంటే, నిత్య వ్యవహారాల్లోనూ, మరికొన్ని సందర్భాలలోనూ కొన్ని చిక్కులు వస్తవి. లెక్కల ఆవరణ పెరిగిన కొద్దీ శుద్ధగణితాన్ని ఎన్ని విధాలయినా ఉపయోగించడానికి వెనుదియ్యరు. ఈ శుద్ధగణితథీరాలు చాలా గట్టి, తీవ్రమైన సంఘర్షణలకి తట్టుకోగలవి ఉంటుంది" ఎడాపెడా ఆ థీరాలని ఉపయోగించడానికి వెనుదియ్యని ప్రముఖులు చాలామంది ఉంటారు. మొట్టమొదట థీరాలని కనిపెట్టినపుడు ఉపపత్తి తాత్కాలికంగా ఇచ్చి తృప్తిపడడం జరుగుతుందిగాని ఎటువంటి సందర్భాల్లో ఎల్లా మిగతా శాస్త్రజ్ఞులూ, తదితరులూ ఉపయోగిస్తారనే దూరాలోచనకి వీలుండదు...చాలా వింత వింత సందర్భాలలో, వింత వస్తువులమీద ఈథీరాలు ప్రయోగించడం జరుగుతూ ఉంటుంది. ఉదాహరణంగా ఒక సాంద్రరేఖా సమూహాన్ని నిర్దేశించి వాదన చెప్తాం. ఇది చిన్న చిన్న

ఆవరణలకీ సులువయిన ప్రతియోగాలకి ఓవినంగా ఉపయోగించవచ్చు. కాని కొన్ని (అవి ఏవో చాలా స్పష్టంగా చెప్పేసె గ్యాలి సుందరగానే) షరతులు పాటిస్తేనే ఫలితం నిజంగాని, అపరతుల్ని ఉల్లంఘిస్తే ఎంతమాత్రం పల్లనూ అని సుందరకొళ్లకి బంధం వేస్తే ఏవిధంగా ఎప్పుడూ అర్థాన్ని ఉపయోగించినా, గడ్డుసమస్యలూ, చిక్కులూ రావు. లేకపోతే అంతా అయోమయం, అరణ్యమార్గం, కంటకావృతం అవుతుంది! అపరతుల్ని అతి స్పష్టంగా, నాజూకుగా, యుక్తసరిగా చెప్పడంలోనే ఉంది ఎంత నిశితప్రజ్ఞ, ధీవిశేషమూ అయినా. అల్లా చెప్పిననాడే ఉపపత్తి సర్వాంగసుందరం అవుతుంది. మనోహరరూపం దాల్చి చాలా సంతోషం కలిగిస్తుంది.

"బి. ఏ. డిగ్రీ చదివేవాళ్లకు కూడా అఖరాఖరునేకాని అంతకుముందు ఈ శుద్ధగణితపు ఉపపత్తులూ నేర్పకూడదు. ఈగణితభాగం చాలా కష్టం. దీన్ని నేర్చుకోవడం మాటలతో పనిగాదు! చాలా వ్యవధి తీసికొంటుంది; అసలు ఇవి మంచి తెలివి అయిన వాళ్లకే గాభరా, చికాకూ కల్గిస్తాయి......" అని ఇల్లా చెప్పే లెక్చరర్లనీ, ప్రొఫెసర్లనీగూడా దులిపేసి, దుమ్మెత్తిపోశాడు హార్డీ పండితుడు.

"లెక్కలంటే సరదాపడి, నేర్చుకొనే విద్యార్థులకి కోర్సు ప్రారంభించిన దగ్గరనుండీ, ఆ ఘడియ నుంచీ విస్పష్టంగా తెలివితేటలుపయోగించి, ఉపపత్తులివ్వడం చాలా ఇదిగా నేర్పి, ఆపిచ్చి బాగా తల కెక్కించాలి" అనేవాడు హార్డీ...అని చాలా తీవ్రముగా ఈవిషయాన్ని ప్రచారంచేసి హడావిడిచేస్తుండేవాడుగూడా...ఆయన వ్రాసిన '**A Course of Pure (Mathematics'**) శుద్ధగణితం అనే గ్రంథం ప్రపంచమంతటా ప్రఖ్యాతిచెంది చాలా తరాలుగా అనగ్న, ఎమ్. ఏ. పరీక్షలవాళ్లకి పాఠ్యగ్రంథంగా ఉపయోగిస్తోంది. ఈ పుస్తకంలో పై సంగతులు ఎంత సులువో, సుసాధ్యమో తేల్చాడు హార్డీ...(***Rigorous proofs***) స్పష్టంగా తన విద్యార్థులు ఉపపత్తులివ్వకపోతే సతాయించి, పోరి, పీక్కొని తినేసేవాడు వాళ్లని హార్డీ పండితుడు.

నిజంగా ఈ శతాబ్దపు మొదటి సగభాగంలో, ముఖ్యంగా ఈ తరంలో ప్రపంచగణితశాస్త్రజ్ఞుల్లో చాలామంది, ఇంచుమించుగా చాలా పేరుపొందిన ఆంగ్లగణితశాస్త్రజ్ఞులందరూకూడా హార్డీ పుస్తకం పట్టి, చాలా లాభంగా, విజ్ఞానంగా సంపాదించారు. ఆయనలెక్చర్లు విని హాయిహాయి అని అపరిమితానందం పొందేవాళ్లే గ్రహించేవారు వీరందరూను...హార్డీ లెక్చర్లు చాలా మనోరంజకంగా ఉండేవి...ఉపపత్తుల్ని స్పష్టముగా ఇవ్వాలని పట్టుపట్టి హార్డీ పాతిక ముప్ఫైయేళ్లు శ్రమించాక, ఇంగ్లండు దేశంలో విస్పష్టంగా ఉపపత్తి ఇవ్వడం అలవాటూ, పరిపాటే అయిపోయింది...ఆ విధంగా గణితశాస్త్రం పెంపొందింది...***Prof. M. H. A. Newman*** ఇంకా ఇల్లు చెప్పాడు: "నేను చిన్నప్పుడు చదివేటప్పుడు మాస్కూలులో లెక్కలమాస్టరు చాలా బాగా లెక్కలు చెప్పేవాడు. (అసలు లేకపోతే సాధారణంగా అక్కడితో ఆగిపోతుంది లెక్కల సరదా) ఆయన నాచేత హార్డీ 'శుద్ధగణితం' చదివించి స్వయంగా అనేకసంగతులు శ్రమించి నాకు చెప్పారు... అల్లా అయినా హార్డీ క్రింద చదువుకి వెళ్లి, ఆయన ఆవేశంతోనూ, ఉత్సాహంతోనూ హృదయరంజకంగానూ చెప్పే గణితాంశాలనీ, లెక్చర్లనీ విని ఎగిరి గంతులు వేసేవాడిని...ఆయనని ఎరిగిఉండటమూ, ఆయన లెక్చర్లు వినటమూ చాలా గొప్ప అదృష్టాలలో ఒకటి... అది నా జీవితానికంతటికీ విలువనిచ్చింది..."

వ్యక్తిగతంగా హార్డీ చాలా ప్రశాంతమయినవాడు. చాలా చురుకుగానూ, చమత్కారంగానూ, చక్కిలిగింతలు పెట్టేటట్టుగా మాట్లాడేవాడు...ఆయన మాట్లాడుతూ ఉంటే ఇంకా వినాలనిపించేది.. ఎవరితోనైనా సరే, మనోజ్ఞంగానూ, ఇంపుగానూ, మనస్సు నొప్పించకుండా మాట్లాడేవాడు. (తరుచుగా గిలిగింతలుపెట్టే చమక్కులూ, పోల్చా ఉండేవి...ఆయన సంభాషణలలో) జీవితాంతం దాకా హార్డీ క్రికెట్ ఆట అంటే విపరీతపు సరదా పడేవాడు...దీన్నిగురించి కొంతమందరే తెలియజేశారు. గణకశిరోమణులలో తలమానిక్యంలాంటి ప్రొఫెసర్ హార్డీ సరదాపడటంవల్ల క్రికెట్ పదాలూ, క్రికెట్ ఆటలో పేరుపొందిన వ్యక్తులూ, జగద్విఖ్యాతీ, చిరత్వమూ సంపాదించుకున్నారు...

స్వీడెన్ దేశంలో లెక్కల జర్నలు.. ప్రపంచఖ్యాతి కెందిన 'ఆక్టా మాథమాటికా'లో ఒక గణిత పరిశోధననుగురించి వ్యాసం వ్రాస్తూ హార్డీ ఇల్లా అన్నాడు: "ఈ లెక్క సులువుగా బోధపడటానికి దీనిని క్రికెట్ పదాలలో తెలియజేస్తాను...ఓ బాట్సు

మన్ (బాటు పట్టుకొని బంతిని బాట్‌తో కొట్టే వాడు), ఓ ఋతువులో,...కొన్ని ఇన్నింగులు...... ఆడా డనకోండి"అని...ఎవరైనా చాలా గొప్ప తర గతికి చెందుతా రనడానికి 'హాబ్స్'క్లాసవా డనే వాడు...(అంటే ప్రథమశ్రేణిలో ప్రథమస్థానం అంకించుకొనేవాళ్లన్నమాట)...ఈ హాబ్స్ వేదాంతి అయిన థామస్ హాబ్స్ అనుకొని ఖండఖండాల గణ కులూ 'పప్పులో కాలువేసే'వారు. (నిజానికి ఈ హాబ్స్ క్రికెట్ ఆటగాడు...ఇంతకుముందే ఈ విషయం ఈ వ్యాసంలో చదివిఉంటారు.)

హార్డీ చివరరోజుల్లో వ్రాసిన రెండో పుస్తకం '*A Mathematician's Apology*'...'గణితశాస్త్రజ్ఞుడి క్షమార్పణలు' ౧౯౪౦ లో ప్రచురించబడింది. దాన్నిగురించి విమర్శిస్తూ స్పెక్టేటర్ (*Spectator*) అనే ప్రముఖ బ్రిటిష్ పత్రిక ఇల్లా అంది:

"అరవయ్యో పడి దాటాక, హార్డీ తను జీవిత కాలమంతా లెక్కలు చదివినందుకూ...లెక్కలు చెప్పి నందుకూ...లెక్కలు చేసినందుకూ ... 'క్షమార్పణలు' వ్రాశాడు. నిజంగా జనసామాన్యానికి లెక్కలు నచ్చవు. 'మనకి అతినిశితప్రజ్ఞా, తెలివితేటలూ ఉంటేగాని గణితశాస్త్రంలో కఠినభాగాలు అమోమయంగా కనిపిస్తాయి. గణితశాస్త్రం కొరకరాని కొయ్య...ఎంతో కష్టపడితే, గింజుకుంటే కొంచెం బోధపడుతుందేమో' అనుకొని అసలు లెక్కలంటేనే చికాకుపడతారు సామాన్యులు......కాని చాలా మనోహరంగానూ, జాలిగానూ, ఉత్తేజం కల్గించేలాగా హార్డీ 'క్షమార్పణలు' వ్రాశాడు......ఈపుస్తకం చదివితే పై దురభిప్రాయం పటాపంచలవుతుంది. ఈ పుస్తకం చదివిన తర్వాత మామూలుగైతే, ఎక్కాలు నేర్చినవాళ్లు దగ్గరనుంచీ గూడా అసలు సంగతి తెలిసి కొని లెక్కలవిలువ అర్థంచేసికొని, శెభాష్ అంటారు. ......సౌందర్యపిపాసతో, విరామంలేకుండా కృషి చేసే హార్డీలాంటి కళావేత్త, కళారాధకుడూ...వివిధ వర్ణాలతో కష్టపడి చిత్రించిన...ఈగణితచిత్రపటాల ప్రదర్శనం...అందరి మనస్సులనీ చూరగొన్నది... ఇంత చక్కగా లెక్కలలో సరదా గల్గించే పుస్తకాన్ని ఇంతదాకా ఇంగ్లదేశంలో ఎవ్వరూ వ్రాయలేదు" అని.

మనోహరమైన శైలిలో, జనసామాన్యాని కెల్లా తెల్లమయ్యేటట్లు 'క్షమార్పణ'లని వ్రాశాడు హార్డీ. ముందర భూమిక (*Preface*) లో వ్రాస్తూ, "ఇంక లెక్కలు చెయ్యడానికి ఓపికా, విరామమూ, త్రాణా లేక వృద్ధాప్యానికి లొంగిపోయి, విధిలేక లెక్కల గురించి వ్రాయడానికి పూనుకున్నా" నన్న మాట జాలికొల్పుతుంది. ఈపుస్తకం ద్వారా హార్డీ తేల్చిన సారాంశ మిది: "మానవజీవితంలో విద్యాభ్యాసం చేసేకాలంలో నేర్చుకొని, అభ్యసింపవలసిన ముఖ్య విషయాలలో (సబ్జెక్ట్లలో) శుద్ధగణితానికి మొదటిస్థానం ఇవ్వాలి. దాని అవసరం చాలా ఉంది......అల్లా చెయ్యకపోతే భావి బాలురకీ, బాలికలకీ చాలా అన్యాయంగా, ద్రోహంగా చేస్తున్నామన్నమాట...ఆఖరికి ఇలా అన్నాడు: "నేను ఈగణితశాస్త్రంలో ఆసక్తి గలిగి, అభిరుచి పెంపొందింపజేసికొని, లెక్కలుచేసి కుంటూ హాయిగా నిర్విచారంగా గడిపిన ౩౦, ౪౦ ఏళ్లూ, ఈ కాలం అంతా, సద్వినియోగం అయిందని భావిస్తాను...అలా చేశానని నేను సంతోషిస్తాను. ...నాజీవితకాలంలో చాలాభాగం శుద్ధగణితం పోరి పట్టుపట్టి తీసేసుకుంది"...అని.

'గణితశాస్త్రంలో ఉన్న అందమూ (ఇది హిమాచలసౌందర్యములాంటిది ... గజగజ లాడిస్తుంది... '*It's beauty is cold*' అన్నాడు రసెల్ పండితుడు) సౌష్ఠవమూ, నిర్మాణపుతీరూ, ఇవి సమ్మోహనాస్త్రాలుగా నిజంగా పనిచేసి, కృషిసాగిస్తున్న గణితశాస్త్రపరి శోధకులకి ఆవేశం కల్గించి, ప్రోత్సహించి, వింతయిన కులాసా ఇస్తాయి...

...లాభం, ఉపయోగం,...వీట్ల ప్రసక్తి అనవసరం...లెక్కల విషయంలో...చిన్నలెక్కలూ అవీ నిత్య వ్యవహారానికి పనికివస్తాయి...వాడుకలో బిల్లులకీ, అకౌంట్లకీ ఈ చిన్నలెక్కలు చాలా అవసరం అని అందరికీ తెలుసు. కాని మీదికి వస్తూన్నకొద్దీ...గణితశాస్త్రంలో క్లిష్టభాగాల్లో ప్రవేశం గలిగి, అందులో ప్రావీణ్యాం సంపాదించి, విస్తృతంగా పరిశోధన సాగించిన కొద్దీ గణితశాస్త్రపు నిజస్వరూపం కనిపిస్తుంది. ...అయితే ఈ లెక్కలు (ఇవి బి. ఏ., ఆనర్సు, ఎమ్. ఏ. వాళ్లకి చెప్తారు) అనేసరికే మామూలువాళ్లందరికీ హడలూ, కొంచెం తలనొప్పీ వస్తాయి...ఈ అంశాలలోనే గణితశాస్త్రంలో ఉండుకొన్న స్నిగ్ధత్వమూ, అందచందాలూ ఇమిడిఉన్నాయి...నిత్యవ్యవహారికోపయోగ విషయాలు ఎందుకూ కొరగావు...

యూనివర్సిటీలలో చాలా పెద్దపరీక్షలకి చెప్పే ఈ లెక్కలు సామాన్యులకి సాధారణంగా బోధపడవు... దైనికజీవితంలో ఈ లెక్కలు వచ్చిఉండడం అవసరం లేదు కూడా...ఇదంతా వ్యర్థం, నిరర్థకం అంటారు సామాన్యప్రజలు...

గణితశాస్త్రజ్ఞులు విశేషశ్రమవల్ల సాధించిన శుద్ధగణితాంశాలూ, వారు జీవితమంతా వినియోగించి తెలుసుకొని ప్రచురించిన థీరములూ, 'ఎందుకూ పనికిరానట్లు' మానవాలవాళ్లకి కనిపిస్తాయి.. (ఎద్దుకేం తెలుసును...అటుకుల రుచి?...అని)...ఒకనాడు గెలిలియో, కెప్లరూ అనే పాశ్చాత్యసిద్ధాంతశాస్త్రజ్ఞుల ఖగోళసిద్ధాంతాలని...'ఎందుకూ పనికిరాని 'చచ్చు' సిద్ధాంతా'లని ఆకాలంవాళ్లు గేలి చేశారు...కాని కాలక్రమంగా, ఖగోళశాస్త్రంలో తక్కినతరాలవాళ్ల 'విశ్వనిర్మాణం గూర్చిన అభిప్రాయములలో' ఇవి చాలా గొప్ప మార్పు తీసికొనివచ్చాయి..."ఎందుకూ పనికి రానట్లు కనిపించే శుద్ధశక్తిగణితాంశాలలో గొప్ప సౌందర్యమూ, దీప్తి, సొంపూ నిండీకృతం" అయి ఉందని ప్రపంచానికి చాటి వెళ్లిపోయాడు హార్డీ పండితుడు...

...ఒక ఏడాది గడిచింది...ఒక వస్తువు, ఒక మహానుభావుడూ లేనప్పుడుగాని, వాటిని చేతులారా పోల్పోయినప్పుడుగాని వాట్ల విలువ నిజంగా గుర్తించడం జరుగదు...కాగా ఏళ్లు గడుస్తూఉంటే ఒక మహాపురుషుని గొప్పతనం తనంతటు తానే ప్రచురితం అవుతూఉంటుంది...హార్డీ ఆత్మకి శాంతి కలగాలి!

...భారతదేశంలో, ముఖ్యంగా దక్షిణ ప్రాంతం, అందులోనూ మద్రాసురాష్ట్రం, లెక్కల విషయంలో చాలా గొప్పపేరు సంపాదించింది. క్రిందటి, ఈ తరాలు రామానుజం పేరు నిలబెడుతున్నాయని చెప్పవచ్చు...ఈమధ్య డా. అలగప్పచెట్టియారూ, స్వతంత్రభారతప్రభుత్వమూ కాశైకుడిలో గొప్ప రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ స్థాపించి, 'రామానుజం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రిసెర్చ్'ని గణిత విషయశోధనకోసరం ప్రత్యేకించి, ప్రఖ్యాతపరిశోధకులకు బాదరబందీ లేకుండా ప్రశాంతంగా పనిచేసుకోవడానికి అవకాశాలు ఏర్పరచడం, పట్టుపట్టి అప్పుడే శంకుస్థాపన చెయ్యడం చాలా ముదావహం...కాని రామానుజాన్ని పైకి తీసికొనివచ్చి, అతని ప్రతిభను జగద్విఖ్యాతంచేసి, రామానుజాన్ని ఉన్నతపథాలకి తీసికొనివెళ్లిన హార్డీపండితుణ్ని మనం విస్మరించడం అపరాధం అవుతుంది. శ్రీనివాసరామానుజం పేరిట స్థాపించిన ఈ ఇన్‌స్టిట్యూట్‌లో ఆయనకి ప్రాణమిత్రుడూ విఖ్యాతగణితశాస్త్రజ్ఞుడూ అయిన హార్డీ పేరుగా 'హార్డీ ప్రొఫెసరుషిప్పు'నూ, 'హార్డీ శుద్ధగణితశిపార్టుమెంటు'నూ నెలకొల్పమని డా. అలగప్పచెట్టిగారునూ, కేంద్రప్రభుత్వమునూ కోరుతూ, 'రామానుజంసంప్రదాయాన్ని' మద్రాసు రాష్ట్రం నిలబెడుతుందని ఆశిస్తున్నాను...ఈవ్యాసం వ్రాయడంలో నాకు తోడ్పడిన ప్రొఫెసరు హాడ్డేను F. R. S., ప్రొఫెసరు న్యూమన్ గార్ల పుస్తకాలనీ, వ్యాసాలనీ, రేడియోప్రసంగాలనీ, హార్డీపండితుడి పుస్తకాలనీ పేజీలయినా త్రిప్పమని విద్యార్థులనీ, తదితర్లనీ కోరుతూ, ఆ ప్రొఫెసర్లకి కృతజ్ఞతాపూర్వకంగా వందనా లర్పిస్తున్నాను.






[కథానిక]

"అమరేంద్ర"

"నిజంగానా?" అని ఆశ్చర్యంతో అడిగింది సంధ్య.

"నీతో ఎప్పుడైనా అబద్ధం ఆడానా సంధ్యా?" అని ఎదురుప్రశ్న వేశాడు ఆనందరావు.

నిజమేనా? అందులో ఆనందరావు అన్నంత పనీ చేసితీరే రకం.

అతని మాటలు వింటుంటే సంధ్య భయంతో కంపించిపోతోంది. అతని మాటలు నమ్మటానికీ వీలు లేదు, నమ్మకపోవటానికీ వీలులేదు. అర్థంకాని సందిగ్ధావస్థలో సంధ్య తన్నుకుంటున్నది.

"అయితే, ఆనంద్, ఎక్కడికి వెళ్ళిపోతావో చెప్పవా? అసలు ఇంత ఆకస్మికంగా నీకు ఇటువంటి కోరిక ఎందుకు కలిగిందో నేను తెలుసుకోగూడదా" అని వేదనతో వ్యాకులమైన కంఠంతో సంధ్య ప్రశ్నించింది.

"తెలుసుకోవచ్చు. కాని తెలిపేందుకు ఏముంది?" అని ఆనందరావు కిటికీలోంచి దూరాన కనిపిస్తున్న కొండలకేసి చూస్తూ బదులు చెప్పాడు.

"ఇటు చూడు ఆనంద్! నాతో మాట్లాడటానికి ఇంత బెదిరిపోతున్నావేం? ఇంతలోనే ఎంత మారిపోయావో? ఏదో రహస్యాన్ని నాకు చెప్పకుండా దాస్తున్నావు. అది బైటపడిపోతుందేమోనని బెదిరిపోతున్నావు. అంతిమాత్రం నేను తెలుసుకోలేననుకున్నావా? నిజం చెప్పు. చెప్పేదాకా నిన్నిక్కడి నుంచి కదలనివ్వను. ఎక్కడికి వెళ్ళిపోదలుచుకున్నావు? ఎందుకు వెళ్ళిపోవాలనుకున్నావు?" అని సంధ్య దారికి అడ్డంగా నిలబడింది.

సంధ్యముఖంకేసి ఒకసారి చూసి ఆనందరావు తల వంచుకున్నాడు. సంధ్యకళ్ళలోని మిరుమిట్లుగొలిపే వెలుగుముందు ఏ రహస్యమూ దాగదు. ఆ వెలుగు తన హృదయంలోని మర్మాలన్నిటినీ భేదించివేస్తుంది. కాని ఏమని చెబుతాడు? ఏమీ తోచలేదు. చివరికి "సంధ్యా, నిజంగా నీకు ఏం చెప్పాలో నాకు తెలియటంలేదు. ఎక్కడికి వెళ్తానో నాకే తెలియదు. ఎందుకు వెళ్ళాలనుకుంటున్నానో కూడా నాకు తెలియదు" అన్నాడు.

"ఎంతసేపూ ఒకటేమాట. అయితే నీ రహస్యం నువ్వే దాచుకో. పాపం, వెళ్తున్నానని చెప్పటానికి మటుకు వచ్చావు. సంతోషం..."

"చెప్పటానికిమాత్రమే కాదు. పెళ్ళినాటికి వుండను. వెళ్ళిపోయేముందు నిన్ను దీవించి వెళ్ళాలని వచ్చాను" అంటుండగానే ఆనందరావుమాటలకి అడ్డం వచ్చి "అప్పుడే దీవించేటంత పెద్దమనిషి వై పోయావు కాబోలు" అని సంధ్య చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు శరత్కాలపు వెన్నెలలాగా ఆనందరావుహృద

యాన్ని క్షణంలో ఆవరించింది. మనసులోని చీకటి మబ్బులన్నీ ఆ వెన్నెలలో కరిగిపోయినై. అతని ముఖం కూడా బదులుగా చిరునవ్వు నవ్వాలనిపించింది. కాని అప్రయత్నంగా కనురెప్పల్లోంచి అశ్రువులు తొంగిచూసినై.

"అయితే, ఒక్క మాట అడుగుతాను ఆనంద్: నామీద కోపగించుకుని వెళ్లిపోతున్నావా? యావజ్జీవితమూ నన్ను వేధించదలుచుకున్నావా?"

"లేదు సంధ్యా, నామాట నమ్ము. నాకు ఎవరిమీదా కోపం లేదు. నీమీద అసలే లేదు. విధి మీదా, లోకంమీదా కోపగించుకునే అధికారం మానవుడికి లేదు."

"ఏమిటో నీమాటలు చాలా కొత్తగా వున్నయ్."

"అవును. ఎల్లుండినుంచి నువ్వు కొత్తదానివి కాబోతున్నావు. అందుకని ఇవాళే నామాటలు కొత్తగా కనిపిస్తున్నయ్. దీంట్లో ఆశ్చర్యమేముంది?" అన్నాడు. ఈ మాటలలోని వెటకారం సంధ్యహృదయానికి సూటిగా తగిలింది. బదులు చెప్పలేకపోయింది. మాటలకందని బాధ సంధ్యముఖాన్ని చీకటిమబ్బులాగా కమ్మివేసింది.

వారిద్దరిమధ్యా క్షణక్షణమూ అశ్రువులతో వేదనతో బరువెక్కిన మౌనం ఇనపగోడలు కడుతోంది. చిన్ననాటినుంచీ ఆటపాటలతో కలిసిమెలిగిన వారిద్దరూ ఈక్షణంలో ఎంతో అపరిచితులమాదిరిగా మారిపోయారు. ఇద్దరిమధ్యా ఏదో దాటలేని అఖాతం మోతలు పెడుతోంది.

ఈ దారుణమౌనాన్ని భంగంచేస్తూ "వెళ్లొస్తాను సంధ్యా" అని ఆనందరావు రెండడుగులు వేశాడు.

"వెళ్లక తప్పదన్నమాట. నీ సంకల్పానికి తిరుగు లేదని నాకు తెలుసుగా" అంది సంధ్య.

ఆ మాటకు బదులు చెప్పకుండా ఆనందరావు "వెళ్తూ ఒక్క కోరికమట్టుకు కోరుతున్నాను. అది నువ్వు తప్పకుండా పాటించాలి సంధ్యా" అన్నాడు.

"నీకు సందేహ మెందుకు ఆనంద్? అది ఎంత దుర్ఘటమైన కోరిక అయినా సరే" అని సంధ్య బదులు చెప్పింది.

"నన్ను మరిచిపో, పూర్తిగా మరిచిపో సంధ్యా. నేను నీ గతజీవితంలోని కారుమబ్బుని, పీడకలని. నన్ను నీహృదయంలోంచి తరిమివెయ్యి. నీ భావి సుఖంతోనూ, శోభతోనూ మంగళమయంగా వుండాలని కోరుకుంటున్నాను. ఇదే నా చివరికోరిక" అంటూనే ఆనందరావు గబగబా గదిబైటికి వెళ్లాడు.

ఈమాటలకి సుడిగాలికికంపించే లతలాగా సంధ్య వొణికిపోయింది. అక్కడే నిలబడిపోయింది. చూస్తుండగానే ఆనందరావు మలుపుతిరిగి చెట్లగుబుర్లలో మాయమైపోయాడు. పరిసరమంతా చీకటి వెలుగుల దాగుడుమూతల్లో వింతగా మారిపోతోంది. దూరాన కొండలవరసలూ, చెట్లగుబుర్లూ, చెరువులో నీళ్ళూ సంజకెంజాయలతో నిండిపోతున్నయ్. ఆక్షణంలో ప్రకృతిలో కన్నీళ్లకీ, చిరునవ్వుకీ స్నేహం కుదిరింది.

కాని సంధ్యహృదయం బాష్పదరహాసాలమధ్య ఊయలలూగుతోంది. ఎల్లుండే సంధ్యపెళ్లి. ఇవాళ తన చిన్ననాటి స్నేహితుడు అకస్మాత్తుగా ఎక్కడికో వెళ్లిపోతున్నాడు. ఎందుకో చెప్పడు. కాని సంధ్యకి తెలియకపోలేదు. తెలుసుకనకనే మనసులో ఇంత బాధ.

ఇక తెల్లారితే సంధ్యపెళ్లి. ఆరాత్రే ఆనందరావు ఎవరికీ చెప్పకుండా ఎక్కడికో వెళ్లిపోయాడని ఊరంతా గగ్గోలు. పరారి అయిపోయాడని కొందరూ, ఆత్మహత్య చేసుకున్నాడని కొందరూ ఎవరికి తోచినట్లు వాళ్లు తీర్మానించుకున్నారు.

ఈవార్త విని సంధ్య నివ్వెరబోయింది. అనుకున్నంత పనీ జరిగింది. కళ్యాణకింకిణుల మంగళధ్వనుల మాటునుంచి, తూర్యరావాలమాధురుల చాటునుంచి, మాటిమాటికీ "నన్ను మరిచిపో, నన్ను మరిచిపో" అన్న మాటలే వినిపిస్తున్నయ్.

౨

"స్వామీజీ"

"ఎవరు నాయనా,—నువ్వా ఆనంద్? ఏం ఇంత అర్ధరాత్రి వచ్చావు?"

"నాకు దీక్ష ఇప్పించండి. ఇప్పుడే ఇప్పించండి."

"అంత తొందర రెందుకు బాబూ? నీ పరీక్షా కాలం ఇంకా పూర్తికాలేదు."

"స్వామీ, ఇంక నేను పరీక్షకి నిలవలేను. నన్నొక ఒడ్డుకి చేర్చండి. నన్ను రక్షించండి. నాకు దీక్ష ఇప్పించండి. మీపాదాలకి సేవచేస్తూ జీవిత మంతా గడిపేస్తాను" అని వ్యాకులపాటుతో గురువు గారి పాదాలమీద వాలి విన్నవించుకున్నాడు.

ప్రశాంతవదనంతో స్వామీజీ ఆనందమాటలు విన్నారు. జీవితంలోని సుఖదుఃఖాలన్నిటికీ అతీత మైన శాంతి ఆయనముఖమండలంలో మెరుస్తోంది. ఆశ్రమమంతా నిద్రలో మునిగివుంది. ఆయన ఒక్కడే మేలుకొని ఏదో చదువుకుంటున్నారు. ఎన్నాళ్ల నుంచో ఆనందతో మాట్లాడాలని ఆయన అనుకుం టున్నారు. స్వామీజీతో సంభాషించి తన అశాంతిని ఆయనకి నివేదించాలని ఆనంద ఎన్నాళ్లనుంచో వేచి వున్నాడు. ఇటువంటి ఏకాంతిసమయంకోసమే ఇద్దరూ ఎదురుచూస్తున్నారు.

కిటికీసందుల్లోంచి వెన్నెల జారివచ్చి స్వామీజీ ఆసీనులైవున్న చోటిని బంగారుకాంతులతో నింపు తోంది.

మధురగంభీరస్వరంతో "నాయనా, ఆనంద్, దీక్షకోసం ఎందు కింత తొందరపడుతున్నావు? నీ ముఖంలో ఎప్పుడూ ఏదో అశాంతి, ఏదో విచారం కనిపిస్తున్నయ్. ఇంకా నీ పరీక్షాకాలం పూర్తికాలేదు. దీక్ష స్వీకరించే అర్హతని నువ్వు పొందలేదు" అని స్వామీజీ ఆనందరావుముఖంకేసి చూశారు. ఆనంద తలవంచుకుని మెదలకుండా కూచున్నాడు. దీపపు వెలుతురులో ముందుకిసాగలేక నిలబడిపోయి చుట్టలు చుట్టుకునే సర్పంలాగా అతని మనసు స్వామీజీ సన్నిధానంలో మెలికెలుతిరిగిపోతున్నది.

"నిజం చెప్పు ఆనంద్, నువ్వు ఎవరిమీద అలిగి ఇక్కడికి వచ్చావు?"

"నేను ఎవరిమీదా కోపగించుకుని రాలేదు స్వామీ. జీవితంలోని సుఖదుఃఖాలకి రోసి ఇక్కడికి వచ్చాను. జీవితాన్ని ఈశ్వరపదసన్నిధిని పూజా ప్రసూనంగా సమర్పించాలనే ఆశతో ఇక్కడికి వచ్చాను."

"అయితే ఇక్కడ నీకు శాంతి లభించిందా?"

"లేదు స్వామీ, నాహృదయంలో ఏదో సమసి పోని సంఘర్షణ, ఏదో చెప్పలేని అశాంతి. ఉన్నత లక్ష్యాన్ని చేరుకోలేనునే భయంతో ప్రతిమెట్టు ఎక్కే టప్పుడూ కాళ్లు వణికిపోతున్నయ్. ఇక్కడినుంచి ఏక్షణంలో జారి అథఃపాతాళానికి అణగారిపోతానో అనే తీరని బాధ. అందుకే స్వామీ, తొందరగా దీక్ష ఇప్పించండి. వెనక్కి తిరిగిల్లేదారి మూసెయ్యండి. నన్ను కాపాడండి" అని వ్యగ్రస్వరంతో విన్న వించాడు.

"నువ్వు తొందరపడుతున్నావ్ ఆనంద్. అంత తేలికగా దీక్ష లభించదు. నీసంకల్పం బలీయమై నీ పూర్వబంధాలన్నిటినీ దగ్ధం చెయ్యాలి. నీ మనసులో ఏ కోరికా దాగివుండకూడదు."

"నా వాంఛలన్నిటినీ భస్మం చేశాను స్వామీ"

"లేదు ఆనంద్. నువ్వు పొరబడుతున్నావు. కోరికలేని మనసులో అశాంతి వుండదు. నీకే తెలియని కోరికలేవో నీ అంతర్యంలో దొంగచాటుగా నక్కి వున్నయ్. వాటిని కూకటివేళ్లతో పెకలించివెయ్యి. అంతవరకూ నీకు దీక్ష లభించదు."

"అయితే ఈ ఎడతెరిపిలేని సంఘర్షణలోంచి నన్ను రక్షించరా స్వామీ?"

"నిన్ను ఉద్ధరించుకునే మార్గం నువ్వే కను క్కోవాలి, ఆనంద్. ఆత్మపరీక్ష అగ్నిపరీక్ష. నీ అశాంతికి కారణం నువ్వే అన్వేషించి నిర్మూలించు."

"శలవు, స్వామీజీ"అని ఆనందరావు అక్కడి నుంచి వెళ్లిపోయాడు. తనకే తెలియని కోరిక ఏదో తన మనసులో దాగుడుమూతలాడుతున్నదా? అదే తన అశాంతికంతటికీ మూలమా? అన్ని కోరికలనీ దాటివచ్చిన తన కింకేం కోరిక వుంది? ఆనందరావు మనస్సు తుపానునాటి సముద్రంలాగా సంక్షోభిస్తోంది.

ఆశ్రమంలో తన గదికి చేరుకున్నాడు. గురువు గారి కుటీరంలోని దీపం చీకటిలో లీనమైపోయింది.

వెన్నెలని చూసి తెల్లవారిందనుకుని పారబడ్డ పక్షులు చెట్లగూళ్లలో సందడిచేస్తున్నయ్.

అంతా గభీరమైన నిశ్శబ్దం. అంతటా చల్లటి వెన్నెల. ఆశ్రమమంతా రమణీయమైన ప్రశాంతిలో మధురనిద్రలో మునిగివుంది.

నిద్రపట్టని ఆనందహృదయంమాత్రం బద్దలు కావటానికి ఎదురుచూసే అగ్నిపర్వతంలాగా కళవెళ కాగిపోతోంది.

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ, గతకాలపు మరుపుతెరల మాటునుంచి "నన్ను మరిచిపో సంధ్యా, నన్ను పూర్తిగా మరిచిపో" అన్న తన మాటలు వికృతంగా వినిపించినై. ఆనంద ఆపాదమస్తకమూ కంపించిపోయాడు. సంధ్యస్మృతి ఒక్కసారిగా అతని హృదయాన్ని అమృతహాలాహలాలతో నింపేసింది. ఆశ్రమాన్నంతటినీ ఆవరించిన వెన్నెలచల్లదనంలో సంధ్యచిరునవ్వు కనిపించింది. ఆ ప్రశాంత విభావరి ప్రసరించే మధురజ్యోత్స్నలలో సంధ్య విశాలనయనాల వింతకాంతులు కనిపించినై. ఇంతకాలమూ అతని మనసుని ఆవరించిన అశాంతి ఈ క్షణంలో సంధ్యగా రూపొందినట్లనిపించింది.

దారితెలియని బాటసారి నడిచినడిచి తనకి తెలియకుండానే చేరదలుచుకున్న నగరాన్ని చేరితే ఎంత ఆశ్చర్యపోతాడు! ఎంత ఆనందిస్తాడు! ఆనంద హృదయంకూడా అటువంటి స్థితిలోనే వుంది.

కాని తానెవరు? సంధ్య ఎవరు? సంధ్య స్మృతిని తన హృదయంలోంచి దూరంగా తరిమివేయటంకోసం కాదా తను ఇక్కడికి వచ్చింది? స్వామీజీసారథ్యంలో ఆధ్యాత్మిక జీవనపథంలో సాగిపోయి కేవలంభౌతికజీవితమధురస్మృతియైన, సంధ్యని హృదయంలోంచి పెకలించివేయాలనే స్వజసంకల్పంతోనే తానిక్కడికివచ్చాడు. తన జాడతెలియక ఇంటివార బంధుమిత్రులు, తల్లిదండ్రులు ఎంత తల్లడిల్లినా తాను సరుకుచేయలేదు. తన సంకల్పబలం, తన దీక్షా సాహస-అన్నీ అనిమిషంలో గాలికికొట్టుకుపోయే మబ్బులమాదిరిగా మాయమైపోయినై. తనని ఓడించిన సంధ్యస్మృతి అతని హృదయాకాశంలో తీయని వెన్నెలగా అలుముకు పోతోంది. ఆ క్షణంలో ఆనంద పరాజితుడైనాడు. కాని వెయ్యివిజయాలు ఒక్కసారి సాధించినా అంత ఆనందంతో అతని మనసు పొంగిపోయేది కాదు.

## 3

సంధ్య అత్తవారింటికి వెళ్లిన ఏడాదికే పుట్టింటికి తిరిగివచ్చింది. ఆమెభర్త అకాలమరణానికి కంటతడిపెట్టనివాళ్లు లేరు. సంధ్యజీవితం దరీ తెన్నూ లేని శోకసాగరమైపోయింది. నిత్యనిశీథమైన ఆమెజీవితానికి ఒక్కటే ఆశాజ్యోతి—రెండునెలల పసిపాప రమ. ఆ పసిపాపకోసమే సంధ్య దుర్భరదుఃఖాన్ని దిగమింగుకుంటూ జీవయాత్రని సాగిస్తోంది.

అందరూ వచ్చి సంధ్యను ఓదార్చిపోతున్నారు. ఒకరోజున బాగా చీకటిపడ్డాక ఎవరిదో ఒక నీడవచ్చి సంధ్యగదిలో నిలబడింది. దీపం కొడిబారి గది అంతా మసకగా వుంది. ఆ వచ్చిన వ్యక్తి ఎవరో సంధ్య వెంటనే గుర్తుపట్టలేక పోయింది. తనంతట తను ముందుగా పలకరించటానికి నోరురావటంలేదు. "ఇంత చిన్నవయస్సులోనే ఎంత పెద్ద కష్టం నెత్తినపడిందే తల్లీ" అని వచ్చిన వ్యక్తి ఒక్కశోకం పెట్టింది. ఆ కంఠాన్ని సంధ్య గుర్తుపట్టింది. కాని నమ్మలేక పోయింది. ఆశ్చర్యంతో దీపం పెద్దదిచేసింది. తెల్లటి ముసుగులో దీనంగా తల వంచుకున్న ఆముఖాన్ని చూడగానే సంధ్య స్తంభించిపోయింది. కంఠాన్ని ఎవరో గట్టిగా నొక్కివేసినట్లయింది. పెగుల్చుకుని "అత్తయ్యా" అని సంధ్య ఒక్కసారి ఆక్రందించింది.

"అవును తల్లీ! నీ పాపిష్టి అత్తయ్య ఇంకా బతికేవుంది. ఆమహారాజుమాత్రం దాటిపోయారు. మొండిఘటాన్ని నేను మటుకు బతికేవున్నాను. వీధి ముఖం చూడకపోయినా నువ్వు వచ్చావని విన్నాక మనసు నిలవలేదు. ఎంత ఆపద వచ్చిందే తల్లీ!" అని మాట్లాడలేక మధ్యలో ఆగిపోయింది. సంధ్య శ్రావణ మేఘంలాగా కరిగిపోయింది.

"ఊరుకో తల్లీ, ఏడ్చి లాభంలేదు. ఎన్నికష్టాలు వచ్చినా మొండిగా భరించటంతప్ప మన మేం చెయ్యగలం? ఆ పసిదాన్ని చూసుకుని దుఃఖాన్ని దిగమింగుకోవాలమ్మా." అని సంధ్య కన్నీళ్లని తన కొంగుతో తుడిచింది. దుఃఖంతో కుమిలిపోయే హృదయం శోకాగ్నిలో దగ్ధమౌతున్న మరొక హృదయాన్ని చల్లటి మాటలతో ఊరడించింది. ఈ మాటలు సంధ్యకి ఎంతో శక్తినిచ్చినయ్. బలవంతాన కన్నీటిని ఆపుకుంటూ వొణుకుతున్న కంఠంతో సంధ్య అడిగింది "బావజాడ ఏమైనా తెలిసిందా?" అని.

"ఏం చెప్పను తల్లీ?" అని ఒక్కసారి ఆవురుమంది. కొంచెంసేపున్నాక "తండ్రిపోయినరోజే వాడి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ఫలానాచోట వున్నానని రాయలేదు. క్షేమంగా వున్నాననీ, తనకోసం విచారించవద్దనీ రాశాడు. వారి ప్రాణం పోకముందు ఆవుత్తరం అందితే ఎంత సంతోషించేవారోగదా! కాని నాకు ఈ రాత వుంటే అల్లా ఎందుకు జరుగుతుంది? మొండిఘటాన్ని ఇంకా చావలేక బతికున్నాను. ఎప్పటికైనా మనసు తిప్పుకుని వాడు ఇంటికి వస్తాడనే ఆశ నాకు. ఏమంటావు తల్లీ, వస్తాడంటావా?" అని ఎంతో ఆత్రంగా సంధ్యకేసి చూసింది. ఆ తల్లి మనోవేదనని గ్రహించి సంధ్య "వస్తాడు, తప్పకుండా రావచ్చు" అంది.

"చల్లటిమాట చెప్పావు తల్లీ. నీ నోటివాక్యాన వాడు క్షేమంగా ఇంటికివస్తే నా కింక్షేం కావాలి!" అంటూ కొడుకు తిరిగివచ్చినంతగా సంబరపడుతూ ఆమె ఇంటికి బయలుదేరింది. ఆ నిమిషంలో సంధ్య కళ్లముందు పెద్ద మెరుపు మెరిసిన ట్లయింది. ప్రతి హృదయంలోనూ ఏదో మిణుకుమనే ఆశ! ఆ ఒక్క ఆశకోసమే ప్రాణంబిగబట్టుకుని, దుర్భరదుఃఖాన్ని దిగమింగుకుంటూ జీవితపథంలో మొండిగా ముందడుగు వెయ్యాలి. ఉయ్యాలలో నిద్రపోతున్న రమ కదిలిన అలికిడి అయింది. సంధ్య చివాలున లేచి వెళ్లింది. ఈ మిణుకుమనే వెలుగే తన జీవితంలోని కారుచీకటిని పటాపంచలు చేస్తుందన్న విశ్వాసం క్షణంలో సంధ్య హృదయాన్ని శక్తితో నింపివేసింది.

## ౮

ఆశ్రమవాసులంతా ఆనందరావు ఆరోగ్యాన్ని గురించి ఆందోళనపడుతున్నారు. అతని వ్యాధి నానాటికీ ఎక్కువైపోతోంది. మనిషి ఆనాటికంటే ఆనాడు దిగనాసిల్లిపోతున్నాడు.

"పోనీ, ఒకసారి ఇంటికి వెళ్ళిరా బాబూ. నీ కోసం ఇంటిదగ్గర తల్లిదండ్రు లెంత క్షోభపడుతున్నారో! జబ్బు తగ్గినాక మళ్ళీ రావచ్చును" అని పక్కన కూచుని విసురుతూ స్వామిజీ బతిమాలుతున్నారు.

"వొద్దు స్వామీ, ఇంటికి వెళ్లాలని లేదు. నన్ను మీ పాదాలదగ్గరే వుండనివ్వండి. నాకు దీక్ష ఇప్పించండి. నేను ఇక్కడే మరణిస్తాను. మీరే నాకు తల్లీ, తండ్రీ" అని ఆనంద్ నీరసంగా బదులు చెప్పాడు.

"కొంచెం నిద్రపట్టించుకో ఆనంద్" అని స్వామిజీ విసురుతూ పక్కనే కూచున్నారు. మాట్లాడుతూనే ఆనంద్ కళ్లుమూసి నిద్రపోయాడు. కాని స్వామిజీకి ఆనంద్ సంగతి విషమసమస్యగా వుంది. దీక్షకోసం తొందరపడుతున్నాడు. పరీక్షాకాలం పూర్తి కాలేదు. పైగా మనిషిముఖంలో ఎప్పుడూ ఏదో చింతకనిపిస్తుంది. ఆకారంలో ఎప్పుడూ అశాంతి కనిపిస్తుంది. అతన్ని చూస్తుంటే గతకాలంతో తెగ తెంపులు చేసుకున్నట్లు కనిపించడు. పూర్వాశ్రమానికి సంబంధించిన బలీయమైన బంధా లేవో ఇంకా అతన్ని చుట్టుకునివున్న ట్లనిపిస్తుంది. తనమీద తనకే నమ్మకం లేక దీక్షఇప్పించమని తొందరపడుతున్నాడు. గత జీవితంలోకి తిరిగివెళ్లే దారులని మూసే ఇనపతలుపు దీక్ష అనుకుంటున్నాడు. స్వామిజీకి అతని హృదయం దీక్షాజ్వాలల్లో నిలబడటానికి పరిపక్వం కానట్లు తోచింది. కాని ఇతనికి దీక్ష ఇవ్వకుండా ఎంతకాలం జాగుచెయ్యటం? ఇతని భావిజీవితాన్ని ఏవిధంగా నడిపించటం? ఇవే స్వామిజీని వేధిస్తున్న ప్రశ్నలు.

ఇంతలో ఆనంద్ నిద్రలో అటూ ఇటూ కదిలాడు. "సంధ్యా సంధ్యా" అని రెండుసార్లు కలవరిం

చాడు. స్వామిజీ "ఆనంద్, ఆనంద్" అని పిలిచారు. ఆనంద్ పలకలేదు. ఆ కలవరింత స్వామిజీ మనస్సులో అస్పష్టంగా వున్న అనుమానాన్ని బలపరిచింది.

తెల్లవారేసరికే ఏర్పాట్లన్నీ పూర్తిఅయినయ్. ఇద్దరు శిష్యులని తోడుపెళ్ళి ఆనందరావుని ఇంటిదగ్గర దింపిరమ్మని స్వామీజీ ఆజ్ఞాపించారు.

నిద్రలేవగానే తన ప్రయాణం స్థిరమైపోయిందని విని ఆనందరావు నిర్ఘాంతపోయాడు. "స్వామీ, నాకు దీక్ష అనుగ్రహించరా? నన్ను మీపాదాలదగ్గర నిశ్చింతగా పడిపోనివ్వరా? నేను చేసిన తప్పిదమేమిటి స్వామీ? నాకెందుకింత కఠినశిక్ష విధిస్తున్నారు?" అని దీనంగా వేడుకున్నాడు.

"నువ్వు ముందు ఇంటికి వెళ్ళిరా ఆనంద్" అని స్వామీజీ బదులుచెప్పారు. ఇక వ్యవధి అయిపోవస్తోంది. శిష్యులు ప్రయాణసన్నాహాలన్నీ పూర్తి చేసుకున్నారు. బయలుదేరేముందు స్వామీజీ అందరినీ వెలికిపంపించి ప్రశాంతస్వరంతో "ఆనంద్, నిన్నరాత్రి నిద్రలో సంధ్యా అని కలవరించావు. ఎవరా సంధ్య? నీకేమౌతుంది? నిజం చెప్పు" అని అడిగారు.

దొరికిపోయిన దొంగలాగా ఆనందరావు సిగ్గుతో ముడిపోయాడు నోట మాటరావటం లేదు. అప్రయత్నంగా ఆనంద్ కళ్ళు అశ్రువులతో నిండిపోయినై. "చెప్పవేం ఆనంద్?" అని స్వామీజీ రెట్టించి అడిగారు.

"ఏం చెప్పను స్వామీ? ఆమె నా కేమీ కాదు. నే నామె కేమీ కాను. ఇంతకుమించి నే నేమీ చెప్పలేను" అని ప్రక్కమీదినుంచి ప్రయత్నంమీద లేచి గురువుగారి కాళ్ళని తన వణికిపోతున్న చేతులతో చుట్టివేశాడు.

"వేళయింది. ఇక బయలుదేరు ఆనంద్" అని స్వామీజీ ఆనందును లేవనెత్తి కూచోబెట్టారు.

"శలవు స్వామీ. మళ్ళీ మీపాదాలదగ్గరికి తిరిగి రాగలనా? ఎందుకో భయంగా వుంది స్వామీ" అని ఆనంద్ దీనంగా అడిగాడు.

"నీ భయమే నీ శత్రువు ఆనంద్" అని స్వామిజీ స్నానానికి నదీతీరానికి గబగబా నడిచారు.

ॐ

ఆనందరావు ఆకస్మికంగా జబ్బుచేసి ఇంటికి వచ్చాడన్న వార్త విని సంధ్య నమ్మలేకపోయింది. కలలోకూడా అతను తిరిగివస్తాడనుకోలేదు. వచ్చాడని విన్నాక వెళ్ళిచూసివచ్చేదాకా మనసు నిలవటం లేదు. భర్తపోయాక తను లోకంముఖమే చూడలేదు. కాని తన చిన్ననాటి మిత్రుడు జబ్బుతో ఇంటికి తిరిగి వచ్చాడని విని ముందువెనకలు చూడకుండా బయలుదేరింది. అతను వచ్చాడనగానే ప్రాణంలేచివొచ్చింది. చిన్ననాటి స్మృతులన్నీ ఒక్కసారిగా కళ్ళముందు మెదిలినై. ఎన్నడూ లేని ఆనందంతో సంధ్య హృదయం చిందులు తొక్కుతోంది.

సంజచీకటి పడుతోంది. రమ నిద్రపోతోంది. సంధ్య బయలుదేరింది. ఎవరికీ చెప్పలేదు. ఎవరి అనుమతీ కోరలేదు. ఏదీ ఆలోచించలేదు.

ఆనందరావుని చూడడానికి సంధ్య స్వయంగా రావటం చూసి అతని తల్లి నిశ్చేష్టురాలైపోయింది. "రా తల్లీ, రా. నీకు మామీద దయతప్పలేదు" అంటూ ఆనందరావు మంచందగ్గర కుర్చీపీట వేసి కూచోమన్నది.

అంతవరకూ కళ్ళుమూసుకుని పడుకున్నాడు ఆనందరావు. కళ్ళుతెరిచి ఆశ్చర్యంతో "ఎవరదీ, ఎవరూ, సంధ్యా? నన్ను చూడటానికి వచ్చిందా? ఇక్కడే వుందా?" అంటూ లేచి కూచోబోయాడు.

"లేవకు ఆనంద్" అంటూ సంధ్య మంచం దగ్గర కూచుంది.

"నన్ను మరిచిపోలేదా సంధ్యా?"

"నువ్వే మమ్మల్నందరినీ మరిచిపోయావు. నువ్వే మా కందరికీ దూరమైపోయావు" అంటుంటే అతని తల్లి "నిజం చెప్పావమ్మా. వాడి కాషాయ గుడ్డలు చూస్తుంటే నాకడుపు చెరువైపోతోంది" అని కళ్ళు తుడుచుకుంది.

అడివిలాగా పెరిగి పోయిన గిరజాల జుట్టు ముఖమంతా కమ్మేసింది. పొదలాగా గడ్డం పెరిగి పోయింది. చీకటిపడగానే పొదల్లో మెరిసే మిణుగురు పురుగుల్లాగా అతని విశాలనయనాలు వెలుగుతున్నయ్. ముఖంలో కళ్లుమాత్రమే కనిపిస్తున్నయ్. ఈరూపాన్ని చూడగానే సంధ్యగుండె జలదరించింది.

సంజచీకటినీడలు గోడలమీద అలుము కుంటున్నయ్. ఆనీడలలో ఒక నీడలాగా మౌనంగా కూచుంది సంధ్య. ఇంతసేపూ ఆనంద రెప్పవాల్చ కుండా సంధ్యముఖంకేసి చూస్తున్నాడు. "ఇదేమిటి సంధ్యా? మరిచిపోయావా?" అని ఆత్రంగా అడిగాడు ఆనంద్. అతని కళ్లు సంధ్యవిశాలఫాల భాగాన తరుణారుణప్రభలతో వెలిగే సౌభాగ్యరేఖ కోసం వెతుకుతున్నయ్. ఇది గమనించి సంధ్య నీళ్లు నిండిన కళ్లతో, వొణికే కంఠంతో "లేదు ఆనంద్, దైవమే చెరిపివేసింది" అని ఆతనికి ముఖం చూపలేక తలవంచుకుని కళ్లు తుడుచుకుంది.

"ఎంత ఘోరవార్త సంధ్యా" అని ఆనందరావు పిడుగుదెబ్బతిన్నవాడిలాగా దిండుమీదికి ఒరిగి పోయాడు.

వారి మౌనం క్షణక్షణమూ విషాదంతో బరు వెక్కిపోతున్నది. ఇంతలో అతని తల్లి సంజెదీపం వెలిగించి గదిలో పెట్టి జావకాచి పట్టుకువస్తానని వెళ్లింది.

"నాకోసం విచారించకు ఆనంద్. నిన్ను చూస్తుంటే నాగుండె నీరవుతోంది" అంది సంధ్య.

"ఎంత క్రూరమైన విధి! సంధ్యా, మనం విధికి బానిసలం." అంటూ ఆనంద్ కిటికీలోంచి అలుము కుంటున్న చీకట్లోకి చూశాడు. అంతా కాటుక పులి మినట్లుంది.

"సంధ్యా!" అన్నాడు ఆనంద్ స్నేహ పూరితమైన కంఠంతో. ఎందుకో సంధ్య చేతులను తన చేతుల్లోకి తీసుకోవా లనిపించింది.

"ఆనంద్" అని బదులుపలికింది సంధ్య. తన చేతులతో అతని బాధితహృదయాన్ని నిమిరితే బాగుండుననిపించింది. కాని శతాబ్దాల సంస్కారం ఒక్కసారిగా ఆకోరికని కాలికింద తొక్కివేసింది.

"వెళ్లుస్తాను ఆనంద్. ఇంటిదగ్గర పిల్ల నిద్రలేచి ఏం గొడవపెడుతోందో" అని సంధ్య లేచి నిల బడింది.

"వెళ్తున్నావా సంధ్యా? ఈ బడబాగ్ని పర్వతాన్ని నీస్పర్శతో చల్లార్చి వెళ్లవూ?" అంటూ ఆమెచేతులని తన చేతుల్లోకి తీసుకుని గుండెలకి అదుముకోబోయాడు.

అతని చేతులని ఒక్కవిసురు విసిరి "నేను వెళ్లి పోవాలి ఆనంద్" అంటూ సంధ్య తూనీగలాగా బైటికివెళ్లిపోయింది.

ఆనంద్ సిగ్గుతో, దుఃఖంతో గజగజ వణికి పోయాడు. తను ఈలోకంలో ఎందుకు జన్మ ఎత్తానా అని ఎంతో నిందించుకున్నాడు.

అతని హృదయంలో కాటుక మబ్బులు దట్టంగా కమ్ముకుపోయినై. జావతెచ్చిన తల్లి "సంధ్య వెళ్లిపోయిందా నాయనా?" అని అడిగింది. ఆమాటకి బదులు చెప్పకుండా "అమ్మా, ఇవాళ ఇంత చీకటిగా వుందేం?" అని అడిగాడు.

౬

"కబురుచేశావా అమ్మా" అని అడిగాడు ఆనందరావు.

"నేనే వెళ్లి చెప్పివచ్చాను బాబూ."

"అయితే నాగడువు దగ్గరికి వచ్చిందని చెప్పావా? ఈరాత్రి గడవటమే కష్టం."

"ఛీ, అల్లా అనరాదు నాయనా."

"నీకు తెలియదమ్మా. నిజం."

కొంచెంసేపు మౌనంగా వుండి గోడవైపుకి తిరిగి తనలో తను "రాదు, ఎందుకు వస్తుంది? నేను తన కేమౌతాను? తను నాకేమౌతుంది? రాదు. క్షమించమని అడిగే అవకాశంకూడా లేదు." అని సంధించిన రోగిలాగా గొణుగుకుంటున్నాడు.

"నాయనా" అని పిలిచింది. చేత్తో కదిపింది. మారు పలుకలేదు. రాత్రి అంతా ఏదో మగతగా పడి వున్నాడు. తెల్లవారుఝామున బాగా తెలివచ్చింది. ఆరిపోయేముందు దీపం గప్పున వెలిగినట్లు అతని ముఖంలో చైతన్యం ధగధగ మెరిసింది. "రాలేదా అమ్మా?" అని అడిగాడు.

"లేదు నాయనా, మళ్లీ వెళ్లి పిలుచుకొస్తా" అంటుంటేనే అడుగుల అలికిడి వినబడింది.

కిటికీలోంచి అరుణరాగరంజితమైన ఆకాశం కరుణతో తొంగిచూస్తోంది.

వచ్చింది సంధ్య. కూడా మూడేళ్ల ముద్దుల మూట రమకూడా వచ్చింది.

"వచ్చావా సంధ్యా? నీ క్షమాభిక్ష లేకపోతే నా ప్రాణం పోయేట్లు లేదు" అని రెండుచేతులతో ముఖాన్ని కప్పుకున్నాడు. చెక్కిళ్లమీద కన్నీటిచారలు మెరిసినై.

"వచ్చాను ఆనంద్. నీమాటలు నాకు అర్థం కావటం లేదు" అని సంధ్య సంభ్రమంతో అన్నది.

"ఆయనెవరే అమ్మా?" అని తల్లికొంగు పుచ్చుకుని అడిగింది రమ.

"మామయ్యగారు. దండంపెట్టు" అనగానే రమ చిన్నచేతులు జోడించి "ఎప్పుడొచ్చారే మామయ్యగారు?" అని అడిగింది.

ఈమాటలు వింటున్నంతసేపూ ఆనంద నరకయాతన అనుభవించాడు. మిరుమిట్లుగొలిపే వెలుతురులో దిక్కుతెలియక రెక్కలుకొట్టుకుంటూ ఎగిరే గబ్బిలంలాగా అతని ప్రాణం తన్నుకుంది. ఎంతోసేపు మాటలకోసం పెనగులాడాడు. సంధ్యసన్నిధానంలో ఆ నిమిషంలో ఆశ్రమంలో అన్వేషించినా లభించని అనిర్వచనీయశాంతి వెల్లివిరిసింది. ఎండమావులవెంట పరిగెత్తి విసివిన బాటసారికి ఆకస్మికంగా సుందరసరోవరం ఎదురయినట్లనిపించింది.

"మాట్లాడవేం ఆనంద్?" అని వ్యాకులపాటుతో అడిగింది సంధ్య.

"సంధ్యా! నువ్వే నా గురువు. నీదగ్గరే దీక్ష సంపాదించాను" అంటూ కళ్లు మూసుకున్నాడు. ఆ క్షణంలోనే అతని జీవితంలోని తీరని అశాంతి మరణప్రశాంతిలో లీనమైపోయింది.

ఏదో అర్థంకాని నాటకాన్ని చూస్తున్న ప్రేక్షకులలాగా అతని తల్లీ, సంధ్యా అయోమయంలో నిలబడిపోయారు.

కిటికీలోంచి అరుణరేఖలు పరుగిడి వచ్చి ఆనంద కళేబరాన్ని ఆలింగనంచేసినై.

అప్రయత్నంగా సంధ్యకళ్లలోంచి రెండు అశ్రుబిందువులు జారి ఆనందరావుహృదయంమీద చిందినయ్.

"అమ్మా, మామయ్య మాట్లాడడేం?" అంది రమ.

"పద. ఇంటికి. వద్దంటుంటే వెంటబడి వచ్చావు" అంటూ సంధ్య ఆనందరావు శరీరాన్ని కడసారి కళ్లజూసి ఇంటిదారి పట్టింది.



# ఆంధ్రులు - సంగీతనాట్యాలు

శ్రీ వావిలాల సోమయాజులు

(గతసంచికతరువాయి)

కాకతి గణపతిదేవ చక్రవర్తి బావమరది జాయప సేనాపతి నృత్తరత్నావళికర్త. ఇతని నృత్తరత్నావళి మధ్యయుగంలో ఆంధ్రులు రచించిన నాట్యగ్రంథాలలో సుప్రసిద్ధమైనది. ఇది అముద్రితము. దీని ప్రతి ఒకటి తంజావూరు సరస్వతీమహల్ తాళపత్రగ్రంథాలయములో ఉన్నది. ఈ గ్రంథాన్నిబట్టి గణపతిదేవ చక్రవర్తి సంగీతనాట్యప్రియుడనీ, కౌమారంనుంచీ జాయన నాట్యశాస్త్రంలో విశేషకృషి చేసినవాడనీ, అతని ప్రతిభను గమనించి ప్రభువు నృత్తరత్నావళీ రచన చేయవలసిన దని శాసించినట్లు అందులోని—

"ప్రేక్ష్య ప్రజ్ఞా మతిశయవతీం
స్వామిభక్తించ హృద్యా
దాకౌమారా ద్గణపతినృపో
జాయనం యం సమర్థమ్
శుండామాత్యే సకలసుమన
స్సేవ్యమానో జయంతం
వాచాంపత్యై హరిరివ కలా
శ్లాఘనీయం వ్యనైషీత్.
జిత్వా శౌర్యేణ పృథ్వీం జలనిధిరశనాం
స్వస్థిరీకృత్య లోకం
సంగీత స్యోపభోగం సకుతుకమనసః
స్వామినః శాసనేన
తస్యాభీష్టస్య భాస్వన్మణినికరనిభం
నృత్తలీలాయితస్య
రాజ్ఞోఽసౌ శాస్త్ర మేత ద్రచయతి చతురం
నృత్తరత్నావళీతి"

అన్నవాక్యాలవల్ల తెలుస్తున్నది.

కాకతీయుల కాలంలో వీరశైవంతోపాటు ఆంధ్రదేశంలోని కొన్ని ప్రాంతాలలో కాలాముఖ పాశుపత శైవాలు కూడా విజృంభించినవి. పాశుపత గోళకీ మఠానికి గణపతిదేవచక్రవర్తికుమార్తె రుద్రాంబ గుంటూరుజిల్లా మల్కాపురంలో కొంత భూమిని దానంచేస్తే మఠాధిపతి విశ్వేశ్వర శివదేశికాచార్యులవారు దేవాలయం కట్టించి దాని అంగరంగ భోగలకు బాలుగా ఇద్దరు నర్తకలను, అయిదుగురు ఆవజకాండ్రను, తగిన వాద్యసంపత్తిని ఏర్పరచినట్లు తెలుస్తున్నది (J. A. H. R. S. Vol. IV-Pts. 8 & 4). వీరి కాలంలో దేవాలయాలకు సంబంధించిన గాంధర్వ విద్యాప్రవీణుల జీవితాలు నాటకాలుగా కట్టి ఆడతగినట్లుగా ఉండేవట. క్రీడాభిరామంలో ఒక వారాంగనప్రశంస మాటలమధ్య వచ్చినప్పుడు మంచన శర్మ టిట్టిభసెట్టితో 'తెన్నగాక, కిరాట! ఈ లేమచరిత మాడుదురు నాటకంబుగ నవనిలోన' అని చెప్పినాడు.

కాకతీయుల పతనానంతరం క్రీ. శ. ౧౪-వ శతాబ్దిమధ్యభాగంలో బృహదాంధ్రదేశం (౧) కొరుకొండ, (౨) రాచకొండ, (౩) పిఠాపురము (౪) కొండవీడు, (౫) విజయనగరము అనే ఐదు రాజ్యాలుగా ఏర్పడిపోయింది. కళాపోషణవిషయంలో వీరందరూ కాకతీయుల అడుగుజాడలనే అనుసరించారు.

కొండవీటి రాజ్యస్థాపనాచార్యుడు ప్రోలయ వేమారెడ్డి; ఎఱ్ఱాప్రగడ రామాయణ హరివంశాలకు కృతిభర్త. ఎఱ్ఱాప్రగడ హరివంశంలో కృష్ణుని జలక్రీడలను వర్ణించే సందర్భంలో 'లలితగగనరంగంబున

నాయక క్రొమ్మెరుగుంగు గొండ్లిమై యాడెడుచో నలవడియె మొగిలు తెరలున, బొలపగు వహిగండ్లగములు పుష్పాంజలులుగ్' అని నాట్యపూర్వరంగాన్ని ఉద్ఘాటించాడు. ప్రోలయ వేమారెడ్డికుమారుడు అనవేమారెడ్డి కంచి, దన్ని, పాన్ని అనే ముగ్గురు నాట్యశాస్త్రజ్ఞుల పోషించినట్లు తెలుస్తున్నది. కొండవీటి రెడ్డిరాజులలో ఒకడైన కుమారగిరిరెడ్డి వసంతరాజీయమనే నాట్యశాస్త్రాన్ని ఒకదానిని వ్రాసి దానిని శిష్య అయిన లకుమాదేవిమూలాన ప్రచారం చేయించినట్లు—

"జయతి మహిమా లోకాతీతః కుమారగిరిప్రభో
స్సదసి లకుమాదేవీ యస్య ప్రియాసదృశీ ప్రియా
నవ మభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూ నర్థా నర్థివ్రజాయ సహస్రశః"

—అన్న శ్లోకంవల్ల వ్యక్తమౌతున్నది. కుమారగిరి రెడ్డికి వసంతరాజు బిరుదనామము, అతని వసంతోత్సవప్రియత్వంవల్ల కలిగింది. ఇతని బావమరది కాటయవేమన శాకుంతల వ్యాఖ్యలో కుమారగిరి నాట్యశాస్త్రాన్ని గురించి 'మునీనాం భరతాదీనాం చ భూభుజాం, శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినాం, ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా, నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్' అని వ్రాసి ఉన్నాడు. కుమారగిరితరువాత కొండవీటిని పాలించిన పెదకోమటి దత్తిలమతాన్ని ఆధారం చేసికొని ఒక నాట్యశాస్త్రాన్ని వ్రాసినట్లు తెలుస్తున్నది. కొండవీటిరెడ్డిరాజ్యం అంతరించిన తరువాత శ్రీనాథమహాకవి రాజమహేంద్రవరం రెడ్లను ఆశ్రయించాడు. ఈ మహాకవిగ్రంథాలలో అనేక సందర్భాలలో సంగీతనాట్యప్రశంసలు కనిపిస్తున్నవి. 'వల్లకి చక్కి కాహళము వంశము ఢక్క హుడుక్క ఝుర్ఝురుల్, ఝల్లరి యాదిగా గలుగు శబ్దపరంపర తాళశబ్దమై, యుల్లసిలం బ్రబంధముల యొప్పుగ నాడుదు రగ్రవేదిపై, బల్లవపాణు లీశ్వరుని పంటమహీశులు పూజసేయగన్; హిందోళంబున బాడి రచ్చరలు భీమేశున్ ... త్రిలోకాధిపున్ — భీమఖండము; పాడి రంగవల్ దేశి విధంబు మార్గమున లేటయు నొక్కట సాధింపగన్ — నైషధము; బెండపూడి యన్నయామాత్యుండు కట్టించిన మొగసాలవాకిటి మహోత్సవమంటపమునందు, పేరోలగంబుండి '...కుండలీ, దండలాసక, ప్రేరణ, సింధు, కందుక, భమాలీ, చేలమతల్లికా, హల్లీసకాది నృత్యంబుల నవలోకింపుచు, మేలంబు లాలకించుచు, జంపుచాటునాటకోదాహరణజయఘోషచక్రవాళ చతుర్భద్ర చతురాతి ప్రబంధంబు లాకర్ణించుచు' మొదలైన సంగీతనాట్య సంబంధములైన రచనలు శ్రీనాథమహాకవిగ్రంథాలలో విశేషంగా కనిపిస్తున్నవి.

కోరుకొండరాజుల్లో ముమ్మడి నాయకుని తమ్ముడు సింగమనాయకుడు గొప్ప సంగీతకళాభిమానిగా కనిపిస్తున్నాడు. ఒకానొక శాసనంలో ఇతన్ని గురించి—

'వీణావాదనకోవిదేన విలసల్లాస్యప్రవేశస్యశ్రీయా
సారస్యాస్పదగానమానవిధినా సౌజన్యమానాత్మనా
నిత్యైశ్వర్యవిలాసినా నిరుపమాకారేణ కాంతాజనే
నాయం కూనయభూమిసింగతిలకః క్రీడన్ సదా మోదతే.'

అని ఉన్నది.

కొండవీటి పెదకోమటి వేమారెడ్డితోనూ, విజయనగరరాజన్యుడు ప్రౌఢదేవరాయలతోనూ కీర్తిస్పర్థ వహించి కవితాపోషణం చేసిన రాచకొండ రాజు సర్వజ్ఞసింగభూపతి సంగీతనాట్యాలకు దోహదమిచ్చినట్లు కనుపించదు. కానీ ఓరుగంటినివాసి బమ్మెర పోతనామాత్యుడు భాగవతంలో 'వినుము దేహధారి స్వతంత్రుడు కాడు, జంత్రకాని చేతి జంత్రపు బొమ్మకైవడి నీశ్వరతంత్రపరాధీనుండై దుఃఖంబులందు నర్తనంబు సలుపు' (దశమస్కంధము ఆ ౧.) అని బొమ్మలాటప్రశంస చేసినాడు.

ఇక విజయనగర రాజన్యుల సంగీతనాట్యపోషణమును గురించి ఆలోచింపవలసి ఉన్నది. హరిహర బుక్కరాయలుల మహామంత్రి విద్యారణ్యులవారు సంగీతసార మనే ఒక శాస్త్రగ్రంథాన్ని వ్రాసినారట అందులో ౨౬౭ రాగాలు ప్రత్యేకంగా వారు

సూచించినట్లు ఇతరగ్రంథాలనుబట్టి తెలుస్తున్నది. బుక్కరాయలవల్ల పెంమకలదిన్నె గ్రామాన్ని అగ్రహారంగా స్వీకరించిన నాచన సోమనాథకవిశేఖరుడు ఉత్తరహరివంశంలోనూ, వసంతవిలాసంలోనూ కొన్ని సంగీతనాట్యప్రశంసలు చేసినాడు. 'కమలనాభకటాక్ష కటకాముఖ పాణి నఖోపకారివిభ్రమమణిపుంఖ రింఖదశ్రోమరుచుల్ — ఉత్తరహరివంశము ఆ ౧. పద్యం ౧౫౯; వేదమైన విన బ్రాహ్మణుకోట, జాణాలు మెత్తురు జాజరపాట' — ఉ. హరి. పీఠిక;

'వడకు పన్నగరాజు పడగలమీద స
ర్వంసహాకాంత వేడుకను సూప,
నక్రూతలూగడు నదయూ స్తగిరులతో
నాకౌశలక్ష్మి కోలాటమాడ,
తెరలెత్తి సప్తసాగరములు పొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప,
మొకములచాయ వేరొక చందముగ నిల్పి
కమలసంభవుడు ప్రేంఖణ మొనర్ప
... ... ... ... ...
శౌరి ప్రూరింప నప్పాంచజన్యరవము.'
— ఉత్తర హరి. ఆ. ౪-౨౧౫.

ఇందుకు కొన్ని ఉదాహరణాలు. వసంత విలాసంలో నాచన సోమనాథుడు పేర్కొన్న జాజర పాటను తరువాత ఎంతో కాలానికి దామర్ల వెంగళ భూపాలుడు బహుళాశ్వచరిత్రలో చెప్పినాడు.

శ్రీనాథ మహాకవిని 'దీనారటంకాల తీర్థమాడించిన' విజయనగరచక్రవర్తి ప్రౌఢదేవరాయలు సారంగదేవుని సంగీతరత్నాకరానికి వ్యాఖ్య వ్రాసిన కల్లినాథుణ్ణి పోషించాడు (J. A. H. R.S. Pts. 2, 3, 4 —Page 204). సాళువ నరసరాయలకాలంలోనే మొట్టమొదటి యక్షగానం కనిపిస్తున్నది. అది ప్రస్తుతం ఉపలబ్ధం కాదు. కర్త చెన్నశౌరి. హరిభట్టు నారసింహపురాణంలో 'సౌరభిచరితంబు జక్కులకథ చెప్పె లాలితనవరసాలంకృతముగ' అని తన పూర్వజుడు చెన్నశౌరిని కీర్తించాడు. విజయనగరసామ్రాజ్యాన్ని కృష్ణరాయలు పాలిస్తూ దక్షిణాపథాన్నంతటినీ ఏకచ్ఛత్రాధిపత్యంక్రిందకు తెచ్చిన తరువాత సమస్తకళాపోషణం విశేషంగా జరిగింది. సంగీత నాట్య సాహిత్య శిల్పాలు అన్యోన్యాశ్రయాలై ఇతని కాలంలో విలసిల్లినవి. చివరకు దుఃఖాన్నికూడా సంగీతదృష్ట్యా కవులు అవలోకించారు. శిల్పంలో 'సరిగమపధనిస స్వరకల్లకీముల్యారవ వికోశాస్తంభ రాగశ్రేణితి' గమనింపదగినది. ప్రబంధనాయికలందరినీ 'వీణాప్రియ'లనుగా తీర్చిదిద్దిన కవులు కథానాయికల చేత ఏదో ఒక వీణను పట్టించారు. 'తరుణాంగుళిచ్ఛాయ దంతపు సరకట్ల నింగిలికపు వింతరంగు లీన' అన్నచోట 'సర' అనే ఒకానొక వీణను వరూథిని చేత పట్టించాడు పెద్దనామాత్యుడు. 'కిన్నర' వీణకూడా ఆదినాలల్లో ప్రచారంలో ఉన్నట్లు కవితా స్వరూపనిరూపణంచేసే సందర్భంలో 'కిన్నరమెట్ల బంతి సంగాతపు సన్నతంతు' అన్నచోట ఆయన చెప్పినాడు. నయగారపు కన్నడి, గౌళపంతు ఇత్యాది రాగాలు ఆనాడు ప్రసిద్ధి వహించినట్లు తెలుస్తున్నది. రాయలనాటికి వీణమెట్లు ప్రస్తుతకాలంలోవలె నిబద్ధాలై ఉన్నట్లు కనుపించదు. అవి వాతావరణాన్ని బట్టి, పాటకుని గొంతునుబట్టి, రాగాన్ని అనుసరించి మార్చేవారు. మనుచరిత్రలో వరూథిని విరహావస్థలో ఉన్నప్పుడు చెలికత్తె పలికిన 'వాలారుం గొనగోళ్ల నీ వలసతేఁ నాయించుచో నాటకుఁ, వేశంబై విపంచి నిన్న మొదలుఁ నీకంటమిం జేసి యా, గూలా పంబె యవేళపల్కెడు ప్రభాతాయాతవాతాహతిఁ, లోలత్తంత్రుల మేళవింపగదవే లోలాక్షి దేశాక్షికిఁ' అన్న వాక్యాలవల్ల తెలుస్తున్నది. ఆనాటి జనసామాన్యరసికలోకానికి ఈ రాగవిభేదాలు తప్పకుండా తెలిసిఉంటవని మనం నిశ్చయించవచ్చును. రాధామాధవకవి ఈ విషయాన్నే 'కొలదిగ రాగభేదములకుఁ దగు సారెలు సారెకొత్తి తంత్రులు కొనగోళ్ల మీటుచు జనంగవ దండె యమర్చి కృష్ణ లీలలు ప్రకటించి పంచమకలస్రుతి మాకు లివర్ప రాధకుఁ వలపులు చిల్కగఁ మధురవాణి ప్రవీణత బాడె వీణతోఁ' అని పలికినాడు. వీణావాదనమూ, అభ్యసనమూ సర్వసామాన్యంగా ఆనాడున్నట్లు గోచరిస్తుంది. లేకపోతే రాయలు ఆముక్తమాల్యదలో—

"చేవిన మేడపై వలభి
వేణిక జంట వహించి విప్పగా
బూవులు గోట మీటు తరి
పోయెడు తేటుల మ్రోత లేమి శం
కావహమౌ గృతాభ్యసన
లాటను దంతపు మెట్లవెంబడిన్
జేవడి వీణ మీటుటలు
చిక్కడ లించుటలున్ సరింబడన్"
(ఆ ౧. ప. ౬౨.)

అన్న పద్యంలోని భావాభినివేశానికి వీ లుం టుందా? రాయలపాలనాకాలంలో 'నాట్యకళ' అత్యుత్తమస్థితి పొందిన దని చెప్పటానికి రామాలయ శిల్పాలు నిదర్శనాలు. మనుచరిత్రలో ఒకచోట పలికిన—

'చిలుకల కొల్కి కల్కియొక
చేడియ నాటకశాలమేడపై,
నిలువున నాడుచుండి, ధర
ణీపతి చూడదలంచి యంచునన్
నిలచి రహిం గనుంగొనుచు
నెయ్యమునన్ దనువల్లి యుబ్బి కం
చెల తెగబడ్డ కేతనము
చీర చెరంగున మూసెc జన్నులన్'

అన్న పద్యంవల్ల ప్రత్యేకంగా ఆనాడు ఆంధ్ర దేశంలో నర్తనశాల లున్నట్లు వ్యక్తమౌతున్నది. ఇక్కడ 'కంచెల' శబ్దానికి నాట్యం చేసేటప్పుడు బిగుతు కోసం తొడుగుకునే చనుకట్టు అని బ్రౌను అర్థము చెప్పినాడు. రాయలు ప్రజావినోదార్థము తోలుబొమ్మలాటగాండ్రను రావించి వారిమీద కాళనమంత్రిని అధికారినిగా నియమించి గ్రామసీమల్లో వారిచేత ప్రదర్శనాలు వేయించేవాడట. ఇతనికాలంలోనే మొట్టమొదట'కొరవంజి'కి ఆదరం లభించినట్లు అయ్యలరాజురామభద్రుని 'జక్కిణి, కొరవంజి వేషముల కేళిక సల్పిరి దేవతానటీమణులకు బొమ్మవెట్టు క్రియ' అనే ప్రయోగంవల్ల వ్యక్తమౌతున్నది. పదకవితాపితామహుడు తాళ్లపాక పెదతిరుమలార్యుడు రాయలకు సమకాలికుడు. పదకవితకు ప్రాపకం లభించింది. కవితాపితామహుడు పెద్దన్న 'మధురకిన్నరీనిక్వాణంబుల రాణం ద్రాణచెరచు లక్ష్మీనారాయణుల కల్యాణంబు పాటలం దీటుకొను తిన్ననిరవంబు' అని వాటికి స్థాన మిచ్చాడు.

రాయల ప్రాపకం క్రింద కొన్ని సంగీతలక్షణ గ్రంథాలు జన్మించినవి. వాటిలో లక్ష్మణభట్టు 'సంగీత సూర్యోదయము' ప్రసిద్ధమైనది. లక్ష్మణభట్టు కర్ణాట సంగీతాన్ని జన్యజనకరాగవిభాగం చేసి నిరూపించటానికి ప్రారంభించిన వారిలో మొదటివా డని చెప్పవచ్చును. 'కామదేవవిలాస' మనే సంగీతనాట్యశాస్త్రగ్రంథ మొకటి ఈ కాలంలో జన్మించినట్లు తెలుస్తున్నది. అళియరామరాజు సంగీతకళాభిమాని. బయకారం రామయామాత్యుని 'స్వరమేళాకళానిధి' ఆయనకాలంలో జన్మించిన అత్యుత్తమసంగీతశాస్త్రగ్రంథము.

తల్లికోటయుద్ధానంతరము విజయనగర సామ్రాజ్యలక్ష్మి పెనుగొండ, చంద్రగిరులకు చేరింది. కానీ ప్రభువుల కళాభిమానం వారిని పరిత్యజించలేదు. పెనుగొండ రాజులలో తిరుమలరాయలు భట్టుమూర్తికి ఆశ్రయుడు. కృత్యాదిలో భట్టుమూర్తి 'సంగీతకళారహస్యనిధి' నని చెప్పుకున్నాడు. ఆయన 'లలనాజనాపాంగ' వంటి ఛందోబద్ధలయప్రధానాలయిన పద్యాలనే కాకుండా, వచనాలను కూడా శిష్టు కృష్ణమూర్తిశాస్త్రులవారివంటి ప్రసిద్ధవిద్వాంసులు వీణ మీద పలికించినట్లు వినికిడి. వసుచరిత్రలో ఒకచోట 'హారముల్ కులుచలు త్రొక్క' అనే ప్రయోగము కనిపిస్తున్నది. దీనికి శబ్దరత్నాకరకారులు ఒక నాట్యవిశేష మని వ్రాసి ఉన్నారు. ఈ ప్రాంతములో గోదావరీప్రాంతనివాసి సోమనాథ పండితుడు ఒక సంగీతశాస్త్రాన్ని రచించినట్లును, అది తరువాత ఖిలమై పోయినట్లును సంగీతసారామృతాదిశాస్త్రగ్రంథాలవల్ల తెలుస్తున్నది. ఇతడు స్వరాలు ౧౫ మేళకర్తలుగ నిశ్చయించినాడట. తిరుమల రాయలు గీతగోవిందంమీద ఒక వ్యాఖ్యానాన్ని అంకితం పుచ్చుకున్నాడు.

విజయనగరపతనానంతరం ఆంధ్రకళాకోవిదులూ, శాస్త్రజ్ఞులూ దక్షిణదేశానికి వలసవెళ్ళినారు. అక్కడ తంజాపురము రఘునాథరాయలు విశేషంగా కళాపోషణం చేశాడు. ఆయన కవి, గాయకుడు, శాస్త్రజ్ఞుడు. ఇతడు సంగీతనాట్యాల రెంటియెడా అభిమానం వహించి సంగీతసుధ, భరతసుధ అనే రెండు ఉత్తమశాస్త్రగ్రంథాలను రచించినట్లు తెలుస్తున్నది. సంగీతసుధ మొదట రఘునాథరాయలు ౭ అధ్యాయాల గ్రంథంగా వ్రాసినాడట. నేడు ౪ అధ్యాయాలు మాత్రమే కనిపిస్తున్నవి. ఈ గ్రంథంలో రాయలు ౫౦ రాగాలను ౧౫ మేళకర్తలుగ విభజించినాడు. ప్రాచీనశాస్త్రగ్రంథాలలో రాగాలకు అంస, న్యాస, గ్రహాలు మాత్రమే కనిపిస్తవి. ఇతడు శ్రుతి, స్వర, అలప్తికలనుగూడా చేర్చినాడు. ఈ మహాగ్రంథానికి రఘునాథరాయల గురువు గోవిందదీక్షితులు వ్యాఖ్యానం వ్రాసినాడు. రఘునాథరాయలు వీణావాదనలో దిట్ట అని దీక్షితులు "జయంతసేనాదిమరాగ రామానందాదితాళాన్ రచయన్ నవీనాన్, సంగీతవిద్వాంస ముపాదిశ త్స్వమ్ విపంచికావాద విచక్షణానామ్" (J. O. R. Vol. III—౧౫౪) ఈ రీతిగా పలికినాడు. రాయలు వీణలలో నాలుగు రకాలను సూచించి వాటి అమరికను గురించి కొంత చర్చించినాడు. అతని పేరుమీద రఘునాథ మేళ నొకదానిని సృజించాడు. అతని ఆస్థానంలో సంగీతశాస్త్రనిధులు — స్త్రీపురుషులు— అనేకులు ఉన్నట్లు 'వాగ్గేయకారప్రముఖై రనేకై ర్విచిత్ర గీతాదికళాప్రవీణైః, తథైవ వీణాదిమవాదవిద్యా విచక్షణైః క్వాపినిషేవ్యమాణః' అనే ప్రమాణంవల్ల తెలుస్తున్నది. ఇతని కొలువులోఉండే అనేక నాట్యకత్తెల విలాసవిభ్రమాలనే 'శృంగారసావిత్రి'లో అశ్వపతితపోభంగం చేయటానికి వచ్చిన అప్సరసలకు నిరూపించి చూపించాడు. వెంకటమఖి రఘునాథరాయల ఆస్థానసంగీతవిద్వాంసులలో ప్రముఖుడు. 'చతుర్దండిప్రకాశిక' అనే సంగీతశాస్త్రగ్రంథనిర్మాత. ఇది వీణ, శ్రుతి, స్వరము, మేళము, రాగము, ఆలాపనము, తాయ, గీతప్రబంధాలు అనే ౧౦ అధ్యాయాల గ్రంథము. రఘునాథుని వీణమెట్ల పద్ధతిని అనుసరించక సప్తస్వరాలకూ సర్వకాలసర్వావస్థల్లో ఒదిగేటట్లు మెట్లను సరస్వతీవీణకే ఏర్పాటుచేసి ౭౨ మేళకర్తలను నిరూపించిన మహానుభావుడు వెంకటమఖి. ఇతడు జయదేవుని గీతగోవిందమార్గాన్ని అనుసరించి త్యాగరాజస్వామిమీద ౨౪ అష్టపదులు చెప్పినాడట. (భారతీయసంగీతము—వీణ సుబ్రహ్మణ్యశాస్త్రి పే.౬)

కృష్ణరాయల కాలంలో అల్పప్రచారాన్ని పొందిన యక్షగానాలు రఘునాథరాయలు, అతని కుమారుడు విజయరాఘవరాయల కాలంలో విశేషవ్యాప్తిని పొందినవి. తంజావూరు కోటలో ప్రత్యేకంగా నాటకశాలలు కట్టించినట్లు ఆయన అంకితం పుచ్చుకున్న విజయవిలాసంలోని 'మాటలనేర్పులా, సరసమార్గములా......నాటకశాలలా... కీర్తిలోలుడు ఘుమా రఘునాథనృపాలు డిమ్మహిన్' అన్న పద్యంవల్ల వ్యక్తమౌతున్నది. రఘునాథరాజు స్వయంగా 'అచ్యుతేంద్రాభ్యుదయ మన్' యక్షగానం వ్రాయటమే కాకుండా, ఎలకూచి బాలసరస్వతివంటి విద్వాంసులదృష్టిని వాటిమీదికి ప్రసరింపజేశాడు. బాలసరస్వతి 'కళ్యాణకౌముదీకందర్ప నాటకం' వ్రాసినాడు. రాయలకుమారుడు విజయరాఘవరాయలు కళాపోషణకోసమే రాజ్యాన్ని పాలిస్తున్నట్లు శారదాధ్వజాన్ని ప్రతిష్ఠించాడు. ౫౦ యక్షగానాలు వ్రాసి ఆడించాడు. ఇతని కాలంలో తంజావూరు నాటకశాలల్లో నటించిన యక్షగానాలు 300 కు పైగా ఉన్నవట. నాటకాలు ఆడేటప్పుడు రంగులు వేసుకొని పాత్రోచితవేషధారణలతో ప్రజలను రంజింపజేసేవారట. స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించినట్లు తెలుస్తున్నది. ప్రత్యేకమైన నాట్యప్రదర్శనాలుకూడా విజయరాఘవుని కాలంలో కొలువులో జరిగేవి. అతడు అంకితం పొందిన రాజశేఖరవిలాసంలో చుండి కాళయ అతని సభలో ఖ్యాతిపొందిన నర్తకీమణుల ప్రత్యేకతలను గురించి—

"చాపదంబులు సీత రూపవతీకాంత
శబ్దచూడామణి చంపకాఖ్య,

చెలువగు జక్కిణి చెలువ మూర్తి వధూటి,
కొదమ కోమలవల్లి గురునితంబ,
నవపదంబులు లోకనాయికా లోలాక్షి
మలపేశి శశిరేఖ కొమ్మనయన,
తురుపదంబులు రత్నగిరి నితంబినియును
పేరణివిధము భాగీరథియును,
మదనపదమ్మాత నవరత్నమాలికాది
బహువిధాలక్యనాట్యప్రపంచమెల్ల
ఘనత కెక్కిన తక్కిన కాంతలెల్ల
నభినయించిరి తను నేర్పు లతిశయిల్ల"

అని వ్రాసియున్నాడు. పదకవితాచక్రవర్తి క్షేత్రయ్య విజయరాఘవుని రాజ్యకాలంలోనే దక్షిణ యాత్రజేసి ౪౦౦౦పైగా (మేరునిఘంటువు లెక్క ప్రకారము) మధురభక్తిపరిపూరితాలైన పదాలను గానం చేశాడు. గేయకవితాప్రపంచంలో పాత్రనై విధ్యానికీ, పరిస్ఫుట రూపచిత్రణానికీ, భావవ్యక్తీకరణానికి క్షేత్రయ్యకు సాటి నిలువగలవాడు లేడు. ఇతని పదాలలో మొగబొమ్మలు నూటికి నూరు కంటికింపుగా కనబడరు. వారి నాడించు సూత్రధారిణులు స్త్రీలు. స్త్రీస్వభావము నందలి వైవిధ్యమును, అందచందాలనూ, ఇంత సుకుమారంగా, గంభీరంగా త్రచ్చిచూచినవాడు లేడు. 'మగువ ఏకాంతమందిరము వెడలెనో' అన్న వనితాదివ్య సౌందర్యనిరూపణంమొదలు ఆహిరిచాపుతాళంలో వ్రాసిన 'పచ్చి బాలిదానరా, పాపడు పదినెలలవాడు వచ్చి కూడుటకు వేళ గాదు' అన్నంతవరకూ ఆయన లేఖినికి విహారభూమి. మధుర చొక్కనాథుడూ, తొండైమాను రఘునాథరాజా విజయరాఘవునితో కీర్తిస్పర్ధ వహించి సంగీతనాట్యాలను పోషించారు. చొక్కనాథుని ఆస్థానకవి తిరుమలుడు 'చిత్రకూటాచల మాహాత్మ్య' యక్షగానాన్నీ, మైసూరు సంస్థానాధిపతి చిక్కదేవరాయనిమీద ఒకకవి 'చిక్కదేవరాయవిలాస' మనే గేయప్రబంధాన్నీ వ్రాసినట్లు తెలుస్తున్నది. (తంజావూరు తాళపత్రగ్రంథాలి నెం. ౫౨౦; **Madras Oriental Manuscripts-Catalogue iii**)

క్రీ. శ. ౧౬౭౬ తరువాత తంజావూరును పాలించిన మహారాష్ట్రనాయకులు ఆంధ్రనాయకుల అడుగుజాడల్లో నడిచి యక్షగానరచన చేశారు; గేయకవితను పోషించారు. వారిలో 'షాజీ' ప్రముఖుడు. ఆస్థానకవులలో 'గిరిరాజకవి' ముఖ్యుడు. తంజావూరు మహారాష్ట్రులలో ప్రతాపసింహునికాలంలో ముద్దుపళని సంగీతసాహిత్యనిధి తాతాచార్యశిష్య. ఆమె గోదాదేవి వ్రాసిన తిరుప్పావును ౧౦సప్తపదులుగా తెలుగులోకి పరివర్తనచేసింది. క్రీ. శ. ౧౭౬౩-౧౮౩౨ లలో తంజావూరును పాలించిన శరభోజికాలంలో త్యాగబ్రహ్మ జన్మించి 'నాదధేనువును పిండి నవనీత' మొలికించాడు. తెలుగుభాషను దాక్షిణాత్యసంగీత ప్రపంచానికి ఏకైకభాషగా తీర్చిదిద్దిన మహానుభావుడు త్యాగరాజస్వామి. కర్ణాటకసంగీతప్రపంచంలో 'రత్నత్రయ'మని ప్రసిద్ధివహించిన ముగ్గురిలో త్యాగయ్య, శ్యామశాస్త్రి లిద్దరూ ఆంధ్రులే. శ్యామశాస్త్రి కుమారుడు సుబ్బరామదీక్షితులు, శిష్యులు పట్నం సుబ్రహ్మణ్యం, ముత్తుస్వామిదీక్షితులు, చిన్నస్వామి దీక్షితులు మొదలైన విద్వాంసులు నేటి ఆంధ్రులు. ఈ సందర్భంలో సావేరిరాగాన్ని ౮ గంటలు ఆలాపనచేసిన పల్లవి శేషయ్యను పేర్కొనట సమంజసము.

కృష్ణరాయలకాలంలో నామమాత్రంగా వినబడుతున్న కొరవంజికి విశేషగౌరవ మిచ్చి మహారాష్ట్రులు ప్రచారంచేశారు. జనసామాన్యానికి ఆధ్యాత్మికవిద్య 'జీవనాటకము'వంటి యక్షగానాలద్వారా నేర్పటానికి యత్నించినట్లు వ్యక్తమగుచున్నది. ఈకాలంలో పుట్టిన 'త్యాగరాజవినోదచిత్రప్రబంధనాటకము' అతిచిత్రమైనది. పాత్రోచితమైన భాష విచిత్రంగా సంస్కృతము, అరవము, మహారాష్ట్రము, తెలుగు, కన్నడములలో ఉండేదట. స్వరసాహిత్యాలు, జతులు, కీర్తనలు, జావళీలు, యక్షగానాలూ ఈకాలంలో లెక్కకు మిక్కిలిగా పుట్టినవి.

విజయనగరపతనానంతరం దక్షిణదేశానికి వలసపోని కవులనూ, గాయకులనూ, నటకులనూ, వెంకటగిరి, విజయనగరము, పిఠాపురము మొదలైన సంస్థానాధిపతులు పోషించారు. కూచిపూడివారు భరతశాస్త్రానికి పెట్టినది పేరై నేటివరకూ మధ్యాం

ధ్రంలో ఖ్యాతిగడించారు. వేములపల్లె, ధర్మవరంవారు ఒక్కొక్క ప్రత్యేకతలలో యక్షగానరచన చేశారు.

కంకంటి పాపరాజువంటి విద్వత్కవులు కాల ప్రభావాన్ని అనుసరించి ఉత్తర దేశంలో 'విష్ణుమాయా విలాసాది' యక్షగానరచనకు పూనుకున్నారు. పాపరాజుకు నాట్యమంటే అభిలాష. ఉత్తర రామాయణంలో జక్కిణి, పేరణి మొదలైన నాట్య విన్యాసాలను ఉటంకించాడు. ఇతర ప్రబంధాలలో గోచరించని హల్లీసకాన్ని—

"అన్యోన్యదండాగ్రవృత్తి లెసగ నొం
డొరుల సాముఖ్యముఖ్యత్వ నొందియుండి,
యూపలాపల వచ్చి యితరేతరము దొత్త
నిలచిన నెలవుల నిల్చినిల్చి,
కంకణమంజీర కాంచికల్ మ్రోయ వ
య్యాసవత్యస్ఫూర్తి చూపిచూపి,
తాళవాద్యరవానుకూలంబుగా మంద
ద్రుత మృదు గతులను తిరిగితిరిగి,
యనుపమరసోదయంబున నర్తనవాలి
చిత్రవర్తనభంగుల వెలగి వెలగి
విడిపడిన మనస్కోన్మదద్విరదముల వ
సఖులు హల్లీసకము సల్ప సంతసిల్లి"

అని వివరించాడు. తరువాతి కాలంలో ఆంధ్రులలో గాంధర్వ విద్య క్రమక్రమంగా సన్నగిల్లిపోవటం ప్రారంభించింది. ఒకనాడు యావద్భారతంలో ఖ్యాతిగాంచిన ఆంధ్రుల సంగీతనాట్య కళాభినివేశం మళ్లా ప్రాచీనౌన్నత్యంతో నూతన తేజస్సు ఏనాడు వహిస్తుందో!



# వేములవాడ చాళుక్యులు

(గతసంచిక తరువాయి)

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## ౯

### వాగరాజు, భద్రదేవుడు, ముమ్మడియరికేసరి

ఇమ్మడి యరికేసరి యనంతరము మఱి రెండు తరముల చాళుక్యరాజులు వేములవాడయందు రాజ్యమొనర్చినట్లు తెలియనచ్చుచున్నది. ఇతని జ్యేష్ఠపుత్రుడైన వాగరాజితని మరణానంతరము రాజ్యమునకు వచ్చి క్రీ. శ. ౯౫౦ వ సంవత్సరప్రాంతమున పాలించుచుండెను. ఇతడు రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపాలుని కాశ్రితుడు. ఇతని యాస్థానమున సోమదేవసూరి యను జైనపండితు డుండెను. సోమదేవసూరి గొప్ప విద్వాంసుడు. జినధర్మప్రసక్తుడు1. వాగరాజునకు భద్రదేవుడను తమ్ముడొకడుండెను. ఇతడిమ్మడి యరికేసరికి రాష్ట్రకూటకులజాతయైన లోకాంబిక యందు జననమందెను. భద్రదేవుడు రాజ్యము జేసినట్లగపడదు. ఇతని కుమారుడు ముమ్మడి యరికేసరి. వాగరాజునకు బిడ్డలు లేకపోవుటచేతనో, మఱి యే కారణముచేతనో యతని తరువాత నతని తమ్ముని కుమారుడైన ముమ్మడి యరికేసరి గద్దెనెక్కెను. ఇతడును దన పెదతండ్రివలె రాష్ట్రకూట ముమ్మడి కృష్ణభూపాలుని కాశ్రితుడు; క్రీ. శ. ౯౬౬ వ సంవత్సరమున నితడు లేంబులవాటక (వేములవాడ) నామధేయ నిజరాజధానియందు రాజ్యముసేయుచుండెను. ముమ్మడి యరికేసరి 'పామ్బరాంకుశామ్మనగంధవారణ గద్ధనైథ విద్యాధర ప్రియగల్ల త్రిభువనమల్లోదాత్తనారాయణ ప్రత్యక్షవాద్వలి విక్రమార్జున గుణనిధి గుణార్ణవ సామన్తచూడామణ్యాది పెక్కు బిరుదములు గలవాడు2. ఈ బిరుదులన్నియు నితనికి కులక్రమాగతముగ వచ్చినవి. ఇమ్మడి యరికేసరికి గూడ నీ బిరుదు లుండినట్లు, 'పాంబరాంకుశ నమ్మన గంధవారణం గద్ధనైథ విద్యాధర నారూఢసర్వజ్ఞ నుదాత్తనారాయణం నొడ్డుత్తిగల్లోం గుణనిధి గుణార్ణవం శరణాగతవజ్రపంజరం ప్రియగళ్ళం త్రిభువనమల్ల సామన్తచూడామణి' యను వేములవాడ శిలాశాసనములోని యంకనాలికవలన దెలియుచున్నది3. ముమ్మడి యరికేసరి చేసిన ఘనకార్యము లెవ్వియుగానరావు. క్రీ. శ. ౯౭౩ వ సంవత్సరమున చాళుక్యవంశజుడైన రెండవ తైలపదేవుడు రాష్ట్రకూట సామ్రాజ్యమును గూలద్రోసి యుత్సన్నమైపోయిన పాశ్చాత్యచాళుక్యసామ్రాజ్యమును పునః ప్రతిష్ఠ యొనర్చెను. రాష్ట్రకూటుల ప్రభుత్వముతో గూడ వేములవాడచాళుక్యుల యేలుబడియు నంతరించినది. తరువాత నీవంశమువారు చరిత్రనుండి సంపూర్ణముగ నదృశ్యులైపోయిరి.

ముమ్మడి యరికేసరి తన పెదతండ్రిని బోలి జైన విద్వాంసుడగు సోమదేవసూరి కాశ్రయమిచ్చెను. ఇతడు తన తండ్రియగు బద్దెగనిచే నిర్మింపబడిన శుభధామజినాలయాఖ్యవసతియొక్క ఖండస్ఫుటితనవసుధాకర్మబలినివేద్యార్థము పై సోమదేవసూరికి సబ్బిసహస్రాన్తర్గతరేపాకదశగ్రామమధ్యమందలి కుత్తుంవృత్తి పలుకటూనామగ్రామమును దానముజేసెను. సోమదేవసూరిగాక పెద్దనభట్టను కవి యొకడు గూడ ముమ్మడి యరికేసరియొద్ద నుండెను. ఇతడే పర్భణిశాసనగ్రంథకర్త.4

1. యశస్తిలక. (కావ్యమాల. నెం. ౭౦) పుట ౪౧౯.

2. పర్భణిశాసనము. జైన్ సాహిత్య ఔర్ ఇతిహాస్, పుట ౨౫.

3. తెలిం. శాస. ఇతర. నెం. ౨౧.

4. జైన్ సాహిత్య ఔర్ ఇతిహాస్. పుట ౨౫.

## ౧౦

## మతవాస్తువాఙ్మయములు

(౧) మతము:—వేములవాడ చాళుక్యరాజులు మతాభిమానముగల ప్రభువులైనను వారవలంబించిన మత మిట్టిదని నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. రాజ ధర్మము ననుసరించి రాష్ట్రమున బ్రచారమందుండిన సర్వసమయములను బక్షపాతములేక సమానదృష్టిని జూచుట వారి విధి. కావున రాజులొనర్చిన దానా దులను బట్టియు, గవి పండిత సమ్మానమును బట్టియు వా రనుసరించిన మతమును నిశ్చయముగ గనుగొనుటకు సాధ్యపడదు. ఇంతవఱకు లభించిన శాసనాదిసాక్ష్య మును బట్టి చూడగా వేములవాడ చాళుక్యుల కాలమున శైవజైనమతములు ప్రచలితముండినట్లు తెలియవచ్చు చున్నది. వీనితోపాటు సౌరమతముగూడ ప్రచారమున నుండెను. దేవాలయములతోగూడ శైవసన్యాసుల మఠము లుండెడివి. కొల్లిపఱ తామ్రశాసనమున శ్రీశైల మున దుత్తరద్వారమైన ఏలేశ్వరమున నొక కాలా ముఖమఠ ముండినట్లు చెప్పియున్నది. సద్యోశివాచార్య ముగ్ధశివాచార్యలను శైవసన్యాసులు-గురుశిష్యు-లిచట నివసించుచుండిరట.5 మఱియు వేములవాడ శిలాశాస నమున నచటి దేవాలయములందు నివసించు సాక్షి మల్లికార్జున ముక్తిలింగి విద్యారాశి వ్యాఖ్యాని భట్టా రకుడు చెప్పఁబడియున్నాడు; ఇతడు అచటి దేవా లయములకు స్థానాధిపతి. ఇతడా శాసనమున నిట్లు ప్రశంసింపబడియున్నాడు:

> "నిస్పృహైకాగ్రణీ స్సూరి స్థానాధిష్ఠాయకస్స్వయం
> ధాతవీయాన్వయే జాతః పండితశ్చ మునీశ్వరః."6

ఈ మఠములు కేవలము సన్యాసుల యునికిపట్టు మాత్రము గావు. అవి విద్యాస్థానములు. కొల్లిపఱ శాసనోక్తదానము విద్యాదాన మని యందు కలదు: "అయం శ్రీమదరికేసరిణో ధర్మః; విద్యాదానమిదం దత్తమ్7" విద్యాదాన మనగా విద్య యొసగుటకు వలయు సదుపాయములను గల్పించుటకై చేసిన దానము. ప్రతికాలాముఖమఠమునను నొక ధర్మ విద్యా శాల యుండెడిది. ఆ కాలమున బ్రసిద్ధికెక్కిన విద్యల నన్నిటిని అచటికి విద్యాభ్యాసము కొఱకు వచ్చువారికి, వేతనములను బుచ్చుకొనక యుచితముగ గరపెడివారు. విద్యార్థులకు గొఱతపడ నీయక యన్నపానీయాదు లొసగుట కచట సన్న సత్ర ములు గలవు. నివసించుటకు దగు వసతిగృహము లుండె డివి. వేదశాస్త్రాగమపురాణేతిహాసకావ్యనాటకాది సకలవిషయములను బోధించుట కచట సమగ్రులైన విద్వాంసు లుండువారు. వీరు తమ తమ యభిమాన విద్యల యందు సంపూర్ణ పాండిత్యమును గలిగి తమ శిక్షక్రింద నుండు విద్యార్థుల కా యా శాస్త్రాదులను జక్కగా నేర్పుచు సమయము వచ్చినప్పుడు శాస్త్రవాదముల యందు పాల్గొని తమ వ్యక్తిత్వమును నిలబెట్టుకొను టకు దగిన శక్తిసామర్థ్యములు గలిగియుండిరి. విద్యా స్థానములందు నిరంతరము సరస్వతీసేవయందే కాలము గడపుటకే యుపాధ్యాయుల కప్పటి వదాన్యులు సదు పాయములను గల్పించువారు. వేతనమునకు బదులు వీరికి భూవృత్తుల నొసంగి, నివసించుట కనుకూలములైన గృహారామములను నిర్మించి యిచ్చువారు. సంఘాభి వృద్ధికై ప్రభుత్వము నిర్వహించవలసిన ప్రధానబాధ్య తలు కొన్ని ఈ మతసంస్థలపై బడెను. కావున నవి యిహపరములు రెంటికిని మార్గదర్శు లాయెను.

హిందూధర్మమునకు దేవాలయము లెట్లో జైన సమయమునకు బసతు లట్లు. దేవాలయములవలె వాని ప్రధానకృత్యము మతప్రచారమే యైనను నవియు సంఘాభివృద్ధి కావశ్యకములగు ప్రాపంచికవిషయముల యెడ నౌదాసీన్యము వహించియుండలేదు. జైనసన్యా సులును దమ శిష్యకోటికి విద్యాబుద్ధులు గరపుచు లోకసంగ్రహమునకు దోడ్పడుచువచ్చిరి. వేములవాడ చాళుక్యులకాలమున శైవమువలె జైనమతముగూడ నభి వృద్ధి నందినది. సామాన్యజనులే కాక రాజులును, సామంతులును దరచుగ జైనదీక్షను స్వీకరించుచుండిరి. హిందువులవలె జైనులును బ్రహ్మక్షత్రియాదివర్ణ విభే

---

5. భారతి. సం. ౭. భా. ౨. పుటలు ౬౧౫-౮.

6. తెలిం. శాస. ఇతర. సం. ౨౧.

7. భారతి. సం. ౭. భా. ౨. పుట ౬౧౮.

మును బాటించుచుండుటచే నప్పుడు జనులు సులభముగ నొక మతమును విసర్జించి మఱియొకదానిని స్వీకరించుట కవకాశ ముండెడిది. మతము మారినను కులము చెడకుండు కారణమున సంఘము విచ్ఛిన్నము గాక యథాపూర్వము నిలిచియుండెను.

వాస్తునిర్మాణము:—వేములవాడ చాళుక్య రాజులనాటి ప్రాసాదమందిరాదికట్టడము లేవియు గానరావు. శాసనములనుబట్టి వీరు కొన్ని దేవాలయాదులను నిర్మించిన ట్లూహించుట కవకాశము గలదు. వేములవాడ శిలాశాసనమున రాజేశ్వరాదిత్యగృహ బద్దెగేశ్వరాలయములు పేర్కొనబడియున్నవి. రాజేశ్వర బద్దెగలనువారు నిర్మించుటవలననో, వారి జ్ఞాపకార్థము కట్టబడుటవలననో వీని కా పేరులు వచ్చియుండవలయును. వేములవాడ చాళుక్యులలో మొదటి నరసింహునికి రాజాదిత్యుడను నామాంతరము గలదు. సోలదగండ బద్దెగడు సుప్రసిద్ధుడు. వీరిచేగాని, వీరి పేరగాని పై దేవాలయములు నిర్మింపబడియుండవచ్చును. మఱియు బద్దెగభూమిపాలుని తండ్రిపాలుడైన నాగనార్యుని కుమారుడు పెద్దన మఱియొక యాదిత్యగృహమును నిర్మించెను[౮]. ఇట్లే పర్భణిశాసనమున ముమ్మడియరికేసరితండ్రియగు రెండవ బద్దెగనియొక్క శుభధామ జినాలయ మొకటి పేర్కొనబడియున్నది. ఈ దేవాలయములును, జినాలయములును నింకను నిలచియున్నవో, లేక నామమాత్రావశిష్టము లైనవో తెలియదు. ఇవి యే స్థితియం దుండినను, వేములవాడ చాళుక్యరాజులును, వారి యనుచరులును వాస్తునిర్మాణమునం దాసక్తి గలిగి పెక్కు కట్టడములను గట్టించువారని తెల్లమగుచున్నది.

వాఙ్మయపోషణ:—వేములవాడ చాళుక్యులు రాజ్యము సల్పినది తెలుగుదేశము. వారు కర్ణాటక వాఙ్మయమును పోషించిరి. కన్నడకవులయం దగ్రగణ్యుడైన పంపకవి యిమ్మడియరికేసరియాస్థానమున వెలసెను. ఇతడు రెండు మహాకావ్యములను రచించెను. ఇతని యాదిపురాణమును, విక్రమార్జునవిజయమును నెఱుగని యక్షరాస్యుడైన కర్ణాటకు డెవ్వడు నుండడు. పంపకవి కమ్మనాటిలోని వేంగిపఱుగ్రామవాస్తవ్యుడైన యాంధ్రజైనబ్రాహ్మణుడు. ఇతడు తాను రచించిన రెండు కబ్బములలో విక్రమార్జునవిజయమున మహాభారతకథను వర్ణించి దన స్వామియగు నిమ్మడియరికేసరినరపాలుని కంకిత మిచ్చెను. ఇతడు రచియించిన రెండవ గ్రంథ మాదిపురాణము. ఇది జైనమతగ్రంథము. జైనతీర్థంకరుల చరిత్ర మిందు వర్ణింపబడియున్నది. ఆంధ్రదేశమున వెలసిన కన్నడ కవి పంప డొక్కడే కాడు. శాంతిపురాణ, భువనైకరామాభ్యుదయాదికావ్యములను విరచించిన పొన్నడును నీ తరగతికి జెందినవాడే. ఇప్పటి యుత్తర ఆర్కాటుమండలములోని వాణియంబాడి యీతని జన్మదేశమైనను, ఇతడు కావ్యరచన మొనర్చి కీర్తి గడించిన దాంధ్రదేశమునందే. ఇతడు వయస్సుచే పంపనికంటె నించుక పెద్దవాడైనను సమకాలికుడే. పంపని జన్మస్థానమగు కమ్మనాటియందే యితని కవితామతల్లి పుష్పించినది. ఆకాలమున వేంగిమండలాంతర్గతమైన కమ్మనాటిలోని పుంగనూరుగ్రామమున నొక్క జైనబ్రాహ్మణకుటుంబ ముండెను. ఆ కుటుంబమునకు జెందిన నాగమయ్య యను భూమిదేవునికి మల్లప పున్నమయ్య లను పుత్రు లిరువురు కలిగిరి. అప్పటి బ్రాహ్మణు లనేకులవలె వీరును శస్త్రోపజీవులు. ఈ బ్రాహ్మణకుటుంబమును పొన్న డాశ్రయించి నాగమయ్యపుత్రుల ప్రోత్సాహముచే శాంతిపురాణమును రచించెను. మఱియు నితని కవిత్వమునకు మెచ్చి యితనికి రాష్ట్రకూటముమ్మడికృష్ణచక్రవర్తి 'యుభయకవిచక్రవర్తి' యను బిరు దొసగెనట. ముమ్మడికృష్ణచక్రవర్తికే ఇతడు తన భువనైకరామాభ్యుదయము నంకితము జేసిన ట్లున్నది. మల్లపయ్యపుత్రికయగు నత్తిమబ్బె చాళుక్యచక్రవర్తియగు తైలపదేవుని మహామంత్రియగు దల్లపుని పుత్రుడగు నాగదేవుని బెండ్లియాడెను. ఈమె దానచింతామణి యని ప్రఖ్యాతి నందినది. ఈమె కుమారుడు పడెవాలు తైలపుడు. అత్తిమబ్బకు తండ్రికివలె కన్నడభాషయం దభిమానము

౮. తెలిం. శాస. ఇతర. ౨౨.

మెండు. ఈమె గదాయుద్ధాజితనాథపురాణకృతికర్త యగు రన్నమహాకవికి బోషకురాలు. ఇట్లు కన్నడకవి రత్నత్రయ మనబఱగు పంప పొన్న రన్నకవులకు మువ్వురిని నాంధ్రదేశముతో గాఢమైన సంబంధ ముండెనని తెల్లమగుచున్నది. మొదటివా రాంధ్రబ్రాహ్మణుడు; తక్కినవారి కిరువురికిని పుంగనూరుద్విజోత్తములగు నాగమయ్యపుత్రులును, పౌత్రియు బోషకులు.

ఇచట విచారింపవలసిన ముఖ్యాంశ మొకటి కలదు. ఆంధ్రుల కీ యుగమున గన్నడభాషపై నీ యభిమాన మేల కలిగినది? స్వభాషయగు తెనుగు వదలి పంపడు కన్నడమున నేల గ్రంథరచనకు గడంగెను? మల్లపపొన్నమయ్యలును, నత్తిమబ్బియును కన్నడ కవుల నేల యాదరించిరి? క్రీ. శ. ౧౧వ శతాబ్దము వఱకును తెనుగున గావ్యరచన ప్రారంభముకాలేదు. తత్పూర్వ మాంధ్రులు సంస్కృతప్రాకృతాదిభాషల యందే గ్రంథరచన సాగించెడివారు. దీనికి గారణము వారి భాష గ్రంథరచనకు దగిన స్థితియం దుండక పోవుటయే. క్రీ. శ. ౭వ శతాబ్దమునకు బూర్వము మన మాదు నాంధ్రభాష ప్రచారమున నుండెనని చెప్పుటకు దగిన సాక్ష్యము లేదు. క్రీ శ. ౬౦౦-౬౩౦ల మధ్య కంచిరాజ్యమును పరిపాలించుచుండిన మొదటి మహేంద్రవిక్రముని బిరుదావళియం దంధ్రభాష మొదట పొడకట్టుచున్నది. అతనికి సమకాలికులైన రేనాటి తెలుగుచోళరాజులయొక్క శాసనములు సంపూర్ణముగ నంధ్రభాషయందే వ్రాయబడియున్నవి. అట్లే క్రీ. శ. ౭వ శతాబ్దద్వితీయపాదప్రారంభమున వేంగిదేశమును జయించిన పూర్వచాళుక్యుల శాసనములు కొన్ని సంపూర్ణముగ తెనుగునందే విరచింపబడియున్నవి. కాని ఈ శాసనములన్నియు వచనశాసనములు. పద్య మెందును గానరాదు. వీని నాధారపఱచుకొని యప్పుడు తెనుగువారు నిజభాషయందు కవనము సెప్ప నేర్చియుండిరో, లేదో నిశ్చయించుటకు వీలు లేదు.

చాళుక్యుల రాకతో నాంధ్రదేశచరిత్రయం దొక నూతనయుగము ప్రారంభ మగుచున్నది; జాతీయ జీవనము బహుళముగ మారిపోయినది. ఇమ్మడిపులకేశి వల్లభుని విజయములమూలమున తీరాంధ్రమున వేంగి మండలమున నూతనరాజవంశ మొకటి నెలకొనినది. ఇదియే పూర్వచాళుక్యవంశము; ఇమ్మడిపులకేశివల్లభుని తమ్ముడగు కుబ్జవిష్ణు డీ వంశమునకు మూలపురుషుడు. ఇతనిసంతతివారు పెక్కుశతాబ్దములపర్యంతము తీరాంధ్రభూమిని పాలించిరి. ఈ మార్పు కేవలము రాజకీయము గాదు. నూతనరాజ్యస్థాపనతో నది యాగలేదు. చాళుక్యులు కర్ణాటకులు; ఆంధ్రదేశమునకు బరివారు. ఆంధ్రమండలమును జయించి యందు వారు స్థిరనివాసము లేర్పఱచుకొనినపుడు వారు తమతోగూడ దమస్త్రీలను, పరివారమును దోడ్కొని వచ్చిరి. మఱియు దమయధికారమును నిలబెట్టుకొనుటకు చతురంగబలములను దోడ్కొనివచ్చిరి. వీరందఱును కర్ణాటకులే; వీరి యధికారముక్రింద రాజ్యపాలనము గావించుటకు వచ్చిన యుద్యోగులును, సకల నియోగవర్గమును గర్ణాటకమునుండియే వచ్చిరి. వీరితోపాటు వర్తకముకొఱకు వైశ్యులును, శూద్రప్రజయు కర్ణాటకమునుండియే వచ్చి తీరాంధ్రమున నెలవు లేర్పఱచుకొని స్థిరముగ నిలిచిపోయిరి. తీరాంధ్రమున పూర్వచాళుక్యరాజ్యము సంస్థాపనయైనపిమ్మట కర్ణాటాంధ్రదేశముల మధ్య రాకపోకలు హెచ్చి రెండు దేశముల ప్రజలకును దృఢసంబంధ మేర్పడినది. దీనియొక్క ప్రథమఫలము ప్రజాసమ్మిశ్రణము. ప్రజాసమ్మిశ్రణమువలన జనుల యాచార వ్యవహారములయందు కొంత మార్పు కలిగినది; ఈ మార్పు ముఖ్యముగ భాషయందు పొడచూపినది. చాళుక్యులును, వారి యనుచరులును కన్నడభాషనాడువారు. రాజభాష యగుటచే నది ప్రసిద్ధి కెక్కినది. రాజకీయవ్యవహారములన్నియు దేశభాషయగు తెనుగునందే నడపుచు వచ్చినను పూర్వచాళుక్యరాజులకు చాలకాలమువఱకు మాతృభాషయగు కన్నడముపై నాదరము తగ్గలేదు. కన్నడపదములు, పలుకుబడులు పెక్కు తెనుగున బ్రవేశించినవి. ఇందుమూలమున భాషయందలి శబ్దజాలము విస్తరించినను పరిశుద్ధత చెడినది. తురకరాజులకాలమున నరబీపారసీభాషలయొక్క సంపర్కమువలనను, నాంగ్లేయపరిపాలనయందు ఆంగ

భాషాసంపర్కమువలనను నెట్టి మార్పు కలిగెనో చాళుక్యయుగమునందు కన్నడభాషపొత్తువలన నంతకు మించిన మార్పు తెనుగున గనుపట్టినది. అప్పుడు శాసనములుదప్ప లిఖితవాఙ్మయ మెద్దియు లేకపోవుటచేత గ్రంథరచనయం దభిరుచి గల విద్వాంసు లందఱును సంస్కృతమందో, లేక రాజభాషయగు కన్నడమునందో గ్రంథములు రచియించెడివారు. ఈ కారణము వలననే పంపాదులాంధ్రులైనకవులు దమ గ్రంథములను కన్నడమున వ్రాసిరి; ఆంధ్రులైనబ్రాహ్మణసామంతప్రభువులైన మల్లపయ్య పొన్నమయ్యాదులు కన్నడకవుల కాశ్రయ మొసగి వారిని కర్ణాటకమున గావ్యరచనకు బురికొల్పిరి. కాని తెనుగుదేశమున కన్నడభాష కట్టి గౌరవము చాలకాలము జరగలేదు. రాజకీయకారణమువలన నాంధ్రదేశమున గన్నడభాషకు బ్రచారము క్రమక్రమముగ దగ్గ నారంభించినది. బాదామిచాళుక్యుల దొరతనము సాగినంతకాలమును పూర్వచాళుక్యులకును, గర్ణాటకులకును మైత్రి యవిచ్ఛిన్నముగ నడచినది. కాని, క్రీ. శ. ౮ వ శతాబ్దమధ్యమున రాష్ట్రకూటులు విజృంభించి బాదామిచాళుక్యుల యధికారమును గూలద్రోసి కర్ణాటకసింహాసనము నాక్రమించినదాదిగ పూర్వచాళుక్యులకు వారితో వైరము పొసగి దినదినప్రవర్ధమానముగ వృద్ధిజెందెను. తత్కారణమున కర్ణాటాంధ్రదేశములకు యుద్ధములు నిరంతర మతితీవ్రముగ నడువసాగెను. ఈ వైరాతిశయమువలన పూర్వచాళుక్యులు దాము కర్ణాటకులగుటను విస్మరించి తమ ప్రజలతో నేకీభవించి వారివలె దాము నాంధ్రుల మని యెంచసాగిరి. ఈ యభిప్రాయము వీరి మానససీమ నంకురించినప్పటినుండియు తెనుగుభాషయం దభిమానము హెచ్చి దాని బలుతెఱగుల నభివృద్ధిసేయగడగిరి. కన్నడమునందువలె నాంధ్రమునను కావ్యనిర్మాణము సేయుట యుక్త మని నిశ్చయించి కవుల నాదరించి కవన మల్లుటకు బురికొల్పిరి. ఈ యంశమునే నన్నెచోడదేవుడు దన కుమారసంభవపీఠికయం దిట్లు తెల్పియున్నాడు:

"మును మార్గకవిత లోకం
బున వలయగ దేశికవిత బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయం
బున జన చాళుక్యరాజు మొదలుగ బలువుర్."

ఇందువలన దేశికవిత బుట్టించి యంధ్రవిషయంబున దెనుగును చాళుక్యులు నిల్పిరనియు వారికి బూర్వము తెనుగున కవిత్వము లేదనియు, దెల్లమగుచున్నది. దేశికవిత్వమును బుట్టించి తెనుగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరా జెవ్వడో, యత డా వంశమున నేశాఖకు జెందినవాడో తెలియదు. కాని తెనుగుదేశముతో బూర్వచాళుక్యరాజులకే గాఢతమమైన సంబంధ ముండిన కారణమునను, తెనుగుపద్యరచన ప్రప్రథమమున పూర్వచాళుక్యవంశజుడగు గుణగవిజయాదిత్యుని శాసనములయందే పొడకట్టుచుండుటవలనను నన్నెచోడకవి చెప్పిన విధమున దేశిని కవిత్వమును బుట్టించి తెనుంగు నంధ్రవిషయమున నిలిపిన చాళుక్యరాజు గుణగవిజయాదిత్యుని పూర్వికులగు పూర్వచాళుక్యులలో నొక్కడుగ నుండు నని తలచుట యుక్తము.

ఇట్లారంభమైన తెనుగుకవిత్వమునకు కన్నడకావ్యములు మేలుబంతు లైనవి. తెనుగుకవులకు గన్నడకవులు మార్గదర్శకు లైరి. ఆంధ్రకావ్యములలో నాదికావ్య మనదగు నన్నెచోడుని కుమారసంభవమును ప్రాచీనకర్ణాటకకావ్యములతో బోల్చి చూచిన నీ విషయము తెల్లము కాగలదు. నన్నయభట్టు భారతమునకు గూడ కర్ణాటకకావ్యముల సోకు తప్పదాయె. ఇంకొక విశేషము. ఆంధ్రవాగనుశాసనుడు పూర్వచాళుక్యరాజుల కులక్రమాగతపురోహితుడగుటచే నతని పెద్దలు కుబ్జవిష్ణువుతోగూడ వేంగికి వచ్చి యచట స్థిరనివాసము లేర్పఱచుకొని వేంగినే మాతృదేశముగ స్వీకరించిన కర్ణాటబ్రాహ్మణులు కావలయును. నన్నయభట్టునకు సహాధ్యాయుడును, భారతరచనయందు పాకశాసనికి నారాయణునివలె దోడుపడిన నారాయణభట్టు కర్ణాటకచక్రవర్తియగు సాహసమల్లసోమేశ్వరుని ప్రధానియును, వాణసవంశజుడును నగు కర్ణాటకబ్రాహ్మణుడు. కావున నన్నయకృతాంధ్రభారతమున కర్ణాటకావ్యపు బోకడలు గానవచ్చుట వింత కాదు.

కుమారసంభవము మొదలగు కావ్యములందు గానవచ్చు కన్నడపదములు, పలుకుబడులు, కవిసమయ

ములు, వర్ణనాదికములు క్రమక్రమముగ సన్నగిలి తుదకు మాసిపోయినవి; కాని కొన్ని యంశములందు తెనుగు కావ్యములపై గన్నడముద్ర స్థిరమై నిలిచినది. దీనికి దార్కాణగ రెండు విషయములను దెల్పుచున్నాడను:

(౧) ఆంధ్రకావ్యములన్నియు—నిర్వచనోత్తర రామాయణాది యల్పిష్టసంఖ్యాకములు దప్ప—చంపువులే. సంస్కృతమునను చంపూకావ్యములు గలవు; కాని వాని సంఖ్య యల్పము. అన్నియు నర్వాచీనములు. కేవలపద్యకావ్యములకు గల ప్రఖ్యాతి వానికి లేదు. తెనుగున పద్యకావ్యములు నేతిబీరకాయలు. వానిని బద్యకావ్యము లనుట తప్పు. ఇట్లు మన కావ్యములన్నియు జంపూకావ్యము లగుటకు గారణ మాదియుంగ మన మన కావ్యనిర్మాతలు కర్ణాటకకావ్యసరణి ననుసరించుటయే. షట్పదికవిత్వ మారంభమగువఱకును గర్ణాటకకావ్యము లన్నియు జంపువులే. కర్ణాటకమునుండి వచ్చిన చాళుక్యరాజుల ప్రోత్సాహమున దెనుగున కావ్యనిర్మాణమునకు గడగిన తెనుగుకవులు కర్ణాటకఫక్కి ననుసరింపక తప్పినది కాదు. వారు వేసిన పునాదులపై నిర్మాణమైన తెనుగువాఙ్మయసౌధము భిన్నస్వరూపము నెట్లు పొందగలదు?

(౨) తెనుగుకన్నడఛందస్సు లొక్కటేనైనవి. వానికి గల భేద మత్యల్పము. కన్నడకవులు 'ప్రాస'ను మాత్రము పాటించిరి; తెనుగువారు 'ప్రాస'తో గూడ 'యతి'ని జేర్చిరి. ఇదియే వీనికి గల ప్రధానభేదము. తెనుగుకన్నడభాషలయందలి పద్యములు దేశిగీతములు, వృత్తము లని రెండు తరగతులుగ విభజింపబడుచున్నవి. అక్కర సీసగీత ద్విపద తరువోజరగడ మున్నగునవి మొదటితరగతికి జెందినవి. సీసగీతములును ద్విపదలును గన్నడకావ్యములందు గానరావు; షట్పది తెనుగున లేదు; కాని లక్షణగ్రంథముల కెక్కని తెనుగుపాటలు షట్పదిరంటిని చాల గలవు. ఉత్పలమాల చంపకమాల మత్తేభవిక్రీడితము మొదలైన వృత్తములు రెండవతరగతికి జేరినవి. సర్వసామాన్యముగ నన్నియాంధ్రకర్ణాటకావ్యములందును గానవచ్చు కందపద్య మీ తరగతిలోనిదే.

తెనుగుకన్నడఛందస్సు లొక్కటేరుగ నుండుటకు గారణ మేమి? చక్కగ నాలోచించి చూడగా దీని కన్యోన్యాశ్రయమే కారణ మని తోచుచున్నది. ఈ యభిప్రాయమును గొంద అంగీకరింపరు. తెనుగుకన్నడఛందస్సు లొక్కరీతిగ నుండినను నవి యొండొంటితో సంబంధము లేక స్వతంత్రముగనే యేర్పడెననియు, వానికి గల పోలిక లవి యొక్క కుటుంబమునకు జెందిన భాష లగుటచేతను, రెంటి ఛందస్సులును సంస్కృతఛందోగ్రంథములపై నాధారపడి యుండుటచేతను గలిగిన వనియు వీరు చెప్పుదురు. కాని యది యొప్పుకొనదగినది కాదు. ఉపలబ్ధమైన సాక్ష్యమును బట్టి చూడగా తెనుగుఛందస్సునకు గొంచె మించుమించుగ గర్ణాటఛందస్సు మాతృకవలె గానవచ్చుచున్నది. కన్నడమున కవిత్వము తెనుగునకంటె గొన్ని శతాబ్దములకు ముందే పుట్టినది; తెనుగున గవిత్వ మారంభ మవునప్పటికే కన్నడమున ఛందస్స సంపూర్ణముగ వికసించి పెక్కు లక్షణగ్రంథములు బయలువెడలినవి. కర్ణాటకమునుండి వచ్చిన చాళుక్యరాజుల ప్రోత్సాహమూలముననే తెనుగున కవిత్వము మొలకయెత్తినది. కావున నర్వాచీనకాలమున నేర్పడిన తెనుగు ఛందస్సు తత్పూర్వము కొన్ని శతాబ్దములకు ముందు రూపొందిన కర్ణాటఛందస్సునకు బ్రతిబింబమువలె నుండిన దానికి గారణము తెనుగువారు కర్ణాటకులకడ నుండి తమ ఛందస్సును గ్రహించుటయే. ఈ క్రింది యంశము లీ యభిప్రాయమును బలపఱచుచున్నవి. ప్రాచీనకన్నడకావ్యములందు అక్కర లను నొక తరగతి దేశిగీతములు గానవచ్చుచున్నవి. ఇవి రాష్ట్రకూటచక్రవర్తుల సామంతుడగు నిమ్మడియుద్ధమల్లుని బెజవాడశాసనమునను, నన్నయభారతమునను గానవచ్చుచున్నవి. నన్నయ్యకు వాణసవంశజుడు కర్ణాటనారాయణభట్టు సహాయుడు గదా. గుణగవిజయాదిత్య ప్రథమచాళుక్యభీముల కాలమందలి పద్యశాసనములలో కేవలతెనుగుగీత లనదగు సీసగీత తరువోజలే కానవచ్చుచున్నవి. అక్కరలుగాని, వృత్తములుగాని లేవు; కాని గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనమున కర్ణాటకఛందస్సంప్రదాయము ననుసరించి

ప్రాసయుక్తమైన సంస్కృతచంపకమాలావృత్తమొకటి యగపడుచున్నది.

"అరినృపవాజివారణపదాతిమహోగ్రభవిరామమారుతః
పరికరసుస్థితాసిభరుచిప్రవినాశనభానుసన్నిభః
గురుతరదీనభాగవతమానవమానితకల్పపాదపః
వరకరిగల్లభూమిపభుజాసి రిహో జిభువి ప్రహాసతే."

శాసనముల సాక్ష్యమును బట్టి చూడగా మొట్టమొదట తెనుగున బద్యములు కేవలము తెనుగుదేశమున ప్రచారమునం దుండిన సీసగీతతరువోజ లను దేశిఛందములందు రచియింపబడుచుండె ననియు, దరువాత కన్నడఛందస్సున బడి యక్కరలును, వృత్తములును వ్రాయుట వాడుకలోనికి వచ్చె ననియు దెల్లమగుచున్నది. తెనుగువృత్తరచన సంస్కృతప్రాకృతవృత్తముల చొప్పున గాక కన్నడఛందస్సంప్రదాయము ననుసరించియే ప్రారంభమాయె ననుటకు బై నుదాహరింపబడిన సాతలూరి తామ్రశాసనములోని చంపకమాలావృత్తము సాక్షి. ఏలన, ద్వితీయాక్షరప్రాస మాంధ్రకర్ణాటకపద్యకవిత్వమునకు సామాన్యలక్షణమే యైనను నాంధ్రకవులు ప్రాసతో బాటు పాటించు మఱి యొక ప్రధాననియమమగు 'యతి' యిందు కానరాదు. తెనుగుకవిత్వమునం దాదినుండియు యతిప్రాసలు గానవచ్చుచున్నవి. గుణగవిజయాదిత్యుని కాలమునకు బూర్వమే 'యతిప్రాస' నియమములు స్థిరముగ నేర్పడినవి. కావున, గుణగవిజయాదిత్యుని సాతలూరుతామ్రశాసనములోని చంపకమాలయందు ప్రాసమాత్రము గానవచ్చుటయు, 'యతి' లేకపోవుటయు జూడగా నాద్యమున దెనుగుకవులు కర్ణాటఛందస్సంప్రదాయము ననుసరించి వృత్తరచనకు గడగి రని తోచుచున్నది; కాని తెనుగువారియందు 'యతి' లేని కవిత్వము వినుతి కెక్కదాయెను. కావున వారు కాలక్రమమున 'ప్రాస'తోపాటు 'యతి'నిగూడ చేర్చి వృత్తములను రచింపగడగిరి.

చాళుక్యరాజ్యస్థాపన యాంధ్రకవితకు గారణభూత మైనది. అనగా నాంధ్రకర్ణాటకసంయోగము వలన దెనుగున కవిత్వము పుట్టినది. ఇది యాంధ్రవాఙ్మయచరిత్రకారు లందఱు విస్మరింపదగని విషయము. ఈ కారణమువలననే ఆంధ్రకావ్యస్వరూపమునను, ఛందస్సునను కన్నడపు బోలికలు గానవచ్చుట.



# ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము

## ప్రథమ ద్వితీయ సంపుటములు

ప్రథమ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి "అధ్వర్యు" వరకును గల విషయము గలదు. త్రివర్ణ పటములు ౭, యితరపటములు ౧౨౫, వివిధ విషయములు ౮౦౦ కలవు.

రెండవ సంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౦౦ లకు మించిన పుటలు కలవు. "అన్" మొదలుకొని "అశ్విని" వరకు గల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦. వానిలో ౨ అమరావతీ స్తూపమునకును ౨ అనాహతమునకును చెందినవియు, ౬ దేశచిత్రపటములును గలవు. ఇవిగాక మరి ౫ సాదా దేశపటములు కలవు. ప్రాచీనాంధ్రుల కళాసంపదను వ్యక్తముచేయు అమరావతీ స్తూపమును గురించిన గొప్ప వ్యాసమునందు అమరావతీ శిల్పమునకు సంబంధించిన హాఫ్‌టోన్ బొమ్మలు రమారమి ౧౦౦ ను, వేషభూషాదుల వెల్లడించు బొమ్మలు ౫౦ వఱకును గలవు. మరియు అభినయమును వ్యాసమున భరతశాస్త్రమునందలి వేఱువేఱు హస్తములను సూచించు బొమ్మలు ౫౮ ను, 'అనాహతము' నందు షట్చక్రాదుల చిత్రములును గలవు. ఇట్లు ఆ యా వ్యాసములకు చెందిన చిత్రములు మొత్తముమీద ౨౫౦ కి పైగా నున్నవి. వివిధవిషయముల సంఖ్య ౮౦౦ వరకు నుండును. సంపుటము చక్కని స్వదేశీచర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. ప్రతిసంపుటమున ౬౦౦ పుట లుండును.

**సంపుటము 1-కి వెల రూ. ౧౦.**

ప్యాకింగు, పోస్టేజి వగైరా ప్రత్యేకము.

మేనేజరు,

ఆంధ్రవిజ్ఞానసర్వస్వ కార్యాలయము,

నెం. 7, తంబుశెట్టివీధి, మదరాసు.

# ప్రాచీనఖగోళము

## ౧౧. కాలచక్రము

### శ్రీ వేలూరి శివరామశాస్త్రి

దర్శనములును, ఖగోళశాస్త్రములును కాలమును గురించి ఒకానొక అభిప్రాయమునకు రాకముందే మానవులు నిత్యవ్యవహారమునకును, దేవారాధనమునకును దానిని పలుతెరగులుగా విభజించుకొని యుండిరి. లౌకికములును, అలౌకికములును అగు కర్మలకు కాలనిర్ణయము కావించుకొను నాచార మొక భరతవర్షమునందే కాక అన్నిదేశములందును కనుపట్టుచున్నది. ఈ యనుష్ఠానముల కన్నిటికిని మూలము సూర్యోపాసన కానగును. లేక సూర్యసంచారమును బట్టి మానవుడే దైవవిభూతితో చేయు పూజ కానగును. హిందువులకే కాక బాబిలన్ కాల్డియా గ్రీస్ చీనా హీబ్రూ (పాత) రోమ్ పారసీకము మొదలగు దేశములవారి కందరకును ఈ కాలనిర్ధారణము ధర్మానుష్ఠానమునకు ఒక అంగము.

రాడార్ మొదలగు యంత్రము లెన్ని వచ్చినను సూర్యచంద్రులే లేనిచో మనము కన్నులు లేని కబోదులము. ఈసంగతి అన్ని దేశములందలి పామరులకును పరిచితమే.

సూర్యచంద్రులు మానవులకు కీ పెట్టనక్కరలేని గడియారము లని అన్నిదేశములందలి ఖగోళశాస్త్రములును చెప్పును.

సస్యఫలాదిపరిపాకమునకే కాక జీవుల కర్మవిపాకముతో సూర్యచంద్రులకు సాక్షాత్సంబంధ మున్నటులు హిందువుల వేదాంతములు వివరించును. అది యటుండె.

#### మూలవిభాగము

కాలమున మూలవిభాగ మన్ని దేశములవారికిని సమమే. దినము, మాసము, సంవత్సరము ఈ మొదలగునవన్ని దేశములందును కలవు. కాని ఎన్నిగడియ లొక దినము?, ఎన్ని దినము లొక నెల?, ఎన్ని నెల లొక సంవత్సరము?—అను నీ మొదలగు విషయము లందు వేరువేరు మతములు కలవు. దేశభేదాదులు, పరిశోధనభేదము దీనికి కారణము. దేశభేదమునుబట్టి సూర్యోదయాస్తమయములు భేదించును. ఋతువులు భేదించును. వాన మాసములు భేదించును. దినములు భేదించును. కావున సంవత్సరాది యెప్పుడు?, ఋత్వాది యెప్పుడు?, మాసాది యెప్పుడు?, దినాది యెప్పుడు?—అను నీమొదలగు ప్రశ్నములను సమగ్రముగా చర్చించి ప్రాచీనపండితులు వారివారి దేశముల కనురూపముగా ఎన్నియో వేల యేండ్లనుండియు పరిష్కరించుకొనుచు సంస్కరించుకొనుచు వచ్చుచున్నారు. ప్రాచీనకాలమునం దన్నిదేశములవారికిని దేవయజనమునకు గాను ఏదియో యొక పంచాంగ ముండియుండవలయును. అది పాతపంచాంగమే అయియుండును. అటులయ్యును దాని సంపూర్ణస్వరూపము తెలిసికొనుట కిపు డుపాయము లేదు. మన దేశమున నేటికి దొరకిన వానిలో లగధుని వేదాంగజ్యోతిషమే ప్రాచీనము. లగధుడు క్రీస్తునకు పదునాలుగవ శతాబ్దికి చెందినవాడు. లగధునికి వెనుక నేదియో ఒక ఖగోళవిజ్ఞాన మున్నటులు ఋగ్వేదాదులవలన విస్పష్టము.

#### యూదుల పంచాంగము

—౩౮౦౦ సాలున యూదుల కొక పంచాంగము ఉండె నని పరిశోధకులు వ్రాసిరి. అందు మీన క్రాంతిపాతమునకు పిమ్మట (౨౨ సెప్టెంబర్) అమావాస్యనుండి సంవత్సరారంభము. సూర్యాస్తమయముతో దినారంభము. శనివారము రాత్రినుండి సప్తాహారంభము.

నెలకు ౩౦ దినములు. చివర నెలకు (*Mesori*) మాత్రము ౩౫ దినములు. వెరసి ఏడాదికి ౩౬౫ దినములు. ఈలెక్కలో ఒక పాతికదినము లోటగును, కాన సంవత్సరమును మార్చవలసివచ్చెను. జ్యోతిష్కుల కచ్చితమగు లెక్కనుబట్టి సంవత్సరారంభము యథాప్రకారమునకు వచ్చుటకు ౪ × ౩౬౫ = ౧౪౬౦ (౧౪౬౧ ఈజిప్టు) వత్సరములు పట్టును. థత్ (*Thoth*) మాసపు మొదటినాటినుండి వీరికి సంవత్సరారంభము. థత్ ఈజిప్టువారి సుప్రసిద్ధదేవత. ఈదేవతయే ఈజిప్టు పంచాంగమును, సంఖ్యలను తెచ్చెను.

క్రీస్తు పూర్వకడపటి అర్ధశతాబ్దిలో ఈజిప్టు గ్రీకు సామ్రాజ్యమున కధీనమయినప్పుడు అలెగ్జాండ్రియా పంచాంగములో పాటు ఈజిప్టులో స్థిరసంవత్సర మేర్పడెను. కాని క్రీస్తుతరువాత నాల్గవ శతాబ్దివరకును లోగడి వ్యావహారికసంవత్సరము మానిపోలేదు. ఈ అలెగ్జాండ్రియా పంచాంగము ఈజిప్టులో ఏడవ శతాబ్దిలో సగమువరకును ప్రచారములో నుండెను. ఆసమయమున ఈజిప్టు అలెగ్జాండ్రియాతో సహా మహమ్మదీయుల సామ్రాజ్య మాయెను. దానితో వారి పంచాంగము మారిపోవలసివచ్చెను. +౧౭౯౮ న పారసీకులు ఈజిప్టును కొంతకాలము స్వాక్రమించుకొనిరి. అప్పుడీజిప్టులో మహమ్మదీయుల పంచాంగములో పాటు ఐరోపావారి పంచాంగముకూడ వాడుకఆయెను.

## ఏథెన్స

తొల్లిటి ఏథెన్సువాసులు దినారంభమును, రాత్రిందివముల ఘంటావిభాగమును కూడను ఈజిప్టువారినే అనుసరించిరి. వారి కప్పటికి వారవిభాగము తెలియదు. వారు చాంద్రమాసమును మూడు పదులుగా విభజించిరి. నెలలో ముప్పదిదినములను ఒకటవ దినము, రెండవదినము, ఈ మొదలుగా ముప్పదవదినమువరకు పేరుపెట్టిరి. ఒకొకపుడీ లెక్క మాసాదినుండి గాక మాసాంతమునుండియు అగుట కలదు. ఒక అమనుండి మరియొక అమవరకు ఒక చాంద్రమాసము. ఇట్టి ౧౨ మాసము లొక సంవత్సరము. కావున సంవత్సరమునకు ౩౫౪ సౌరదినములు. దీని సుమారు ౧౧ రోజుల లోటు కలిసి మూడేండ్ల కొక నెల కలిపి వారు దానిని సరిపుచ్చుకొనుచుండిరి. దీనిని వారు **Second month of Poseidon** అని అందురు.—౪౩౨ సాలున మేటన్ అనువాడు ౧౯ ఏండ్ల కొక కాలచక్రము నేర్పరచెను. దీనిలో ౩-౫-౮-౧౧-౧౩-౧౬-౧౯ ఏండ్లలో ఒక అధికమాసమును కలిపెను. కాన ౧౯ ఏండ్లకు ౧౯ × ౧౨ + ౭ = ౨౩౫ నెలలు. ౬౯౩౯¾ దినములు. వాస్తవమాత్రము ౧౯ ఏండ్లకు ౬౯౪౧⅔ దినములే. —౩౩౦ సం॥ కాలిపస్ అనువాడు ౪ × ౧౯ = ౭౬ ఏండ్లు, లేక ౯౪౦ నెలలను గ్రహించి ఒక కాలచక్రము నుంచెను. అందొక్క నెలకు ౨౯ దినములును, మరుసటి నెలకు ౩౦ దినములును గా గ్రహించి ౯౪౦ నెలలకు ౨౭౭౫౯ దినములని నిర్ధారించెను.—౧౫౦ సం॥ హిపార్కస్ ౧౬ × ౧౯ = ౩౦౪ సంవత్సరములకు మరొక కాలచక్రము నేర్పాటు చేసెనుగాని అది యెంతమాత్రము వాడుకలోనికి రాలేదు.

## రోమ్

రోమనులు సప్తాహమును గ్రహించిరి. వీరి మతమున శని బృహస్పతి అంగారకుడు సూర్యుడు శుక్రుడు బుధుడు చంద్రుడును దినములో నొకొక్క గంటకు అధిపతులు. శనివారము మొదటివారము. శనివారము మొదటిగంటకు శనియు, రెండవగంటకు బృహస్పతియు, మూడవగంటకు అంగారకుడును ఈ రీతిగా యథాక్రమముగా పునరావర్తించి చూచినచో ౨౪వ గంట కంగారకు డధిపతియగును. ఆ తరువాతి వారపు మొదటిగంటకు రవి అధిపతి యగును. కావున అది రవివారము. ఈరీతిగా దాని తరువాతి వారము మొదటిగంటకు మంగళు డధిపతి కావున నది మంగళవారము. ఇది రోమనులు చెప్పిన సప్తాహవ్యుత్పత్తి. ఇటులగుచో కాల్డియనుల ఉపజ్ఞము నంగీకరించు కారణము వేరైయుండవలెను. లేక యీవ్యుత్పత్తియు వారిదే యని అనవలయును. రోమ్ ప్రతిష్ఠాత యగు రోములస్ (*Romulus*) అనువాడు ప్రథమపంచాంగకర్త యని రోమను లందురు. ఈపంచాంగముచొప్పున ఏడాదికి

౧౦ నెలలు. నెలనెలకు దినసంఖ్య వేరు వేరు. ఒక సంవత్సరమునకు ౩౦౪ దినములు. మార్చినుండి ఉగాది.

పిదప—౭౧౫-౬౭౨ నడుమ నున్న *Numa* ***Pompilius*** అను నతడు మరి రెండ్నెలలు జోడించి వానికి జనవరి యనియు, ఫెబ్రువరి యనియు నామకరణము చేసెను. అతడు చాంద్రసంవత్సర మవలంబించెను. అటుపిదప—౫ శతాబ్దిలో ***Decemvirs*** ఆజ్ఞ ననుసరించి సౌరవత్సర మేర్పరచు భారము ధర్మాచార్యుల మీద బడెను. వారు కావించిన ఏర్పాటువలన జూలియన్ సీజర్ సమయమున సింహావలోకనము చేయగా గోళశాస్త్రజ్ఞుల లెక్కలో ఏడాని కెనిమిది దినముల చొప్పన తేడా కనబడెను. అపుడు సీజరు—౪౬ సాలుకు ౪౪౫ దినము లంగీకరించి మరి ప్రతిసాలు ౩౬౫ దినముల చొప్పనను, ప్రతినాలవసాలు ౩౬౬ దినముల చొప్పనను గణింపవలసిన దని కట్టడి చేసెను. సీజ రీక్రిందిరీతి గా మాసక్రమమున దిన సంఖ్యను నిర్ధారించెను: మార్టియాస్ = ౩౧. దినములు. ఏప్రిలిస్ = ౩౦. మేయూస్ = ౩౧ జూనియూస్ = ౩౦. క్వింటిలిస్ = ౩౧. సెక్స్టిలిస్ = ౩౧. సెప్టెంబ్రిస్ ౩౦. అక్టోబ్రిస్ ౩౧. నవంబ్రిస్ = ౩౦. డిసెంబ్రిస్ = ౩౧ జాన్యువరిస్ = ౩౧ ఫెబ్రువరిస్ = ౨౯.

మార్చి నెల ఉగాది. ఫెబ్రువరికిమాత్ర మొకయేడు ౨౯ దినములు. ప్రతి నాలవసంవత్సరపు ఫెబ్రువరికి ౩౦ దినములు.

సీజరు కొన్నాళ్లకు జనవరి నుగాదిగా మార్చెను. మరికొన్ని యేండ్లకు క్వింటిలిస్ నెలను జూలియన్‌గా మార్చెను. తా నీక్వింటిలిస్ నెలలో పుట్టెను. సీజరు కొన్ని నెలలలో దినసంఖ్యనుగూడ పిమ్మట మార్చెను. ఈమార్పు లన్నియు జరగి సిద్ధమయినదే ప్రకృతమున నున్న జూలియన్‌పంచాంగము.

సీజరు మృతినొందగనే ధర్మాధికారుల పొరపాటువలన ప్రతి నాలవయేటను వచ్చు ఫెబ్రువరిలో కలపవలసిన రోజునుగురించి వివాదమేర్పడెను. అపుడు ఏలిక యయిన అగస్టస్‌సీజరు దానిని సవరించెను. దానజేసి నాటివారు అతని గౌరవమును పదిలపరచుటకుగాను సెక్స్టిలిస్‌మాసమును అగస్టస్‌మాస మని వ్యవహరింపదొడగిరి. నాటినుండి ౧౫౮౨ వరకు అగస్టస్‌సీజర్ సంశోధించిన జూలియన్‌పంచాగముననే ఐరోపాలో వ్యవహారము. ఈసమయమున పోప్ ౧౩ గ్రిగరీ దానిని క్రొంరెముగా సంస్కరించెను. అటు జూలియస్‌సీజర్ పరిశోధనచొప్పన ప్రతి నాలుగేండ్లకు నొకదినము హెచ్చు లెక్కకట్టవలెను. ఇటు వ్యవహారములో నున్నది ౨౪ గంటల దినము. మరి సౌరదినమునకో ౨౩ గంటల ౫౬ నిమిషముల ౪ సెకనులు. ఈరీతిగా సౌరదినముకంటె వాడుకలోని దినము సుమారు ౪౫ నిమిషములు పెద్దది. కాన నాలవయేట నొక వాడుక దినమును కలుపుటచే నాలుగేండ్లకు ౪౫ నిమిషము లెక్కువ వచ్చును. సంవత్సరమునకు సుమారు ౧౫ నిమిషములు హెచ్చు. దీనివలన నన్నూరేండ్లకు మూన్నాళ్లపై చిలుకు తేడా వచ్చును. దీనిబట్టి ప్రతినన్నూరేండ్లకు మూడు పొట్టినెలలు (*Leap year*) పట్టరాదు. అనగా ౧౦౦, ౨౦౦, ౩౦౦ సంవత్సరములలో ఒక దినము కలుపగూడదు. ఇటులు పోప్ ౧౩ గ్రిగరీ నిర్దేశించెను. పోప్ సంస్కరించిన జూలియన్ పంచాంగముచొప్పన ౨-౩-౫-౭ ఈ మొదలగు సంఖ్యచే సూచింపబడిన నూరు, అనగా ౨౦౦-౩౦౦-౫౦౦-౭౦౦ ఈ మొదలగు పొట్టియేండ్లు మామూలేండ్లే యగును. నాలుగు పెట్టి భాగింపగా భాగశేషము రాని ౧౬౦౦-౨౦౦౦-౨౪౦౦ మొదలగు నేండ్లే పొట్టియేండ్లు (*Leap year*) అగును. ఈ సంశోధనచే ౪౦౦ ఏండ్లలో మూడురోజులు రద్దు. ఇది యిటులు సంశోధితమయినను ౩౨౦౦ ఏండ్లలో ఒక రోజు తేడా వచ్చును. ఇంగ్లండులో ౧౭౫౨ వ సాలు వరకు గ్రిగరీశోధన మంగీకరింపబడలేదు. కాన ఇంగ్లండు పంచాంగములో ౧౧ దినముల తేడా ఉండిపోయెను. ౧౭౫౨ సాలున ఆ పదునొకండు దినములును రద్దు చేయబడెను. రెండవ సెప్టెంబరు పదమూడవ సెప్టెంబరుగా మార్పబడెను. ఐరోపాలో నంతటను ఇటులు సంస్కరింపబడిన పంచాంగ మమలులోనికి వచ్చెను. గ్రీసుదేశములోమాత్రము కాతలిక్ మతమువారును, రషియాలో ధర్మాచార్యసంప్రదాయము వారును

౧౯౧౮-౧౯ సాలువరకును జూలియన్ పంచాంగమును వ్యవహరించుకొనుచుండిరి. అపుడు పడమటి ఐరోపా యందంతటను సంశోధితమగు పంచాంగమే అమలులో నుండెను. దానికిని రష్యాపంచాంగమునకును ౧౩ రోజులు తేడా కనబడెను. ఇపు డంతటను గ్రిగరీ శోధించిన పంచాంగమే వాడుకలో నున్నది.

## పారసీకులు

తొల్లిటి పారసీకులలో సౌరసంవత్సరమునకే వాడుక. పిమ్మట చాంద్రసంవత్సరమునకును, హిజిరా పంచాంగమునకును వాడుక కలిగెను. మసలిమానులు పారసీకుల నాక్రమించుకొనుటవలన ఈమార్పు కలిగెను. అయినను ఋతుకాలములందు కృషికపనులు చేయుటకు సౌరసంవత్సరమునే అంటిపెట్టుకొనవలసి వచ్చెను. మహమ్మదు చాంద్రసంవత్సరమునే గ్రహించెను గాన సౌరసంవత్సరమును గ్రహించుటకు ఆ మసలిమానుల కిష్టము కాలేదు. అటు మాచిన ధర్మాంగము, ఇటు మాచిన ధనభంగము! వారీరీతిగోపుల నడుమ పడి కృషికులకు సౌరసంవత్సరమును, మిగిలిన వ్యవహారములకు చాంద్రసంవత్సరమును అవలంబించి ధర్మరక్షణమును, ధనరక్షణమును జేసికొనిరి. నాటి పారసీకపంచాంగము ఋతునిర్ధారణము నెడ అసమర్థముగా నుండెను. ఏలనగా ప్రతి నాలవయేటను వారికొకదినము హెచ్చు. అది పారసీకులకు అవర్జనీయమగు ధర్మాంగము. మసలిమానురాజులు పారసీకమతము నడగార్చి తమ మతప్రాబల్యమును ఓపినవారిమీద మోపుటకుగాను ఆ ఒకరోజును కలుపరాదని శాసించిరి. దానివలన ఋతువులు తబ్బిబ్బు లాయెను. +౧౧ వ శతాబ్దిలో పారసీక ప్రభువు మాలిక్ షా అనునతడు ఆ తబ్బిబ్బులను సరిపుచ్చు భారమును మహాకవియును, గోళశాస్త్రజ్ఞుడు నను ఓమర్ ఖైయామ్ పై నిడెను. అతడు ఇస్పాహాన్ మానమందిరములో పరిశోధించి ఒక సౌరసంవత్సరపంచాంగము తయారుచేసెను. ఓమర్ చేసిన లెక్క ప్రకారము ౩౬౫ దినముల ౧౫ గంటలు ౪౯ నిమిషము లొకసంవత్సరము. ఇది నేటి సంవత్సరముకంటె ౧౧ సెకనులు పెద్దది. ఓమరుకు మునుపు మీనములో రవి ప్రవేశించిన నాడు ఉగాది. ఓమరు మేషములో రవి ప్రవేశించిన నాటి మధ్యాహ్నమును ఉగాదిగా తీసికొనెను. నాడు విషువసంక్రాంతి. శుక్రవారము. ౫-౩-౧౦౭౯ వ క్రీస్తుసంవత్సరము. ఇదియే ఓమర్ పంచాంగపు పెట్టుమొదటి దినము. అతని సంవత్సరమునకు పండ్రెండు నెలలు. మొదటి పదునొకండు నెలలకును ముప్పదేసి రోజులు. పండ్రెండవ నెలకు ముప్పదియయిదు రోజులు. ఏడాదికి వెరసి ౩౬౫ రోజులు. ప్రతి నాలవయేటి పండ్రెండవ నెలకు ముప్పదియారు రోజులు. ఆ సంవత్సరమునకు ౩౬౬ రోజులు. మరియు అతని పంచాంగముచొప్పున ౨౨ వ సంవత్సరమునకు ఈ నియమముచే ౩౬౬ దినము లయినను దానికి మాత్రము ౩౬౫ దినములును, ౩౩ వ సంవత్సరమునకు ౩౬౬ దినములును. ఈరీతి లెక్కతో ఓమరు ౩౩ ఏండ్ల కొక కాలచక్రము రచించెను. దీనిలో ౨౫ ఏండ్లు మామూలేండ్లు. మిగిలిన ఎనిమిదేండ్లును ౩౬౬ దినములు కల ఏండ్లు. పారసీకుల పంచాంగము లన్నిటిలో ఓమర్ దిద్దిన పంచాంగమే సరియయినది. దీనినిబట్టి పదివేలేండ్లకు ౩౬౫౨౪౨౪ సౌర దినములు. ఇపుడు ప్రచారములో నున్న గ్రిగరి పంచాంగము చొప్పున ౩౬౫౨౪౨౫ దినములు. జ్యోతిష్కుల గణితము చొప్పున ౩౬౫° ౨౪౨౨ × ౧౦౦౦౦ = ౩౬౫౨౪౨౨ దినములు. కావున ఐరోపాలో ఇపుడు ప్రచారములో నున్న పంచాంగము లన్నిటికన్న ఓమర్ పంచాంగము శుద్ధము. దీనిలో రెణ్ణాళ్లమాత్రమే తేడా. ఐరోపా పంచాంగములలో మూన్నాళ్లు తేడా. ఈ ఓమర్ పంచాంగము సెల్ జూక్-ఖోవారిజ్మ్ అను రాజులవరకును ప్రచారములో నుండెను. వారి పిమ్మట తార్తారురాజులు దీనిని నిలిపివేసి మరల హిజిరాపంచాంగమునే ప్రచారములోనికి తెచ్చిరి. హిందూదేశమునందున్న పారసీకులు కొలదిమార్పులతో ఓమర్ పంచాంగమునే వాడుకొనుచున్నారు.

## హిజిరా

హిజిరా పంచాంగమున చాంద్రసంవత్సరము. దానికి ౩౫౪ లేక ౩౫౫ రోజులు. ప్రతి నాలవ

యేటికిని ఒక నెల కలుపవలెను. సూర్యాస్తమునుండి దినారంభము. పగలు ౧౨, రేయి ౧౨ గంటలు. ఋతువులబట్టి గంటలకు హెచ్చుతగ్గు లుండును. ఆదివారములగాయతు సప్తాహారంభము. మాసము చాంద్రము. అమావాస్యతో మాసారంభము.

## ఉగాది

ఐరోపా తూర్పుభాగమునందును, పడమటి భాగమునందును మార్చి నెల మొదలు ఉగాది. కొందరు కొందరు పోపుల ఇచ్ఛానుసారముగా ఇది ఒకానొకపుడు క్రీస్తుమాసమునకును, క్రీస్తుదినమునకును, ఈస్టరుకును, లేక ఏదోయొక పండుగకును మారుచుండెడిది. స్పెయిన్ దేశములో ౧౬ వ శతాబ్దివరకును ౧ టవ మార్చి నుండియు, జర్మనీలో ౧౧ వ శతాబ్దివరకు ౨౫ వ మార్చినుండియు ఉగాది. ఫ్రాన్సుస్థానమునకుమాత్రము ధర్మాచార్యులు అడ్వెంట్ ఆదివారమును ఉగాదిగా పరిగణించెడివారు. ఈ ఆదివారము క్రీస్తునెల నెనకటి నాలవ ఆదివారము. మధ్యయుగమున ఫ్రాన్సు దేశమున ౧ టవ మార్చినుండి ఉగాది. తూర్పు క్రీస్తు రాజ్యములందును, రష్యాయందును ౧౯౧౮ వరకును ఇదియే వాడుక. కాని పీసా ఫ్లారెం సు దేశములవారు ౨౫ వ మార్చినుండి ఉగాది చేసికొనుచుండెడివారు. ఇటలీదేశపు ౧౨ వ పోపు ఇన్నొసెంట్ అనునతని ఆజ్ఞ ౧౬౯౧ నుండి ౧ టవ జనవరి ఉగాది ఆయెను. నెదర్లాండ్స్‌లో రెండవ ఫిలిప్ ౧౫౭౫ సాలున ౧ టవ జనవరిని ఉగాదిగా చేసెను. జూలియన్‌సీజరుగూడ ఇటులే నిర్దేశించెను. ౧౭౫౦లోగాని ఇటలీలో సర్వత్ర ౧ టవ జనవరి ఉగాది కాలేదు. ౧౭౫౨ లో ఇంగ్లాండు ౧ టవ జనవరిని సంవత్సరాదిగా వ్యవహరించెను. యూదులకు మీనక్రాంతిపాతము పిమ్మటి అమావాస్యనుండి ఉగాది.

## అబ్దము

ప్రాచీనకాలమున అన్ని దేశములందును సంవత్సరసంఖ్య తెలుపుటకు ఏదియోయొక అబ్దము కనపట్టును. ప్రాచీనభరతవర్షమున యుధిష్ఠిరాబ్దము ప్రఖ్యాతము. పిమ్మట + ౭౮ వ సంవత్సరమున ప్రసిద్ధుడగు నొక శకరాజు సింహాసన మెక్కినప్పటినుండి శకాబ్దమేర్పడెను. ఈశక యుధిష్ఠిరాబ్దముల నడుమను, పూర్వమునను, పదమునను గూడ మరికొందరపేర కొన్ని యుగములు (సప్తర్షి యుగము, మహేశ్వరయుగము మొ.) భరతఖండమునం దంతటనో, కొంతటనో అమలులో నుండి రద్దయిపోయినటులు కనబడును. వాయుపురాణము చూచునది.

తొల్లి ఐరోపాదేశము రోమనుల వ్యవస్థనే అవలంబించి ఎవరో ఒక రాజు సింహాసన మెక్కిన తరి నుండి అబ్దము నారంభించెను. + ౫౩౨ సాలున డయోనిసియస్ ఎక్సిగస్ అనునతడు ఏసు క్రీస్తు జన్మతిథినుండి అబ్దారంభము చేయవలయునని నిర్దేశించెను. ఆరవ శతాబ్దిలో ఐరోపాయంతయు ఈ క్రీస్తు అబ్దము నవలంబించెను.

ముసల్మానులు హిజరత్ మహమ్మద్ నిర్గమనమును అబ్దారంభముగా చేకొనిరి.

విప్లవానంతరము ఫ్రాన్సువారొక అబ్దము నారంభింపదలచిరి. అది ౨౨-౯-౧౭౯౨ సాలున.

'పంచాంగము జటిలముగా నుండరాదు. అది అందరకును తేటతెల్లముగా తెలియవలయును. మరియు నది కష్టముగాకుండ పలుమందికుపయోగపడవలయును.' ఏ దేశపు పంచాంగమునకైన ఇవి ముఖ్యగుణములు. పలు సంస్కారముల కొనసాగుచుండుటవలన గ్రిగరీపంచాంగము అతివిశదము, సంక్షిప్తము, కాకపోయినను ఆయా గుణములలో ప్రపంచమునందలి ఏ పంచాంగమునకును తీసిపోదు. ఇది + ౧౫౮౨ నుండియు ప్రచారమునందున్నది. కాతలిక్ దేశములు దీనిని వెంటనే స్వీకరించెను. బ్రిటన్ స్వీడనులు + ౧౮ వ శతాబ్దివరకు దీనిని వెలిగనే చూచెను. కాని పిదప ఐరోపాయెల్లయును, జమిలిఅమెరికాలును, బ్రిటిష్ కామన్వెల్త్‌లోని దేశములన్నియును ఈ పంచాంగమును స్వీకరించెను. ఇటీవల జపాన్ చీన్ టర్కీ దేశములుగూడ దీని నవలంబించెను. 'మానుపిల్లి అయినా మట్టుపిల్లి అయినా ఎలుకను పట్టిందే పిల్లి' అనినటులు సరియగు కాలమును తెలుపునదే పంచాంగము. గ్రిగరీపంచాంగమే మిగిలినవానికంటె కాలమును లెస్సగా నిరూపించును. కావున (స్వరాజ్యముపడసిన) ఇండియా దేశమువారు, లేక భారతీయులు స్వాభిమానముచే 'కేవలము స్వదేశికము' అని అసూయపెట్టుకొని గ్రిగరీపంచాంగమును విడనాడరాదు' అని I P F వారు హితోపదేశము చేయుచున్నారు. ఈ విషయమును అందరును పరిశోధింతురుగాక!

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్
## అండ్ కంపెనివారి



శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

R. S. సుగంధ ముక్కుపొడి.

అన్నిటిలో సాటిలేనిది.

ధర వివరములకు వ్రాయుడు.

తయారుచేయువారు :—

**పి. వి. రాజన్ & కంపెని,**

అర్కోణం, Arkonam, N. A. Dt.



## డోంగ్రేగారి

**బాలామృతము**

బలహీనమైన బిడ్డలకు
పుష్టియున్ను, బలమున్ను
ఆరోగ్యము నిచ్చును

*Mehta's...*

# SUNDARI ELIXIR



గర్భాశయరోగాలకు

ప్రసిద్ధ బలవర్ధకౌషధము
సర్వవిధాలైన బహిష్టు చిక్కులకూ
అనుపమ నివారిణి
సుప్రసిద్ధ భిషగ్వరులచే
ప్రశంసింపబడినది.

K.S. MEHTA & CO., 250, CHINA BAZAAR, MADRAS.

# రామరాజ భూషణుడు

## శ్రీ కొణిదెన బాలకృష్ణయ్య

ప్రబంధయుగమునందలి తెలుగుకవులలో నల్లసాని పెద్దనకు బిమ్మట రామరాజభూషణుడు ఒక్కడు మాత్రము పేరెన్నిక గాంచిన మేధస్సంపన్నుడు. వీరి యనంతరము నేటిదనుక నిక్కవిద్వయమున కెనయగు కవివరు లాంధ్రదేశమున జనించియుండలేదనుటకు వారి కావ్యరత్నత్రయమే సాక్షి. "మనువసుచరిత్రము"లనుచు నాంధ్రసంఘమున వ్యాపించియుండిన వాక్యము పెద్దన రామరాజభూషణుల విశిష్టవిఖ్యాతిని జాటుచున్నది. రామరాజభూషణుడు చతుర్విధకవితానిర్వాహకుడు, సాహిత్యరసపోషకుడు, శ్రీరామపదారవిందభజనానందుడు. జగత్ప్రాణనందనకారుణ్యకటాక్షలబ్ధ కవితాధారా సముంచితుడు. బట్టురాజకులభూషణుడు. సంగీతసాహిత్యకలామర్మజ్ఞుడు. ఆ కారణమున 'బట్టుమూర్తి'యనుచు నా కులమువారిలోని విద్వద్వర్గ్యులను సాధారణముగ జెప్పుచుండు గౌరవపదముచే సమకాలికులవలన బిలువబడుచుండిన యశోధురంధరుడు. ఇతడు పండితవంశమునకు జెందినవాడని 'ప్రబంధాంకము' అను గృహనామము తెల్లముసేయుచున్నది. రామభూషణ మహాకవి పెద్దనార్యుని యంతేవాసి యనుటకు దగు నిదర్శనము లతని గ్రంథములనుండి యందందు గ్రహింపవచ్చును. ఇతని తలిదండ్రు లిడినది, ఇతడు చెప్పుకొన్నది, కృతిభర్త సంబోధించినది, కవనప్రదాత ప్రబోధించినది 'రామరాజభూషణు' డనబడు నామము. ఇవ్విషయమును రామరాజభూషణ ప్రణీతములగు వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములు దెలుపుచున్నవి.

"గద్యము........రామరాజభూషణ ప్రణీతంబైన"

"రామభూషణకవీ! ధన్యుండవు నీ వన్నిటన్"— వసుచరిత్రకృతిపతిసంబోధనము.

"శ్రీరామభూషణా ! కవిశ్రీరసపోషణా" —హరిశ్చంద్రనలోపాఖ్యానరచనకు బ్రోత్సహించిన దైవము నాంజనేయుని ప్రబోధము.

"ధీరసూరపాత్రజాత, రామనృపభూషణాఖ్య సుకవిని" హ. న. నం దతడు చెప్పినమాట.

వసుచరిత్రము గాని, హరిశ్చంద్రనలోపాఖ్యానము గాని రామరాజభూషణుని యభిధానవిషయమున నావంతయు సంశయమునకు,దర్కమునకు జోటిచ్చుటలేదు. పైన మనవి యొనర్చిన 'బట్టుమూర్తి' యను నవాంతర నామము కాలక్రమమున జనుల నానుడినుండి బలపడి తరతరముల బ్రాకి రూఢినామ మను భ్రమకు విమర్శకులను పాలుపడులాగున నొనర్చినది. కావున నవ్విషయమును దెలిసి కొందము.

### 'బట్టుమూర్తి'

"రాజాధిరాజగు (రామరాజు) నీ మహాపురుషుని సభ కలంకారభూతు డగుటచే బట్టుమూర్తి రామరాజభూషణు డను బిరుదము గాంచెను."

(వసుచరిత్రవిమర్శనము ౧౧౭ పుట.)

అనునది కీ. శే. కందుకూరు వీరేశలింగము పంతులుగారి యభిప్రాయముగూడను. దానినే వసుచరిత్ర విమర్శకు లుటంకించిరి. కీ. శే. గురజాడ శ్రీరామమూర్తిపంతులుగారు దమకు బూర్వముగల కింవదంతులను, వాని జేకొని గ్రంథముల కెక్కించిన యవిమర్శకులగువారి వ్రాతలను ఖండించి రామరాజభూషణుడు, భట్టుమూర్తి భిన్నులని నిర్ణయించిరి. వీరు కవిజీవితగ్రంథకర్తలు. వీరేశలింగము

పంతులుగారు కవులచరిత్ర గ్రంథకర్తలు. ఉభయులు నేకార్థసమవేతులు. అట్లగుట వీరేశలింగముపంతులుగారు భిన్నమార్గ మవలంబించిరి. సత్యార్థము శిలాశాసనముఖాతి యితని గ్రంథముల భాసించుచుండ, పంతులుగారు వట్టి వాదబలమునకు, స్వపక్షస్థాపనమునకు బెద్దలగువా రెందరో తలపడి పెనగిరి. అవియన్నియు 'ఆంధ్రముద్రితగ్రంథచింతామణి' యందు ప్రకటింపబడి భట్టుమూర్తి యనునది రామరాజభూషణుని పేరు కానే కాదని నిర్ధారణమై పండితామోదమును వడసినది. కాని వసుచరిత్రవిమర్శనమునందు మహాశయ బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రిలుగారు దీనిని చర్చించి యైక్యవాదమును బ్రోదిజేసి గ్రంథము వెలువరించిరి. వీరును అనంతరపు మూకపుస్తకములవారి వ్రాతలను, ప్రవాదములను నాధారము జేసికొని కొంతవరకు బ్రాహ్మవిమర్శకులతో నవసరమున్నంతదనుక నేకీభవించి స్వీయపక్షవాదస్థాపన మొనర్చిరి. కాని 'సభాలంకార' విషయమున కాధారముగు జూపరైరి. అది లేనిచో గ్రంథము కడచుట్టునదు. ప్రత్యక్షప్రమాణములగు రామరాజభూషణుని కావ్యములయందలి వాక్యము లుల్లసిల్లుచుండ వాని నపలపించి సాధనాంతరముల నతని యునికిని సాధింప జూచుట సాహసమ్మతము కాదుగదా. అది యటులుంచి యివ్విషయమున రామరాజ-రామరాజభూషణుల సంబంధమును విచారింతము.

## రామరాజు

శ్రీ కృష్ణరాయసార్వభౌముని యల్లుడు రామరాజు. ఇతనిని 'అళియరామరా' జనియు జెప్పుదురు. రాయలవారి యనంతరము విజయనగర (కర్ణాటాంధ్ర) సామ్రాజ్యలక్ష్మిని శత్రువీరుల కైవసము గాకుండ కాపాడి, శరణాగతుల బ్రోచి, శాంతిస్థాపన మొనర్చు నుత్కంఠతో నెత్తిన కత్తిని దింపక, గట్టిన కాసె విడువక, పట్టిన ప్రతిన మానక వీరవిహారముతో జీవితమును చెల్లించిన యోధాగ్రగణ్యుడీ పుణ్యపురుషుడు. ఇతని సభకు నలంకారప్రాయుడగుట భట్టుమూర్తి 'రామరాజభూషణు'డను బిరుదము గాంచెననియు, రామరాజు నాశ్రయమును, గొప్ప బిరుదమును లభించి పదవీస్థితుడైన యనంతరము దన బట్టుకులమును దాపజేయుచున్న 'భట్టుమూర్తి' నామమును దెగడెంపులు జేసికొని, యా పేరు మాసిన పిమ్మట రచింపబడిన కావ్యములలో బిరుదునామమునే స్వీయ (పితృదత్త) నామముగ జెప్పుకొనెననియు, భట్టుమూర్తిగ నున్నపుడు నరసభూపాలీయము వ్రాసి, యనంతరము పెద్దప్రాపు, దొడ్డబిరుదు లభించుట వసుచరిత్రమున, హరిశ్చంద్రనలోపాఖ్యానమున నప్రాధాన్యము, దొలిరచనము నగు నరసభూపాలీయమున, హీనకులసూచకంబగు 'భట్టుమూర్తి' నామమును నతడు చెప్పక విడిచెననియు, కావున మూర్తి, భట్టుమూర్తి, రామరాజభూషణుడు అను నతడొక్కడై, గ్రంథత్రయకర్తయై "ఏకమేవ, అద్వితీయం బ్రహ్మ"గ వెలయుచున్నాడనియు బిగువువారుల సిద్ధాంతము. కాని సౌశీల్యమని, వ్యాఖ్యాతభావమని చెప్పుటకే కాని, రామరాజభూషణుని రచనలనుండి వీరు అణుమాత్రము నివ్విషయమున నాధారమును జూపజాలరు. వసుచరిత్రమునతారీకనుండియు, హరిశ్చంద్రనలోపాఖ్యానమునుండియు మన మివ్విషయమున సత్యము లభింపగలదేమో తెలిసికొందము.

## రామ, రాజ-భూషణుల సన్నిహితత్వము

సూటిగ రామరాజునుగూర్చి భూషణుడు రచించిన వాక్యము గాని, పద్యము గాని యింతదనుక మనకు లభించలేదు. రామునితమ్ముడు, వసుచరిత్రకృతిపతి యైన తిరుమల దేవరాయలు రామరాజభూషణుని రావించి—

"శ్రీరామక్షితిపుణ్ మదగ్రజు జయ
శ్రీలోలు నానాకళా
పారీణుణ్ బహుసంస్కృతాంధ్ర కృతులం
బల్మారు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయ వే
దండాగ్రహారాది స
త్కారం బందితి రామభూషణకవీ
ధన్యుండ వీ వన్నిటణ్."

అని ప్రశంసించెను. ఇందలి రామరాజుసంబంధమును కవి తానుగ జెప్పక తిరుమలుని నోట బలికించుటలోని చమత్కారము గమనార్హము. అతడు దనను గూర్చి చెప్పుకొనలేదు గావున నటు లొనర్చెనని తలంతుమా? వలనుకాదు. ఈ పద్యమునకు బైన నన్న పద్యములో గవి—

"నను శ్రీరామపదారవిందభజనా
నందుఁ జగత్ప్రాణ నం
దన కారుణ్యకటాక్షలబ్ధకవితా
ధారాసుధారాశి సం
జనితైకైకదనప్రబంధఘటికా
సద్యశ్శతగ్రంథ క
ల్పను సంగీతకళారహస్యనిధి బి
ల్వం బంచి పలెక్కఁ గృపఁ"

అనుచు దననుగుఱించి, తన ప్రజ్ఞనుగుఱించి ముచ్చటించియున్నాడు. అతని పేరునే తొలగించి శిరోధార్యము కాదగిన బిరుదమే లక్షించియుండినచో నిచట చెప్పక పోవుదుమునా కవీశ్వరుడు? అది కేవల మసత్యము. కావున దిరుమలరాయుని వాక్యములుగ జూపించియున్నాడు. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి యితని కృత్యంతము నరసితిమేని రామరాజభూషణు డొక మహానుభావు డనియు, గవిమాత్రుడుగ దలంప వీలులేనివా డనియు దెలిసికొనగలము. ఇతడు కృష్ణరాయని కాలమున విద్యార్థియైయుండి, పెద్దనశిష్యుడుగ నున్న కారణమున రాయల యాస్థానికి వచ్చుచు బోవుచుండు నభ్యాసము గలవాడును, రామరాజునకు గృతిపరిచయుడును నగుట, రామరాజు పెత్తనమునకు వచ్చి రామరాజభూషణునికి యే యల్పసత్కారమునో యొసంగి సంభావించినవా డగుట, నతనిని దన సారస్వతజీవిత ప్రారంభకునిగ దలంచి మహాకవి కృతజ్ఞత నెఱపి యున్నట్లు తిరుమలుని వాక్యములును, హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి "రామవిభుదత్తప్రభచిహ్నవిభవయుతుడ" ననుమాటయును స్పష్టమొనర్చుచున్నవి. కృష్ణరాయని యనంతరము పరిపాలకులైన యతని సంబంధులందఱును కవి కావ్యసంబంధమున గృష్ణరాయని మేలుబంతిగ జూచికొని తామును నటుల గవిజనాదరణ మొనర్చి కావ్యముల నంకితములుగ గొనిరి, కాని రాయలను బోలిన సాహిత్యానుభవరసికులు గారని వసుచరిత్రకంఠోక్తిగ జెప్పుచున్నది. అందును రామరాయ లతి క్లిష్టసమయమున నధికారము వహించెను. తురకల దండయాత్రలు, దేశమున నల్లకల్లోలములు, సామంతుల కుట్రలు, రాజధానీనగరమును మార్చుట, ఇటు లెన్నియో విషయము లతని బుద్ధి నాక్రమించి యస్తిమితుని గావించి కలచి వైచినవి. కావున దిరుమలదేవరాయని ముఖమున రామరాయల గొప్పను గౌరవార్థముగ, గృతజ్ఞతాసూచకముగ, వారి వంశమర్యాద ననుసరించి, కృష్ణరాయలకు నల్లుడు మహావీరుడు నగుట, కవీశ్వరుడు దాను వ్రాసి యామాట లతిశయోక్తు లగుట నతని తమ్మునిచేత జెప్పించ వలసివచ్చె. రామరాయలకు నిజముగు మానసిక విశ్రాంతియే కలిగియుండినచో నతడు రాయలను మించిన భాషాపోషకుడై, రసికవతంసుడై, కవిజన పోషకుడై భాషాసేవ నాదరించియుండువాడు. ఆతడు వసుంధరాభారము నుద్ధరింపవలసివచ్చుట చరిత్రము మాఱినది.

రామరాజు వసుచరిత్రమున ఆఱు పద్యముల నదే వర్ణింపబడియున్నాడు. అందలి యర్థము నీ దిగువ నుదాహరింతును. (వసుచరిత్ర, ప్రథమాశ్వాసము)

"అని శ్రీరంగరాముడై యవతరించెను" (ప. ౪౩)

పట్టాభిషేకసాత్త్వికము ; తమ్ములతో పెనుగొండ జేరుట; సకలము తిమ్మనినిధ ; కర్ణాటవిభవసంస్థానము; శరణాగతుల బ్రోచుట". (ప. ౪౪)

"నిజామాదుల నరణ్యమునకు బోదోలుట"(ప. ౪౫)

"తురుష్కుల మూలబలవినాశము జేయుట"(ప. ౪౬)

"శత్రుజనసేవితుడై కల్యాణమును గొనుట"(ప. ౪౭)

"రామరాయలపేరు విన్నంతమాత్రాన నిజామాదులు జెదరుట" (ప. ౪౮)

ఇంతమాత్రము లక్షించుచున్నది. ఈ ఘట్టమున గవి రామరాజును అతిరథ, మహారథశ్రేష్ఠుడుగా లోకము దెలిసికొనునట్లు సన్నుతించియున్నాడు. లోకకల్యాణ మొనర్చి లోకకంటకుల మొదలంట గూల్చి శ్రీరామచంద్రప్రభువుతో రామరాజభూషణుడు రామరాజును పోల్చి శ్లేషాదికములచేత నతని లోకరక్షాధురంధరత్వమును, శత్రుభయదపరాక్రమ సాహసాదికములను జక్కగ వ్యక్తపరచెను. సాహితీప్రియు డనిగాని, కళాభిజ్ఞు డనిగాని, కవిపండితపోషకు డనిగాని, కవితామధురిమ డెందమునకు దవులు నలవాటు లున్నవాడుగగాని విద్వద్వ్యవహారరంగసన్నివేశ సంప్రదాయాభిమాని యనిగాని, దానధర్మములు చేసిన వాడుగగాని, బిరుదము లొసంగి కవుల సహజనామములు తొలగించిన యభినవబ్రహ్మ యనిగాని రామరాజు రామ

రాజభూషణునిచేత గొనియాడబడలేదు. తుద కారీతి సూచనయును చేలేదు. ఒక్క వసుచరిత్రమును కృతి బొందిన తిరుమలరాయని, వాని తనయులలో ముఖ్యముగ శ్రీరంగరాయ, వేంకటపతిరాయలను వివిధాలంకారముల రచించిన పద్యములతో, ఉదాత్తభావములతో గొండాడెను. 'వసుచరిత్ర' గ్రంథమునకు ప్రాముఖ్యము నిచ్చి తరువాత బుట్టిన శ్లేషకావ్యమున దాని పేరు జెప్పెను. అట్టివాడు రామరాజును "బహుసంస్కృతాంధ్రకృతులక్" బల్కాలు మెప్పించిన ప్రోష యగు నేని తత్కృతుల నొక్కదానినిగాని, కనీసము మెచ్చినవాని కావ్యరసగ్రహణమై పుణ్యమునుగాని, పుట్టుపేరు మాసిపోనిచ్చిన యపూర్వబిరుదమునుగాని కవి చెప్పకుండుట విచార్యము. చెప్పదగిన దా వింతటి కంటె నింకొకటి కాదు. శ్రీ కృష్ణరాయలు పెద్దనను "ఆంధ్రకవితాపితామహుడ"వని సంబోధించినటుల నతడు వ్రాసెను రాధామాధవమును రచించి కృష్ణరాయలచే "రాధామాధవకవి"యని పిలిపించుకొనిన చింతపూడి ఎల్లన యొక డున్నాడు ఇతడును దీనిని జెప్పుకొని యున్నాడు. వీరిలో నొకడును తండ్రి యొసర్చిన నామకరణమును దుడిచిపెట్టుకొనలేదు. ఇక దనకు బూర్వము గల బిరుదధారులనువా రందఱు బిరుదములను, బిరుదప్రదాతల యోగ్యతలను, జెప్పుచు పేరులు యథాతథములుగ నుంచుకొనుట రామరాజభూషణు డెఱుగడా! తండ్రి యిడిన వ్యవహారనామమును ద్రోసి రాజనుటకు రామరాజభూషణు డెంతటి యుచితానుచితానభిజ్ఞుడా? ఎంతటి బట్టుసంశజుడైనను నింతటి పౌరుషహీనకృత్యమున కొడిగట్టి కవులలో దలయెత్తి తిరుగగలడా! అక్షజనగర్వాంధులను కవు లెందఱో సమకాలికులుగ నుండిన రామరాజభూషణుడు వారిచే దన చరిత్రమున నిరంతరరంధ్రాన్వేషణము గావింపబడుట నెఱింగిన, రామరాజభూషణుడు తండ్రిపెట్టిన పేరు మార్చుకొని, పరు లిడిన బిరుదమే పేరుగ స్థాపింప బూనినచో, గాకులు పొడిచినట్లు లోకులు నిందింతురని తెలియని యవివేకి కాడుగదా? ఎన్నియో తప్పుడు (ఫోర్జరీ) పద్యము లతనిగూర్చి వ్రాయబడినవి కలవు. అందొకటనేని దీనినిగూర్చి యెత్తిపొడుపు, ఎగతాళి జరుగదా? సాధారణముగా సగోత్రీకునుకూడ దత్తహోమము జేసికొనినగాని దత్తునిపేరు మార్చరే! ఒక గ్రంథము గొని సామాన్యముగు బహుమతి నొసంగి రాజు పేరు మార్చుట, కవి దానిని ధరించుట—ఇది నుడువను, తలపనుగూడ నేహ్యమగు నంశము గాదా! వాస్తవనామ ముండి యందుపై బిరుదముగూడిన నది రాణించునుగాని బిరుదమే పేరైనచో నిక దాని యోగ్యత జెప్ప బనిలేదు. అటుల బల్కుట రామరాజును, రామభూషణుని నిందించుటయే యగును. రామరాజునకు దనకు గల సంబంధమునుగూర్చి ముచ్చటించవలసినచోట దాను తిరోహితుడై, నాలుగుమాటలు తిరుమల దేవరాయనిచే ననిపించి, వంశావతారికయందు రామరాయని కేవలయోధునిగ జూపి, రామరాజుచే దాను గొన్న తృణమును మేరువుగ గొనియాడి, యొక్క సీసపాదమున హరిశ్చంద్రనలోపాఖ్యానమున జెప్పి రామరాజభూషణుడు దన విధిని నిర్వర్తించియున్నాడు. రామరాజభూషణుడు రామరాజుపై జెప్పినవి కొన్ని చాటువులు. "బహుసంస్కృతాంధ్రకృతులు" అతిశయోక్తి. బిగుదప్రదానము అని తలంచుట ప్రమాదము. ఏ సాధారణమగు బహుమానమునో, లేక బహుమానములనో పొందియుండుట నిజము. తుదకు ఏనుగు, అగ్రహారము గూడ సన్మానింపదగినవే. ఏలనన, రామరాజు, తిరుమల రాజు వితరణలు కవికి కడుపు నింపించి శాంతి గూర్పజాలని వని ముందు దెలియగలదు గావున. ఈ కారణము లన్నిటినిబట్టి రామరాజుతో రామరాజభూషణున కత్యల్పమగు సంబంధముమాత్రము గల దనియు, రాయల యనంతరము రామరాజు విఖ్యాతపరిపాలనాదక్షు డగుట నతని సంబంధ మించుక గల దని సూచించుట గౌరవసంపాది యనియు, మహావీరుడగు రామరాజు ముందు తన జీవిక కాధారభూతు డగుట, అందును దనకు బ్రథమాశ్రయుడగుటను కవి తా నేవియో చాటువులు రచించి, తనమూలమున రామరాజుచే నార్జించిన స్వల్పములను ఘనములుగ జాటించి, రాజుకు దనకును గల సంబంధమును బ్రకటించెను. వంశావతారికయందు రాజరాజును పదుగురలో పదునొకండవవాడుగ జూపెనే కాని తన కెక్కువ చనవు, పరిచయము గలవానినిగూడ రామరాజభూషణుడు జూప తెలియకుండ జేసెను.

ఇట్టి ఘటనవలన రామరాజు నరసికు డని చెప్పినటుల భావింపరాదు. ఇతడు మామను మించిన యల్లుడు. అయిన నేమి ఫలము. రాయలకాలమున గల దేశకాలపాత్రములు రామరాజుకాలమున మాఱిపోయినవి.

ఇతనికి సంగీతసాహిత్యములలో గాలము గడపు నవకాశములు లేవు. కావుననే రామరాజునకు లభించి యాచంద్రతారకము రహింపదగు కృతిసంతానము తిరుమల రాయలకు లభించినది. రామరాజు నిరంతర దేశరక్షణ దీక్షాధురంధరుడై రాజ్యమున బర్యటనములు సేయుచు, శత్రునిగ్రహమార్గముల నన్వేషించుచు, ఆత్మీయ సౌఖ్యత్యాగముగూడ నొనర్చి దేశశాంతిస్థాపన కార్యము నొనర్పవలసినవా డయ్యెను. వర్తమానమున శ్రీ జవహర్‌లాలు నెహ్రూగారికి పాటకచేరీలలోను, సాహిత్యవినోదములలోను బాల్గొని యానందించ నవకాశ మున్నదా? క్షణము తీరిక గలదా? ఇటువంటి బాధ్యతయే యానాడు రామరాజు తలపై బడెను. కావున రామరాజ భూషణుడు అతని సంస్థానము నాశ్రయించి యుండి యిచ్చినదానితో దృప్తి వహించి, రామరాజు కాలమున రోజులు గడపి తిరుమలరాయనిరోజులలో నించుకంత స్థిరతరజీవితము లభింప కృతి బ్రారంభించి యారాజున కంకిత మిచ్చెను.

## బిరుదు కాదు - పేరే

వసుచరిత్రవ్యాఖ్యాత సోమకవి. ఇతడు, "మూర్తి, భట్టుమూర్తి, రామరాజభూషణుడు" అని వ్యాఖ్యానప్రారంభమున, గ్రంథమున వ్రాసెను. పేరునకు, బిరుదునకు వివరణ తెప్పక నన్నిటిని జోడించెను. అవి యివి :

> "ఈ రీతిం గవితావితానవృత గౌ
> రీశానమౌళిస్థలో
> దారోద్దేశవిశేషనైన నాకు వెస వి
> ద్యాకాంతు లెల్ల న్మనో
> హారిప్రక్రియ మూర్తిచేత రచితం
> బై విశ్రుతం బౌ వసు
> క్ష్మారాట్చిత్రచరిత్ర మేకయియి, యు
> త్సాహంబు పుట్టించినన్."

కారణజన్ముడై కవి ని

> "కాయము మెచ్చగ గావ్యకర్తయై
> భూరికళాకలాపుడవయి
> వాల్పువహించిన బట్టుమూర్తిచే
> నీరితిమై సుఖార్థమగు
> హీనపదాస్పదమైన యా వసు
> క్ష్మారమణప్రవృత్తము సు
> సాధ్యము గాదు తలంచిమానుడీ."

తొలుత నిట్లు వ్రాసిన సోమకవి వసుచరిత్ర ప్రథమాశ్వాసము ౧౭ వ పద్యమున కర్థము వ్రాయుచు రామరా జిచ్చినట్లు తిరుమలదేవరాయలు చెప్పిన—

> "పత్రాగ్ర్యాంబుప రత్నహారహయ వే
> దండాగ్రహారాది స
> త్కారం బందితి రామ
> భూషణకవీ"

అను వాక్యములకు—

"అతని దయచేత, రత్నహార=మణిహారములును, హయ=గుఱ్ఱములును, వేదండ=ఏనుగులును, అగ్రహార=అగ్రహారములును=, ఆది=మొదలుగాగల, సత్కారంబు=బహుమానమును, అందితి=పొందితివి, రామభూషణకవీ=రామభూషణనామధేయము గల కవీ"

అని వ్యాఖ్యానము వ్రాసెను. ఇందలి నామధేయార్థ మెయ్యది? ఎవరు పెట్టినది? బిరుద మేది? సోమకవివాక్యములు ప్రమాణము లని విమర్శకులు నిర్ణయించుకొనిరి. ఆ కాలమున నిట్టి వివాదములు లేని కారణమున విన్న మాటలను స్వంతపద్యములలో జేర్చి ఉన్నదాని నున్నట్లు వ్యాఖ్యాత లిఖించెను. సోమకవి స్వీయవాక్యములకు బల మున్నదా? కవివ్రాతకు బల మున్నదా? ఏది యథార్థము. జనశ్రుతినిబట్టి, తన విమర్శనాధారములు లభింపని కారణమున, చరిత్ర చర్చావిశేషములకు బ్రాధాన్య మిచ్చుట యపుడు లేని హేతువునుబట్టి సోమకవి యట్లు వ్రాసెను. మఱియు పూర్వపు వ్రాతలకు బ్రాధాన్య మిచ్చుచున్న మనము సోమనకు బూర్వమున గల అప్పకవివ్రాతనే మనవల యును! "నా పేరు రామరాజభూషణుడో" యని యతడు చెప్పుకొనుచుండ "కావచ్చును, నీవు మూర్తివి, భట్టుమూర్తివి, తరువాత బిరుదుపొంది పేరుమార్చుకొన్నాడు" వనుట పరిహాసభాజనము. రోడ్డ విజ్ఞానము, విమర్శనాజ్ఞానము, పరికరములు అలవడియున్న నాగరికకాలములో నున్న మనమే, యింకను జనశ్రుతులను నమ్మిన హేతువుచేత సత్యార్థములు దెలియవచ్చినను విశ్వసింపకున్నాము. పోతన "బంటిపట్ట, ఒరంగల్" నివాసము, "భద్రాచల

రామదాసు - కబీరు" ఉపదేశము. వాసుదాసస్వాములును, రాఘవాచారిగారును తర్కవాదు రనుటకు, విమర్శ, చరిత్ర తెలియనివా రనుటకు నెవనికి వెఱపు గలుగదు? నాగరకయుగమువారము మనమే యిటుల నమ్మకములతో సంతే నైతిహ్యములను నమ్మి సోమన వ్రాసిన వ్రాతను ప్రమాణముగ గొనుట విరుద్ధము. వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములకంటె సోమన, ఆంధ్రకౌముదివాక్యములు ప్రబలములు గావు. వాచనాపటిమకై వాని నడ్డుట ప్రయోజనరహితము. కావున రామరాజభూషణు డనునది పేరే. బిరుదు కాదు. సోమనవాక్యములకు, కవివాక్యమునకు నదుకు కుదర లేదు. పరస్పర విరుద్ధములు.

ఇవకు గ్రంథముఖపత్రములా దిక్కు?

అవి దొంక తెలియన లేవు. ముద్రాపకుల, పరిష్కర్తల యభిప్రాయముల బట్టి యవి ముద్రింపబడినవి. నాకడ గల వసుచరిత్రము ౧౯౦౩ లోనిది. పిడ్దన ప్రాడి సంజీవయ్యగారిచే ముద్రింపబడినది. దాని ముఖపత్రమున "శ్రీరామరాజభూషణకవి ప్రణీతంబయిన వసుచరిత్రము అను నాంధ్రకావ్యరత్నము" అనియున్నది. దాని ప్రక్కపుటయందు "భట్టుమూర్తి నామాంకుండ నగు రామరాజభూషణకవీంద్రుండు" అనియున్నది. దేని కిచట ప్రామాణ్యము. పరస్పర విరుద్ధములగు నిట్టి వ్రాతలబట్టి కవివ్రాతను, అభిప్రాయములను దలక్రిందొనర్చుటలో సారస్యము గనరాదు. రామరాజభూషణునకు దరువాత కొన్ని యేండ్లకు రచింపబడిన 'నరపతివిజయము' రామరాజు గొప్పనే చెప్పుచున్నది. రామభూషణుని ప్రమేయమును జెప్పుచున్నదా? బిరుద మిచ్చినటుల, భట్టుమూర్తిని రామరాజభూషణుని జేసినటుల దాన గలదా? కరతలామలకముగ జరిత్రము రచయితగ్రంథములవలన నవగతమగుచుండ శిలాశాసనములు, గ్రంథాంతరములు నిదర్శనములను జూపి చర్చించుట యర్థస్థానము కానేరదు. గ్రంథస్థములు ప్రమాణములు గన్పట్టుచుండ నైతిహ్యములతోను, దదాధారములతో రచించు రచనలతోను బ్రయోజన మెయ్యది? అట్టివి లభింపని నాడైతిహ్యములే దిక్కగుట తప్పదు. కావున నవ్విషయమున నైతిహ్యము లుపకరింపవు.

ఇతడు తిట్టుకవియా?

ఎన్నడును కానేరడు. రామరాజభూషణుడు చక్కని వివేకము గలవాడు. వినయము జూపువాడు. అందుచేత నతనికాలముకవు లెవరును జెప్పని "సనాతనాఘనాతనాఖిలమహాకవిజనానుగ్రహంబున" అని యగునాతనకవులనుగూడ బ్రశంసించియున్నాడు. తానెంత గౌరవముగలవాడైనను, పండితుడైనను, జాత్యహంకారులను సంకుచితహృదయులు తూలనాడుదు రను నభిప్రాయ మతనికి లేకపోలేదు. అట్టివారి వినయవిధేయతల జూచిరైన బుద్ధిగలిగియుందురు గావుత మనియే లోకదృష్ట్యా యతడు వ్రాసియున్నాడు. తాను "శాపానుగ్రహశక్తియుక్తుడ"నని యితడు ప్రతిజ్ఞ చెప్పలేదు. ఎక్కడినుండియో "లొట్ట యి నేటి మాట" పద్యమును గొనివచ్చి దానిలో "రట్టడి భట్టుమూర్తికవి" యుండుట బట్టి యీ మాలిక యితడే కర్త యని, ఆ భట్టుమూర్తియే రామరాజభూషణు డనియనుట సత్యదూరము. ఆ పద్యకర్త యెవడో 'రట్టడి.' అటుల దన నెన్నడును రామరాజభూషణుడు హేయముగా జెప్పుకొనడు. అతడు వ్రాసియుంచిన స్వీయచరిత్రసంబంధములగు పద్యముల నతని గ్రంథములలో జూచిన నట్టి రట్టడివాడిత డనుట అపచారమగును. దేశద్రిమ్మరులగు భట్టు రచయితలు, ధూర్తులానాటినుండి నేటివరకును జాల మంది కలరు. భాషాసంబంధజీవనులగు నట్టి భట్టులందరును 'భట్టుమూర్తు' లనుచు బిలుచు నలవాటు తెనుగుదేశమున క్రొత్తకాదు. అన్ని చాటువులకు, బూటకములకు భట్టుమూర్తి నొక్కనిని గర్తగ జేసి, అతడే రామరాజభూషణు డనుట నిరాధారమగు పొరబాటుమాట. ముఖ్యముగ కృష్ణరాయని కింపక ముందునుండియు, సుంటపల్లి భాస్కరుని దనుక నిట్టి సంచారులగు భట్టుకవులు పెక్కురు గలరు. అట్టి భట్టుపద్యముల గొన్నిటి జేర్చి యందు రాయల పేరుంట గమనించి రామరాజభూషణుడు రాయలచే బహూకరింపబడె ననియు, కావున నతడు అష్టకవులలో నొకడనియు సాధింపజూచుట సకారణము కాదు. ఇతడు తిట్టుకవీ, దీవనకవీ కాడు. ప్రబంధకవి. నరసభూపాలీయకర్తగ జేయుటకు, కృష్ణరాయనిసభలో జేర్చుటకు నీ మహాకవిచరిత్రము నిన్ని గంద్రగోళములలోనికి దింపుట శ్రమహేతువు; సత్యదూరము. ఇవ్విషయములను, కవిత్వపు పోలికలను

నిచట జర్చించుట గ్రంథవిస్తరహేతువు. ఒకటే గమనింపవలెను. రామరాజభూషణుని విద్యాతిశయము గాంచి యసూయాపరులై యతని కొందఱు తక్కువ పర్ణము నాధారముజేసికొని లోకువగ నెన్నియో కదంతులు లోకులు గల్పించిరి. పద్యములు కెక్కించిరి. అవి లోకమున వ్యాపించినవి. 'బట్టుమూర్తి' మాత్రము గాదు, 'బట్టువాడ' యనియు నొక యైతిహ్యములో బ్రహ్మశ్రీ శాస్త్రులుగా రుదాహరించిరి. బట్టువా డను నది మనము పేరని అనలేముగదా! ఈ కాలమునగూడ బాపనపంతులు, కిరస్తానిపంతులు, బాపనపంతులమ్మ, సాలెపంతులమ్మ, సెట్టిసిద్ధాంతి, కమ్మశాస్త్రులు, కమ్మ బ్రాహ్మడు, నాయిబ్రాహ్మడు" అను పలుకుబళ్లు వ్యాపించి యుండుట మన కనుభవములో నున్నది. వీ రందఱకు పేర్లివే యనుట తగవు కాదుగదా. ఈ రీతిని పూర్వులు పండితులనుగాని, కవులనుగాని, లెక్కింగల పెద్దలనుగాని కులసూచకము మాటలను వారివారి ప్రజ్ఞా విశేషములకు, వృత్తులకు జేర్చిపెట్టుటలననే నేడు మనకు నలవడినవి. ఇట్లగుటవలన రామరాజభూషణుడు భట్టువంశజు డగుట, మర్యాద తెలిసినవారు గౌరవసూచకముగ 'బట్టుమూర్తి' యనియు, సామాన్యులు, నసూయాపరులు 'బట్టువాడు, భట్రాజు' అనియు బిలువసాగిరనుట సమంజసము. దానినే పేరనుచు మనము వాదించుకొనుట లోకాచారమునకు, సంప్రదాయమునకు గూడ జాల దవ్వగు మాట. ప్రకృత మనుసరింతును.

## స్వభావము

వసుచరిత్రమున నితడు "శ్రీరామపదారవింద" యను పద్యమునను "అధునాతినాఖిలమహాకవు"లను వాక్యమునను, దన దైవభక్తిని, సమకాలికులయెడ నడకువను బ్రకటించెను. ఇవి యతని సహృదయతను దెలివిడిసేయుచున్నవి. వసుచరిత్రవ్యాఖ్యాత రామరాజభూషణుని "కారణజన్ము" డని ప్రశంసించి యతని యసదృశసాహితీకళావైభవమును మెచ్చియున్నాడు. ఈ వ్యాఖ్యాత శ్రీమత్పార్వతీరాజేశ్వరవరప్రసాద సమాసాదితహృద్యానవద్యనిఖిలవిద్యావిశారదుడు."

హరిశ్చంద్రనలోపాఖ్యానవ్యాఖ్యాత" 'చిత్రకవి' అనంతాఖ్యు' కవి. ఇతడు లక్షణసారసంగ్రహకర్త. మూలగ్రంథకర్తను బోలి యీ వ్యాఖ్యాతయు "శ్రీహనుమద్వరశ్రీలబ్ధసుకవిత్వచతురుడు". ఇక హరిశ్చంద్రనలోపాఖ్యాన, వసుచరిత్రల గ్రంథకర్తయు దన యుదంతము నెటుల శ్లేషగ్రంథమగు ద్వ్యర్థిప్రబంధమున వెల్లడించి యున్నాడో వివరించి యథార్థము నరయ బ్రయత్నింతము.

"కనదభిలంఘనకృపాకనిత్యో భయకవి
 తాకళారత్నరత్నాకరుండ
సకలకర్ణాటరత్నాభరణాంచరరామ
 విభుదత్తభృచిహ్నవిభవయుతుండ
వసుచరిత్రాదికావ్యప్రేతబహునృప
 ప్రాపితానేకరత్నస్తవుండ
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహ
 నిరుపాధికైశ్వర్య నిత్యయశుడ;
శ్రీకరమహాప్రబంధాంక సింగరాజ
తిమ్మరాజప్రియతనూజ ధీరమూర
పాత్రభూష రామనృపభూషణాఖ్యసుకవి
నంకితము మొనర్తు నీకావ్య మనఘభక్తి."

(హ. న. ప్ర. ఆ. ౨౩.)

నిరహంకారపాండిత్యమండితుడగు నిక్కవి కేసరి తన జీవికము దైవమునకు, రాజునకు నంకితము మొనర్చి స్వీయచరిత్రము సమగ్రముగ నిందు జెప్పియున్నాడు. ఈ సీసమునందలి "...భృచిహ్నములు" వసుచరిత్రమునందలి "శ్రీరామక్షితిపుత్ర"అను పద్యమున దిగుమలదేవుడు ప్రసంగించినవే. ఆ వాక్యము లకు సోమన అర్థము జెప్పియుంట దైన జూచితిమి. దీనిని నరసభూపాలీయమున మూర్తికవి వ్రాసిన సీసము నందలి "సభమూర్తి నామధేయ"మను వాక్యముతో జోడించి దాన, దీన రెంట 'సభ' శబ్దమున్నది గావునను, ఈ శబ్దము రామరాజిచ్చిన చిహ్నముల విశేషణము గావునను, ఇయ్యది "మూర్తినామధేయము" అనుదాని కంటువడియుండెగావునను, ఈ "మూర్తి బట్టుమూర్తి" యనుట సంశయింపరాదనియు, ఈ '...భృచిహ్న' మను దానినే యతనికి రామరాజిచ్చిన 'రామరాజభూషణు' డను బిరుదము, నటులనతడు సంకేతించియున్నా డనియు, అందుచేత మూర్తి, బట్టుమూర్తి, రామరాజభూషణు లనున వొక్కవ్యక్తిపేరనియు మనమూదలచుట న్యాయసమ్మతము గాదు. అసంగతము. అపసవ్యము. అటులేని నరసభూపాలీయ రచనమునకు బిమ్మట రామరాజు నాశ్రయించెనని కొద్దిలు కొందఱు సెలవిచ్చుచున్నారుగదా.

ఆరాజిచ్చిన బిరుద మీ 'సభ'ము ఈ నరసభూపాలీయమున నుంచె గారణము? దీనిని తిరము గావింప నరసభూపాలీయము ప్రథమమునియు, కాదు ద్వితీయమనియు మఱియొక సమస్య. నరసభూపాలీయకర్తృత్వము నీరీతిగ స్థాపించి, పదపడి భట్టుమూర్తి యనునది పేరని రూఢి జేసి 'రామరాజభూషణు' డనునది బిరుదముగా స్థిరపఱుప నిన్ని వంకతిరుగుళ్లు అనుసరింపవలసివచ్చెను. సహేతుకవాక్యముల బ్రత్యక్షప్రమాణములు జూపి "రామభూషణకవి" "రామనృపభూషణాఖ్యసుకవి" యని యతడు వ్రాసిన మాటల నతని మాటలతో పూర్వపక్షము జేసి పరస్పరవైరుధ్యమును వెల్లడిగ మనము దెలిసికొనగలిగినవాడు మన మీపై నుదాహరించిన సీసపద్య వృత్తాంతమును నిరసించి యిమ్మహాకవిని యనృతవాదిగ నొనర్తుము. పోలికకవిత్వము, ఒకేపద్యముభయగ్రంథముల నుండుట నింకొకపరి చర్చింతము. ఇట్టివి చాల గలవు. ఇవి కొరత మనరాదు. కులగోపన మొనర్చ పేరు వాడుటకు వెనువెంట తన కావ్యముల నర్పించిన బిరుదమునే నామధేయముగ గ్రహించెననుట రామనృపభూషణుని అపరాధసిద్ధాంతమున, ప్రత్యక్షప్రమాణరహితమగు తర్కమున గళంకియని సిద్ధాంతమొనర్చుటయే గదా! నేడు గదా పాపమువంటి, ఉద్యోగములకు, నడుగరలకు, స్వీయలాభములకు, మిథ్యాగౌరవములకు, నిష్పక్షపాతు డని నిరూపించుకొనుటకు, కులము పేరును, శరీరమిచ్చిన తండ్రి పేరును దాచి, దాంభికవర్తనమున కలవాటుపడు నవస్థ ప్రారబ్ధదేహధారులకు సంప్రాప్తమైనది. ఆత్మగౌరవము, కులగౌరవము లేనివా డని రామరాజభూషణుని మన మనుట ఈ కాలపు విరుద్ధపద్ధతుల నాశ్రయించి పూర్వుల గుణదోషముల బరీక్షించుటగాక మఱియొకటి యగునా? పేరును బిరుదని చెప్ప విమర్శకులలో ప్రథమ గ్రంథనిర్ణయసందర్భమున మఱల మతభేదములా? ఇందు నిమిత్తమాత్రయుల, ఇష్టదైవములగూడ, సంఖ్యయందు పెంచుటా? మార్చుటా?

రామరాజభూషణుడు శ్రీరామమంత్రోపాసకు డగుట చాల సహజము గలిగి గర్వము, అహంకారము నెఱుంగని ప్రశాంతహృదయము గలవా డని హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి యుపోద్ఘాతపద్యములు చెప్పుచున్నవి. మఱియు నతడు దన పంచావతారికాది గ్రంథవిస్తరముతో బుటలు నింపక సంగ్రహపఱచి యా భాగమంతయు శ్రీరామపరముగ జిత్రించియున్నాడు. అతడు శ్రీరామచరణసేవాపరతంత్రుడు. శ్రీరామభక్తుడు. శ్రీరామునియందు గల యవ్యభిచారిణి యగు స్వీయభక్తితత్పరత్వమును వెల్లడించియున్నాడు. ఇవ్విషయమున నతని భావ మొకటి జూతము.

"ఆత్మజనకు డాశాంతరసావలంబ
మునకు శాంతరసావలంబనకు బరాచు
నెపెల నేకగుణస్ఫూర్తి నెపలనుండె
రాము డాకారవిక్రియారహితు డెందు."

(హ. న. ౧ ఆ. ౨౫.)

ఇటుల శ్రీరాము నుపాసించు నీ భక్తకవిస్వభావము, అంతరంగశుద్ధి నెంతని నుతింపగలము? శ్రీరామ మహిమాతిశయము నీ క్రిందిపద్యమున జెప్పెను:

"అజభవప్రీతిగా నఖిలమంగళమహో
విఖ్యాతి గాంచిన విష్ణుమూర్తి
విమలస్మృతిసభోదయముగా జతుర్వ్యక్తి
విభవంబు బూనిన వేదమూర్తి
భువనచైతన్యసంభవముగా నిశిచరి
ఘాతియైన శుభప్రకాశమూర్తి
గురుసత్క్రియాఫలస్ఫురణగా నతుల ధా
ర్మికరూఢి వెలసిన సుకృతమూర్తి
పతికృతాఖిలశాపమూర్ఛితముని ప్రి
యా పునర్జీవన మొనర్చు నమృతమూర్తి
శ్రీరఘూత్తము డతని చారిత్ర మరిది
పుట్ట బుట్టువులకు గాక బొగడదరమె"

(హా. న. ౧ ఆ. ౧౯)

వసుచరిత్రమునవలెగాక శ్రీరామాంకితమగు హరిశ్చంద్రనలోపాఖ్యాననాందీపద్యములు అన్నియు శ్రీరామసంబంధమున గూర్పబడినవి. శ్రీరామ, సీతా, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులను, ఆంజనేయుని, శ్రీమద్రామాయణరచయిత ప్రాచేతసుని, శ్రీరామకథారచయితలగు నీవలి కవులను సంస్తుతించెను రామరాజభూషణుడు. అనంతరము "అని యిష్టదేవతానమనమంగళసమాచరణంబును—" అను చిన్నవచనమును వ్రాసెను. ఇక్కడికి "ఇష్టదేవత శ్రీరాము"డని యీవాక్యము దృఢపఱచి దేవతాంతరము లేదని రూఢిజేసినది. ఆంజ

నేయస్తుతిని వ్యాజముగ గొని శ్రీరామభక్తుని శక్తి నిటుల జాటించె నీ యనఘుడు :

"రామభక్తునకు భారమె ఘోరపంకాబ్ధి
తరణపాటవ మన శరధి దాటి
రామభృత్యున కరుదా మృత్యునిరసనం
బన మహౌషధాద్రిగ్రహంబు జేరి
రామకింకరున కబ్రమె రమాసాన్నిధ్య
మన విదేహాధిపతనయ గాంచి
రామైకమతికి జిత్రమె పాశవిగళనో
పాయం బన నజాస్త్రబంధ మెడలి
రామపరతంత్రునకు దుర్భరంబె విలయ
వహ్ని యన వాలశిఖిశిఖావ్యాప్తి నోర్చి
యరిపురం బేర్చిన నజేయు నప్రమేయు
నాంజనేయు మునిస్తుత్యు నభినుతింతు"

(హ. న. ౧ ఆ. ౬)

"సర్వధర్మాన్ పరిత్యజ్య" యను భగవద్వాక్యమును నమ్మి, మననశీలుడై, చిత్తప్రసాదము లబ్ధము కాగా శ్రీరామకింకరుడై తరించినవాడీ కవికులాలంకారుడు. తనను "కవిత్వనిధిలాభధన్యు జేసి బ్రోచిన యంజనా నందనుడు" కల గన్పట్టి—

"సుతుల బెక్కండ్ర శాశ్వతరామనామ ధ
న్యుల జేసి పిలుచు భాగ్యోదయంబు
రచితాగ్రహారంబు రామచంద్రపురాంక
పూతం బొనర్చిన పుణ్యరేఖ
నవదివ్యభవనంబు నమరించి శ్రీరామ
విభు బ్రతిష్ఠించిన విపులమహిమ
రామసరోనామరమణీయముగ దటా
కము వినిర్మించిన ఘనయశంబు
సఫలత వహించు నీ హరిశ్చంద్రనల క
థాయుగనిబంధచిత్రబంధప్రబంధ
మంకిత మొనర్పు రఘుభర్త కఖిలకర్త
కురుతరాభీప్సితము లెల్ల నొదవు నీకు"

(హ. న. ౧ ఆ. ౧౪)

అని యానతీయ దాను శ్రీరామాంకితముగ హరిశ్చంద్రనలోపాఖ్యానము రచించె నట. కలలో గూఢ శ్రీయాంజనేయమూర్తి "శ్రీరామభూషణా! వచశ్శ్రీరసపోషణా!" అనియే సంబోధించియున్నాడు. ఇచట నీకవి "శ్రీరామునకు, లేక శ్రీరాముని సఖుడు" గూడ భూషణము కంటెనా యని నిశ్చయింపవలె గాబోలు. దీనినిబట్టి రామరాజభూషణుడు సప్తసంతానముల జాలభాగము శ్రీరామార్పణముగ బ్రతిష్ఠించిన నిష్కామ కర్మయోగి యనియు, "ఇష్టాపూర్తము"లను నిర్వహించినవాడనియు తెలిసికొనగలుగుచున్నాము. పైనుదాహరించిన పద్యములలోని యర్థములవలన రామరాజభూషణుని స్వభావము, ప్రవర్తనము, బుద్ధిమదగ్రణులకు చేటతెల్లము గాకపోదు. స్వవిషయము చెప్పుకొనదగినంతమాత్రమె చెప్పెను. సహజపద్ధతి ననుసరించి యతిశయోక్తుల పొంత బోక దన విషయమును ముచ్చటించెను. డాంబికములు కలుగలేదు. కావున నితని కావ్యములు, కవనములవలె బ్రవర్తనయును ప్రత్యేక ప్రశంసకు జాలియున్నది. కవనము నుపయోగించి లోకుల బ్రుంగదెట్టు స్వభావ మితనికి లేదని యతని శ్రీరామభక్తియు, సంతానాదికసత్కార్యాచరణమును విశదము సేయుచున్నవి. ఇట్టిడు దైవస్వరూపులగు తలిదండ్రులు పుత్రవాత్సల్యమున బెట్టుకొన్న పేరును త్యాగము జేసె నంట పొసగని మాట.

## సుఖ జీవనము

వసుచరిత్రరచనానంతరమునగాని యీ రామభక్త కవికి శాంతియుతజీవనము లభింపలేదు. రామరాజు సభలాంఛనములు, తిరుమలరాయని యభిషేకములు నితనికి సంతృప్తి గూర్చియుండలేదు. నరాంకితముగ కావ్యరచన మొనర్చుట రామరాజభూషణునకు జాల బాధాకరముగ నేయుండెను. దానిని "కవివాగ్వ్యాపార" మని నిరసించి వ్యర్థపురుషులగూర్చి యర్థకల్పనములతో గొనియాడుట యనర్థమే కాని, యన్వర్థము కాదని తెగనాడి, యివ్విషయమున దాను బొందిన యీ వేదనమును ధ్వనింపజేయుచు వసుచరిత్రమునందే యీ క్రింది పద్యమును వ్రాసి, ఆ పద్యమునందు "గవివాగ్వ్యాపారము" న కర్హుడగు వదాన్యు నొకని జేర్కొని యున్నాడు.

"అతిధీరు డతిదానశూరు డతిర
మ్యాకారు డత్యంత సు

ప్రతుషించుందను సన్నుతించుకవి వా
 గ్వ్యాపార మెల్లన్ యథా
ర్థతమంబై విలసిల్ల దిర్మలమహా
 రాయేంద్రు శ్రీ వేంకట
క్షితినాథోత్తము డందు నిందుగతి గ
 ల్పించెన్ గవిశ్రేణికిన్"

(వ. చ. ప్ర. ఆ. ౧౩.)

కవుల సందర్భమున నింతటి మహోదాత్త భావమును, వర్ణనమును రామ, తిరుమల, దేవరాయల పరముగ నెచ్చటను రామరాజభూషణుడు వ్యక్తమొనర్ప లేదు. దీనిని బట్టి యాసోదరులు పేరుకు బెద్ద లైరేగాని, నిజముగ భాషాజీవనులగు కవులమనుగడకు బద్యమున గానవచ్చుచున్న తిరుమలరాయని కడగొట్టు కొడుకు వెంకటరాయ డేడుగడయై వారికి దృష్టిగూర్చె ననియు, నితనిదెసమాత్రమే కవివాగ్వ్యాపారము అనర్థముగాక నర్థవంతమై, సత్యమై చక్కని ప్రతిఫలము నొందుట వలన వారి కతడు ఇహపరసుఖములు గల్పించిన యతిదానశూరు డనియు, దానశీలుడు గావుననే సుక్రతు డనియు రామరాజభూషణుడు కవిజనమందారు డను నమ్రహానీయు నభివర్ణించి మెచ్చెను. తక్కిన వంశావతారికయందలి ప్రభువుల కీ "కవిజనాశ్రయు" లను కీర్తి దక్కదయ్యె నని మన మిచట దెలిసికొనుచున్నాము. "కవిశ్రేణి కిందునందు గతికల్పించినా" డనుటలో దాతయౌన్నత్యప్రదర్శనమును మాత్రమే యొనర్పక, తనకు గలిగిన ఆత్మసంతుష్టిని, అన్యాశ్రయముగాని, నరాంకితకృతిరచనమునకు బడవలసిన కక్కురితిగాని పని లేని తన స్థిరతరశాంతసుఖజీవన సమృద్ధినిగూడ జెప్పి యీ మహోపకారమంతయు 'వేంకటరాయల' దని రామరాజభూషణుడు శిలాక్షరముగ వ్రాసియున్నాడు. అశనవసనముల కాయాసపడనవసరములేని నిరపాయ సుఖజీవనసంపదయును, శాంతశమదమాదులతోడి పరిశుద్ధహృదయమును లభ్యపడ సుస్థిరుడై కొరమాలిన నరస్తుతుల పొంత బోక, శ్రీరామార్పణముగ హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించి, అజరామరమగు కీర్తి నార్జించి రామరాజభూషణు డిందునందు సద్గతి గాంచి కవిమండలచూడామణియై ప్రకాశించుచున్నవాడు. ఇతని కావ్యేందిర నాశ్రయించి దానశౌండుడగు 'వేంకటరాయభూజాని' యును శ్రీవేంకటేశ్వరస్వామిగ భావింప బడుచున్నాడు.

## వేంకటరాయని యోగ్యత

రామరాజభూషణుని జీవితనౌక యీ వేంకటరాయనావికాశ్రయమున నొడిదుడుకులు పడక, పదిలముగ బారము ముట్టినది. తండ్రి పరిపాలనము వహించు నాటికే వేంకటరాయలు, నితని యన్నయగు శ్రీరంగరాయలు గూడ దండ్రికి దోడై కార్యనిర్వాహకులుగ నున్నటుల వసుచరిత్ర పద్యములు సూచించుచున్నవి. ఈ హేతువుచేత బై పద్యార్థమును పరిశీలించి నపుడు, తండ్రియనుమతితో వసు చరిత్ర ప్రారంభము సేయించినవా డీ వేంకటరాయ లని తోచకమానదు. ఈ వేంకటరాయలనే వేంకటపతిరాయలనియు, వేంకటేశ్వరు డనియు గవి పేర్కొనియున్నాడు. తిరుమలరాయని ధర్మపత్నియు, నితని తల్లియు నగు 'వేంగళాంబ' కవిజన స్తోత్రపాత్రమైన మహాసాధ్వి. ఈ తల్లి విద్యాభిలాషిణి. కావున నెందరో విప్రబాలకులకు విద్యాదానము సేయించెనట. చిత్తగించండి యీ క్రింది పద్యమును:

"ఉంచిన యగ్రహారముల
 నున్నతనైఖరి విద్యలెల్ల ర
ప్పించిన విప్రపఙ్క్తుల
 బెంచిన నవ్యాననోత్కరంబులన్
నించిన బల్తటాకముల
 నెమ్మి గనందగు వేంగళాంబ య
భ్యంచితకీర్తిసౌధ విశ
 దాక్షరసూనమరాళరాజమై."

(వ. చ. ౧ ఆ. ౬౪)

"విప్రపఙ్క్తులకు విద్యలెల్ల రప్పించిన" దొడ్డతల్లికి జనించిన హేతువుచేతనే కాబోలు యీ వీర వేంకటపతిరాయలు" కవివాగ్వ్యాపారము యథార్థతమంబై విలసిల్ల గవిశ్రేణి కిందు నందు గతి గల్పించి" ధన్యు డయ్యెను. ఈ కవితిలకుని జీవితమున నితడు గణ్యతవహించిన మహారాజు. పురుషశ్రేష్ఠుడు. పుణ్యశ్లోకుడు. కవితాలతాలవాలమున కీ యుదారచిత్తు డొనరించిన దోహదముమూలముననే, తెలుగు పలుకుల కలంతి పూర్వములు అసదృశములు నగు రెండు కబ్బపు దొంతరులు అమరినవి.

## ఇంకొక మెలిక

హరిశ్చంద్రనలోపాఖ్యానమున గవి తన వృత్తాంతమును నివేదించియుండిన సీసపద్యమున నాల్గవచరణము. "శాశ్వతశ్రీ వేంకటేశ్వరానుగ్రహానిరుపాధికైశ్వర్యనిత్యయశుఁడ"నని రామరాజభూషణుడు వచించెను.

బ్రహ్మశ్రీ సీతారామశాస్త్రిలుగారు ఈ సందర్భము నిటుల వ్రాసియున్నారు.

"మఱియు నరసభూపాలీయమున బరమపదనాథుఁడైన విష్ణువు గ్రంథాదిని వర్ణింపబడుటయు, హరిశ్చంద్రనలోపాఖ్యానమున 'శాశ్వత...యశుఁడ' నని చెప్పుకొనుటయును బరిశీలింపగా నీ కవికి బరమపదనాథుఁడగు విష్ణువే యిష్టదైవ మనియు, దద్విష్ణుని యవతారమును, స్వేష్టదేవతాంతరమును నాంజనేయునకును బూజ్యదేవతయు నగు శ్రీరామదేవతను నితఁ డుపాసించె ననియు దోఁచుచున్నది. కాన నీ సందర్భమును నరసభూపాలీయకవియే వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానకవి యని బలపఱచుచున్నదిగాని విభిన్నతావాదమును బలపఱుపనేరదు." (వచ. విమర్శనము ౬౦ పుట.)

నరసభూపాలీయ కవి విషయము నటులబెట్టి యీ వేంకటేశ్వరుని విచారింతము. హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి "వనధిలంఘన" యను సీసమున రామరాజభూషణు డనుసరించిన క్రమమును జూతము. ఈ పద్యమును "స్వభావ"మను శీర్షిక క్రింద నుదాహరించియున్నాను. ఆ పద్యమున గవిని "కవిత్వనిధిలాభధన్యు జేసిన" ఆంజనేయుడు మొదట బ్రస్తుతింపబడెను. రెండవవాడు "శుభచిహ్నము" లిచ్చి తొలుత నాదరించిన రాజు. వసుచరిత్ర కృతిగొని రత్నములచే నభిషేకించిన కృతిపతి (తిరుమలదేవరాయలు) మూడవవాడు. ఇటుల మూడుచరణముల ముగ్గురి నుదాహరించి వారివారి యధికారతారతమ్యముల జూపి, తుదివాడుగ "శ్రీవేంకటేశ్వరుని" జెప్పెను. తరువాత నా వేంకటేశ్వరునికి ఓమ్మటివారినిగ దన వంశక్రమము నిట్లు జెప్పెను: ప్రపితామహుని సింగరాజును, పితామహుని తిమ్మరాజును, పితయగు సూరపరాజును, తుదివానిగ గృతికర్తయగు దనను జెప్పెను. ఎత్తుగీతి పాదములు నాల్గింట నలుగురును, తనతోఁగూడ దన వంశమువారిని, సీసపాదములు నాల్గింట దన జీవనాధారపురుషపుంగవుల నలువురను గొప్ప, కొలది యంతరువులు దెలియునటుల చక్కగ వర్ణించి యున్నాడనుట స్పష్టము. పెద్దపాదములలో నాలుగవదానియందు జెప్పదగిన యా వంశములోని చిన్నవానిని, చిన్నపాదములు నాల్గిటిలో తుదిదానియందాత్మవంశజులలో జిన్నవాడగు తనను జెప్పెను. అందువలన నిందలి వేంకటేశ్వరుడు శేషాచలాధీశ్వరుడు కాడని వెల్లడియగుచున్నది. క్రమము ననుసరించి చూడ నీతడెల దే (పరమపదనాథుఁడే) యగునేని, అతడు నొక యిష్టదేవతయై యుండునేని రామరాజభూషణుని వంటి లాక్షణిక ప్రమాణకవి క్రమభంగము గావించి యాంజనేయునకు, రాజులకు జివర జేర్చునా? అతనిని ప్రథమపాదముననే చూపించియుండును. మఱియు నరసభూపాలీయ కర్తృత్వ మారోపించుటకు రామరాజ భూషణుని కావ్యమునందలి వేంకటేశ్వరుని వాడుకొని చని నరసభూపాలీయనాందీపద్యముతో జతజేసి యచట విష్ణుదేవుని పేరుంట నీవేంకటేశ్వరనామమును మార్చి, యా విష్ణువే రామరాజభూషణుని యిష్టదైవ మనుట దద్విష్ణుని యవతారమే శ్రీరాముడు గావున నా పేరుతో గృతి ప్రారంభము జేసినాడని వసు - హ. న. ల విషయమున జెప్పి రామరాజభూషణుని యిష్టదేవతకు గూడ నామభ్రంశ మొనర్ప జూచుటలో ఫలమావంతయు గలుగదు. రామరాజభూషణుడు వసుచరిత్రప్రారంభ పద్యమున సీతారాముల గొనియాడి మ్రొక్కె, వందన భాగము ముగియ—"అని యిష్టదేవతా వందనంబును" అనియు, "అని యివ్విధంబున నిష్టదేవతామనన మంగళసమాచరణంబును" అనియు శ్రీరామ, సీతా, భరతాదుల వందనకార్యానంతరమున హరిశ్చంద్రనలోపాఖ్యానమును జెప్పెను. అంతేకాని యెచటను బరమపదనాథునిగాని, శేషాచలాధీశ్వరునిగాని పేర్కొని సంస్తుతి జేయలేదు. పేరు మార్ప బ్రయత్నించుటతో నాగక నతని యిష్టదేవత పేరునుగూడ మార్చి ప్రధానవృత్తము చిక్కువిడకుండ మెలికలు ద్రిప్పి తారుమారొనర్చుట సత్యమును గప్పిపుచ్చుటయే.

"శాశ్వత...శ్రీవేంకటేశ్వరుడు" తిరుమలరాయనికొడుకుగాని ఏడుకొండలవాడెన్నటికి కానేరడు. పెత్తండ్రి, తండ్రి జెప్పబడినపిమ్మట నతడుండదగిన స్థానమున నతని జెప్పి తన యాచితిని, రచనా

చమత్కారమును, కృతజ్ఞతను కవిరాజు వెల్లడించెను. ఈ వెంకటేశ్వరుడు పైన జెప్పిన వేంకట (పతి) రాయలు. ఇతడు కవిశ్రేణి "కింపు నిండు గతులు గల్పించి" యీ విషయమున గవీశ్వరునిచే నభినందింపబడి యమృతు డయ్యెను. ఇతని వదాన్యతవలననే రామరాజభూషణుడు నిశ్చింతగ గావ్యసృష్టి గావించి తన యిష్టదేవతకు సమర్పించి ధన్యు డయ్యెను. కావుననే "ఆముష్మికఫలదాతయు" నితడే యని యత్యుదాత్తభావము జూపె వేంకటరాయలను వేంకటేశ్వరుడుగ జెప్పెను. కాని పైన వివరించిన ద్రావిడప్రాణాయామపద్ధతి నవలంబించి కాదు. దీనిని వసుచరిత్రమునందలి యీ క్రింది పద్యము బలపఱచుచున్న యది :

"హరు డాతారకశైలమార్గమున న
ధ్యాసీనుడై రాజశే
ఖరవిఖ్యాతి వహించు జంద్రగిరి దు
ర్గంబందు శ్రీవేంకటే
శ్వరు డొప్పెన్ బహురాజశేఖరసదా
సంసేవ్యుడై యారయ
ద్ధర బంటేలికవాసితన్నిగులకున్
దద్వల్లభశ్రీలకున్." (వ. చ. ౧ ఆ. ౮౧)

వ్యాఖ్యాత "శ్రీవేంకటేశ్వరుడు = సంపన్నుడైన వేంకటరాయడు" అని చెప్పెను. వసుచరిత్రము నాడే వేంకటరాయలను "వేంకటేశ్వరు" డని పొల్చి చెప్పునంతటి మానసికసంతుష్టిని రామరాజభూషణుడు పొందియున్నాడు. కావున శ్రీశాస్త్రిలవారు సెలవిచ్చినటుల సా. వ. పద్యపాదమునందలి వేంకటేశ్వరుడు వేంకటరాయలుగాని, పరమపదనాథుడు గాడు. దీనిపై నాధారపడిన నరసభూపాలీయకర్తృత్వమును రామరాజభూషణకవివిషయమున నంతియ కదా!

రామరాజభూషణుని గ్రంథములకంటె నతని చరిత్రవిషయమున నితరులు వ్రాసినవి యైతిహ్యములు; ప్రమాణములు కానేరవు. అతని వృత్తాంతము నతడే చక్కగ జెప్పవలసినంతదనుక విస్తరము జేసి కొనెను. ఇతడు పెద్దనార్యుని మార్గదర్శకునిగ నొనర్చుకొని, మనుచరిత్రముకంటె ప్రౌఢముగ, శాస్త్రసమ్మతముగ నుండవలెనని తలంచి కావ్యరచన మొనర్చిన దిట్ట. ఇతడు "బహుళాంధ్రోక్తిమయప్రపంచమున దత్ప్రౌఢ గల్పకళ మూహింప" నదుముగట్టిన ప్రోడ. "అవారితసత్కావికల్పనావిభూషావహపూర్వవృత్తములు సొగలు దీరిన జాతిరత్నము"లని కావ్యగౌరవమును చాటించిన భాషావేత్త. సమకాలికులచేత, దరువాతగల కొందరసూయాపరులను జాత్యహంకారులచేత నూహాతీత నిస్కారాదు లనుభవించియు గొండవలె చలింపక, ఆంజనేయుని భాతి శ్రీరామభక్తిని విడువక కావ్యసృష్టి గావించి అహంకారమును జయించిన మహావీరుడు. ఆంధ్రకవిపుంగవుల నితనివలె యోగ్యులకు గణము గలవా రతివిరళముగ నున్నారు. అతని జీవనమునకు, కవిత్వపటుత్వసంపదకు, సుజీవికకు, అసమానగౌరవప్రాప్తికి, యోగ్యప్రవర్తనమునకు శ్రీసీతారామాంజనేయులు ఆధారభూతులు. ఇట్టి మహాకవి, ఉచితము, పేరు మార్చుకొను నెన్నడును నమ్మదగని పొల్లుమాట. ఈ గొడవయంతయును కవిజీవిత, కవిచరిత్ర గ్రంథకర్తలు దమతమ గ్రంథముల గొప్పకొఱకు, పట్టుదలలతో, వివాదములను డీకొనుటలో గలిగిన దురవస్థ. వీరు కట్టుకథలకు ప్రాధాన్య మిచ్చిరి. ఇంకొకచోట నట్టివి నమ్మరాదని తిరస్కరించిరి. తమ సిద్ధాంతములకు బలమిచ్చునెడ నైతిహ్యము ప్రమాణమే. ఈయనిచో నది ప్రక్కిటిపురాణము. చరిత్రకారుల సిద్ధాంతము లీ త్రోవ నడచినవి. ఇంతవఱకు రామకృష్ణుడో, రామలింగడో తెలియనివాడు "శ్రీ-భూ-" అని బూడిద నెనుదట గొట్టెనట. ఒకడు వీపున తామర జూపెనట. పింఛములమీద వసుచరిత్ర నుంకితము ధారవోసె ననె నట వేరొకడు. శ్లేషశబ్దాడంబరము చూపి మూర్తి వసుచరిత్ర వ్రాసె ననెనట నింకొక అనామధేయశిరోమణి. ఈ యైతిహ్యముల విశ్వసించి చరిత్రకారులు, విమర్శకులు సిద్ధాంతము లొనగ్చుటా? నమ్మదగదు. సత్యార్థ మతని కావ్యములయందు దేటతెల్లముగ గలదు. నరసభూపాలీయసంబంధ మింకొకసారి చూతము. బట్టురాజవంశజులను కవులలో నితడొక బట్టుమూర్తి. ఇది యితని పేరు కాదు. ఇతని పేరు రామరాజభూషణుడు. అసమానతారకమంత్రోపాసి. శ్రీరాముని చరణసేవకుడు. ఆంజనేయప్రసాదలబ్ధ గాంచిన పుణ్యమూర్తి. ఇట్టి మహనీయుని కావ్యముల జదివి, అతని పవిత్రస్వభావము నెఱింగి ధన్యులమగుదుము గావుత!

రామరాజభూషణమహాకవియొక్క కవితారచనావిధానమునందలి గుణవిశేషముల నన్నిటిని

అతని కాలనిర్ణయాదికములతోఁ గూడ బ్రహ్మశ్రీ వజ్ఝల చినసీతారామశాస్త్రులుగారు రచించి, వసుచరిత్ర విమర్శనము పేరున గ్రంథమును వెలయించిరి. భాషా జిజ్ఞాసువులకు మహోపకార మొనర్చుచున్న శ్రీ శాస్త్రులుగారి గ్రంథము నాకీ వ్యాసరచనమున దోడ్పడినందులకు శ్రీవారికి కృతజ్ఞుఁడనై నమస్కరించుచున్నాను. కీ. శే. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రులు వారికి వసుచరిత్రము, రామభూషణకవియు అత్యంతాభిమానపాత్రములు. శ్రీవారి యభిమానము మనుచరిత్రమును, పెద్దనను గూడ గాదనునంతటి స్థాయికి బోయినది. అతిసునిశితవిమర్శకులగు బ్రహ్మయ్యశాస్త్రులుగారిచే బొగడబడిన రామభూషణుని కవిత్వతత్త్వప్రాశస్త్యమును నింక వేఱుగ జెప్పనక్కఱలేదుగదా. కావున హరిశ్చంద్రనలోపాఖ్యానమున రామరాజభూషణుడు రచించిన శ్రీరామసామ్రాజ్యపట్టాభిషేకాభివర్ణనముతోడి పద్యముల నీక్రింద నుదాహరించి దీనిని ముగించుచున్నాను.

"శ్రీమన్మంత్రకళాగరిష్ఠులు ముని
 శ్రేష్ఠుల్ గుణారాము నా
రాము న్బట్టము గట్టి రుర్విపయి ద
 ద్రమ్యోత్తమాంగాగ్ర సీ
మా మానోన్నతి బర్వ విష్ణుపదజాం
 భఃపూరమంభోద ప
థ్యామస్యస్థితి దేవవర్గము నిం
 బాప్తి న్వెగాహింపఁగన్. (ప్ర. ఆ. ౪౪.)

"వరరత్నకలితభూషలయి మెప్పించునై
 ఖరి మణిచ్ఛత్రంబు భరతుఁ డూన
దమ మునిగాంపగతాగతమరాళయుగళంబు
 చొప్పునఁ గసలు వీఁచోపు లాలయ
విలసితాత్మవిధానములు మాటికొనుకీతి
 ననిలనూనుఁడు కేల నంఘ్రు లొత్తి
బలచక్రి రాలచ్చి వగవామభాగసీ
 తాభింబ మితరాంగద మున దోప
సురతరుపునీవ బుష్పకాంతర విశద్ధి
గనకపీఠాధిరూఢుఁడై మనుచు నేన
జగము లని తెల్పు కరణి విజ్ఞానముద్ర
నమరు గుణధాము రఘురాము నభినుతింతు"
(ప్ర. ఆ. ౪౫.)



# ఆద్యంతములు

[ కథ ]

●

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆంగిరస్సులి మహర్షి అనగా పెద్ద ద్రష్ట. మహర్షి యనుటతోడనే తపస్వి యనిగాని, జ్ఞాని యనిగాని యనుకొనరాదు. శమదమాదిగుణములకు, జ్ఞానబుద్ధికి సంబంధములేకుండ కొందరు ఋషు లుండిరి. వట్టి ద్రష్ట యను నర్థములోననే యర్థముచేసికొన వలయును.

అతడగ్నియందు గొప్పపరిశోధన చేసెను. సామూహికముగా జరిగిన మహాపరిజ్ఞానములో తత్కర్తృకము నిక్కలి బాగుగ నున్నది. తొలుత నంగిరసుడు త్రిలోకములకు నగ్నియై వెలుగుచుండెను. అతడు ప్రథమవహ్ని. అసలు వేరే యగ్ని యున్నాడు. కొన్ని దినములు పోయినతర్వాత నంగిరసు డగ్నిదేవునకు పుత్రునిగా నంగీకరింపబడెను. ఈ యంగిరోగ్నినుండి పదునాలు గగ్నులు సముద్భవించెను. అందు ఏడు పుమాకారకములు, మరియేడు కాంతాకారకములుగా వర్ణింపబడెను.

ఈ యష్టాదశవహ్నులకు స్వరూపస్వభావ ప్రయోజనములను విచారించుటలో నాంగిరస్సులి మహర్షి యయ్యెను.

ప్రథమాగ్ని వహ్నిరూపుడు. అంగిరసుడు ప్రాజాపత్యవహ్ని. అందుచేత నంగిరస్సులి చేసిన పరిశోధన యంతయు యజ్ఞసంబంధమైనది. కాని యతని మనస్సు యజ్ఞవిముఖమైనది.

ఇదిగాక బృహస్పతిచేత చేయబడిన యగ్నిజ్ఞానము వేరే కలదు. తదనుయాయులు కలరు. వారందరును ఋషులే. కాని వారి ఋషిత్వము వేరు. వారిమతము వేరుగా నుండెను. వారిమతము బృహస్పతిమత మయ్యెను.

'తపుడు' అను నొక మహావహ్ని గలదు. ఆ వహ్ని నుండి పదునేను వహ్నులు సముద్భవించెను. ఈ వహ్ను లన్నియు యజ్ఞవిరోధులు.

అంగిరస్సులి బృహస్పతిమతానుయాయులతో గలసి యీ పదునేను వహ్నులలో పరిశోధన ప్రారంభించెను. ఈ వహ్నులన్నియు యజ్ఞవినాశకములుగా నుండెను. శత్రువులకు శత్రుసంహారమునకు, మహానగరనాశనమునకు నీవహ్ను లుపయోగింపబడిన ట్లుండెను.

ఈ వహ్నులయొక్క విజృంభణము చూచిన కొలది నంగిరస్సులికి తల తిరిగిపోయెను. సర్వజగత్సృష్టియ హేతువుగా నున్న నీ యగ్నులుగాక వేరే దేవు డని గుర్తించినా డనిపించెను. యాజ్ఞికములు, గార్హపత్యాదులైన మహావహ్నులు కలవు. వానికంటె స్థితిహేతువులు విస్తారము లనిపించెను.

వేల యేండ్లు జరిగినతర్వాత నంగిరస్సులి నాస్తికు డను ప్రథ పొందెను. అతడగ్నిలో చేసిన పరిశోధన వలన వాని శరీరము దేదీప్యమానముగా నుండెను. అతడే యొక వహ్నిరూపుడై యున్నట్లుండెను. ఈ వహ్నికి ఆరిపోవుట లేదు. అనింధనమైన వహ్నికి రూప ముండునా? అతనియొక్క మనస్సముద్ధతమైన యీ యనంతాగ్ని యుపరిశోధనాస్వరూపమహావహ్నికి వాని శరీర మింధనప్రాయముగా నుండెను.

అతనికి యజ్ఞము లేదు. యాగము లేదు. శమదమాదులు లేవు. పరమేశ్వరుడు లేడు. సర్వమగ్నిమయముగా కనుపించెను.

అతని ప్రచారము నిరోధహీనమై సప్తలోకము లావరించెను. త్రిమూర్తులు నప్పుడం బెగసిరి. ఐ మూలల జొచ్చిరి. వారి యస్తిత్వము సంశయగ్రస్త మయ్యెను.

అంగిరస్సులియే సర్వసృష్టిహేతువుగా, నతని సిద్ధాంతమే పరమసత్యముగా గోచరించెను.

ఇంత నిశ్చయుడైన యీతడు తాను చనిపోయిన తర్వాత తన సిద్ధాంత మెవరు ప్రచారముచేయుదు రని భయపడెను. ఈ యేమియులేనిదానికి తన సిద్ధాంత మెందుకు, దాని ప్రచార మెందుకు? తన నిత్యత్వ

మందు సందేహ మెందుకు? ఇన్ని సత్యాలను పరిశోధించినవాడీ బహిఃపరిశోధనలు పరిత్యజించి యీ సందేహమేమి యన్న విషయమునుగూర్చి యంతఃపరిశీలన మొక్కసారియు జేయలేదు.

2

అతనికి జర లేదు. శారీరకముగా మృత్యువు లేదు. నిత్యసత్యాలచేత పరిపోషింపబడెను. అతని శరీరగతమాంసాస్థులు నిత్యప్రాణసత్యపరిరక్షితము లయ్యెను. అతని యసృక్ప్రవాహమున శైత్యముయొక్క స్పర్శముగూడ లేకుండెను. సత్యప్రవాహము నిత్యముగాను చైతన్యసహితమైన యతనిసృష్టిలో కదలిక లేకపోవుట యెట్లు? కదలిక మానినప్పుడుగా చైతన్య మాగిపోవుట? మృత్యువు ప్రవేశించుట?

చలనము నిత్యమైనదా? చలనరాహిత్యము నిత్యమైనదా? చలనము భావము. చలనరాహిత్య మభావము. అభావము భావము గాదు. అందుచే మృత్యువు కల్పితముగాని యథార్థము గాదు.

అసలు సత్యమనిననే నిత్యచైతన్యమని యర్థము. నిత్యచాలనముచేత సత్యము సముద్భవించి తరంగములతోడి యణువుల నొక తెగని కదలికతోడి ప్రవాహమైనదియే సత్యము. ఈ యణువులు యత్సంబంధులు? అన్న ప్రశ్న పుట్టినచో 'తత్సంబంధు'లనియే సమాధానము. ఆ తిరుగుటలోననే యణువులు భాసించెను. ఈ యణువులే తిరుగుచుండెను. ఆ యణువులకీ, పరిభ్రమణమునకు నవినాభావసంబంధము. కనుక సత్యము నిత్యము కావనుట యెట్లు? విచరణదశయందు, అనగా వ్యవహారదశయందు వానికి భేదము ప్రతీయమాన మగుచున్నదిగాని మూలభూతమైన స్థితియందు భేదము లేదు.

సరే, యీశరీరము మూలభూతమైన దశాసంబంధియా? వికరణదశాసంబంధియా? మూలభూతమైన విషయమునందు వాగ్విషయముకూడ నుపరతి పొందుచున్నది. అట్లే శరీరముగూడ పొందవలయును.

మరల నీ యణువులు జడములా, సచేతనములా యన్న ప్రశ్న పుట్టినచో మరికొంత తర్కము పుట్టును. అంగిరశ్శిలి యాతర్కముసంక బోడు. చేతనతాకారణము నూహింపడు. కనుక శివుడు లేడు, విష్ణువు లేడు.

3

అతనికి వేనవేలు శిష్యులు గలరు. బుజస్కారుడు, క్రోధనుడు, రసుడు, సుధీయుడు, అతిథేయుడు, సురహంత మొదలైనవారనేకులు. వారి నామము లన్నియు నతనిచేత కల్పింపబడిన సత్యములయొక్క నామములే.

వీరిలో సురహంత యాంగిరశ్శిలికి ప్రియతముడు. అతని ప్రాణమంతయు సురహంతయందనే యుండును.

సురహంత గురువుకంటె పదిరెట్లెక్కువ చదివినవాడు.

చైతన్యమే ప్రాణము. అని యేల కావలయును? నిశ్చైతన్యము ప్రాణ మేల కారాదు? అగ్ని యనగా ప్రవాహభూతమైనదియే యేల కావలయును? నిశ్చలమైన సత్య మేల యుండరాదు? అని యతడు పరిశోధన ప్రారంభించెను. అతని పరిశోధన పోతగినంత దవ్వు పోయెను. ఆస్థితిలో నతడు కొంత కాలము నిశ్చైతన్యముగా నుండెను. తదనంతరమున మరల చైతన్యము ప్రాప్తించెను. ఆ నిశ్చైతన్య మును భూత మయ్యెనా? అన్నది ప్రశ్న.

ఇట్లనేకపర్యాయములా నిశ్చైతన్యతను తాను పొందెను. అప్పుడు ప్రాణముండుటచేతనే తరువాత చైతన్యము మరల కలిగినట్లు కాన్పించెను. కనుక నప్పుడును చైతన్య మున్నట్లే యను సిద్ధాంతమును నిర్ధరించెను.

ఇట్టి స్థితిలో నొక నిశ్చైతన్యపు వేళలో నతని కొక యనుభూతి కలిగెను. ఆయనుభూతి తత్కాలమునందట్టిదైనను స్మృతితోడి చైతన్యము కలిగినప్పుడు, దానిని గురించి భావించినపుడు చిత్రముగా నుండెను. ఒక యెదో తరంగము రూపు కట్టినట్లుండెను. ఆ తరంగ మొకప్పుడు త్రిశూలి, యొకప్పుడు సఫాలనేత్ర, మొకప్పుడు కపాలిధారి, మరియొకప్పుడు చర్మాంబరము.

ఈ యాకృతివిశేషములు పలుసార్లతని నిశ్చైతన్యస్థితిలో భాసింప నారంభించెను. చైతన్యవిరమణకు వీనికి నేమి సంబంధము? విరమించినప్పటి చైతన్యముయొక్క స్థితి యిదియా? చైతన్యముయొక్క క్రియారూపము లోకముగా భాసించి దాని నిష్క్రియారూప మిట్లు భాసించునా?

ఇది యాకృతి రూపము. ఇది క్రియ. ఈ రెంటికి సంబంధము లేదా? అసలది నిజముగా నిశ్చైతన్యమైన స్థితియా? ఈ శరీరమునకు చైతన్యము లేకపోవుట గాని, అసలు చైతన్యము లేకపోవుట యెట్లు జరుగును? ఈ శరీరమునకు చైతన్యము లేని స్థితి స్వప్నమో, నిద్రయో, స్మృతి రహితత్వమో కావచ్చును.

ఇట్టి స్థితి మరియు దీర్ఘమైనచో నది మృతి యేల కారాదు ?

చైతన్యముయొక్క యీ క్రియాదశ యవసాన స్థితి నెప్పుడు పొందును ? ఎట్లు పొందును ?

ఆ యణుపరిభ్రమణములో కలిగిన కపాలిమొదలైన యాకారము లసలు చైతన్యము నెట్లు పరిపాలించు చున్నవి ? స్వీకృతతదాకారమైన యీ ప్రాణతరంగ ములకు భిన్నమైన శక్తి కలదా ? భిన్నాకారములకు, సచైతన్యములకు భిన్నశక్తు లున్నవి. కానిచో నాంగిర శ్శీలుని శక్తి భిన్నము, తన శక్తి భిన్నము.

అట్లే కపాలి శూలియైన విశిష్టాకృతిమంతుని యొక్క శక్తి వేరు.

సురహంత పోయినకొలది భగవద్భక్తుడయ్యెను. ఆస్తికుడయ్యెను.

౪

తనకు ప్రియతముడైన శిష్యుడు సురహంత యిట్లనుటకు నంగిరశ్శీలి మిక్కిలి నొచ్చుకొనెను. వానినిగురించి భావించినకొలది యతని శరీరములోని యుష్ణప్రవాహములు మందగమనము లగుచుండెను. అతడు నిత్యము తన శరీరములోని ప్రాణాగ్నులను ప్రసరింపజేయుచుండెను. కాని తన శిష్యుడి ట్లైనా డన్న దిగులుచేత నా చైతన్యప్రవాహములయందు నగ్నిత్వము తక్కువగుచుండెను. ఈ యూహలకు, నా ప్రాణాగ్నికి నేమి సంబంధము ?

తన సిద్ధాంతములకు, తన ప్రాణాగ్నికి నేమి సంబంధము ?

సురహంతను పిలిచి పలుసార్లు చీవాట్లుపెట్టెను. తొలుతతొలుత కొంకినను చివరచివర నతడు గురువుతో తీవ్రముగానే వాదించెను.

సురహంత యిట్లనెను: "మన ప్రాణమును నిలుపునది నిజముగా నీయగ్ని కాదు. ఎందుచేత ననగా: ఈయగ్ని మన యూహలచేత పరిపోషింపబడుచున్నది. ఆయూహలు పరమేశ్వరునిచేత పరిపోషింపబడు చున్నవి. నాయందు మీకు ప్రేమ యున్నది. ఆ ప్రేమ విఘటితమై దుఃఖము కలుగుచున్నది. ఆ దుఃఖము మా ప్రాణాగ్నిని శీతలింపజేయుచున్నది.

ఈ లెక్కప్రకార మగ్నికంటె, నూహల కంటె సుఖదుఃఖములు ప్రాణాధారకమారకములు కావలసివచ్చుచున్నది.

ఈ సుఖదుఃఖములు భావములు. ద్రవ్యములు కావు. కల్పితములు. కల్పితమైనదానికి శక్తి లేదు. ఈ కల్పనచేసిన దెవరు ? అగ్ని సుఖదుఃఖములను కల్పించదు. సిద్ధాంతము సుఖదుఃఖములను కల్పించదు. ఇవి సుఖదుఃఖములుగా పరిణమించును గాని వీని కల్పనకు హేతువులు గావు.

గురుశిష్యులు మిక్కిలి వివాదపడిరి. అన్నిటి కంటె మర్యాద లేనిది యీ వివాద మొక సభలో జరిగెను.

౫

అంగిరశ్శీలికి పదిదినములు తాను పరిశోధన చేసి కల్పించిన వహ్నులకంటె భిన్నమైన యొక వహ్ని తన శరీరమందుద్భవించెను. అతడు మహర్షి కావున నావహ్నిని తన శరీరమునుండి బహిర్గమింప జేసి దానిని పరిశీలించెను. దానిలో ప్రాణేతరములైన శక్తులు విజృంభించుచుండెను.

అంగిరశ్శీలికి భయము వేసెను. దాని కొక నామకరణము చేసెను. ఆ యగ్నిని జ్వరాగ్ని యనెను.

ఈ జ్వరాగ్ని చిత్రమైనది. ఇది ప్రాణాగ్నికి విరోధియైనది. దేహమునకు నిస్సత్త్వకారియైనది.

అంగిరశ్శీలి పదిదినములు మంచమును వదలిపెట్ట లేదు. అతనికి తనకు ప్రియతమశిష్యుడైన సురహంత తన సిద్ధాంతమునకు వ్యతిరేకియైనాడనియు, సభలో తన కంటెటి పరాభవమైన దనియు దిగులుపట్టెను. అంగిరశ్శీలికి భార్యాపుత్రులు లేరు. తనది యన్నది వమ్మ్రిడి లేదు. తాను, తన యగ్నులును. తాను నిత్యుడు. అగ్నికి చల్లారుట లేదు. తనకు మృత్యువు లేదు.

ఈ శిష్యప్రేమ, యీ సిద్ధాంతాభిమానము మృత్యువుగా భాసించెను.

లోకములో నెంద రెన్నివిధములుగా మరణించుట లేదు ? మరణము లేకుండ తాను పరిశోధించి కనుగొన్న యగ్నులచేత తాను నిత్యుడే. భగవంతుడు లేడే, వాడు తనకు మృత్యువు నెట్లు తెచ్చును? ఆ భగవంతు డితని కట్టి విచిత్రమైనమృతి తెచ్చుచుండెను?

అంగిరశ్శీలికి స్మృతిలేదు. అతనికి సంధిపట్టెను. "సురహంతా! సురహంతా! యెంత చేసితివిరా? యెంత చేసితివి ?" అని సంధిలో గొణిగిగొణిగి చివర కా మాటలు తననాలుకపై నాడుచుండగా మరణించెను. ఈ యాద్యంతసహితుడైనవాడా యాద్యంతరహితమైనదాని నేల విశ్వసింపరాదు? అగ్నివంశమును నిర్మించిన యంగిరశ్శీలి మరణించెను. ఈ మరణమునైనను దైవ మన్నాడు గాదు.

# రక్తస్పర్శ

[కథానిక]

●

## శ్రీ బలివాడ కాంతారావు

రామావధాన్లు రామాయణం చదువుతున్నాడు. గ్రామంలోని కొందరు ప్రముఖులు, పాటక జనం, పిన్నా పెద్దా కడుశ్రద్ధతో వింటున్నారు. వీధి అరుగుమీద గొంతెత్తి గంభీరంగా చదువుతూ అర్థం చెప్తుంటే గదిలో కూర్చుని కాంతం వింటోంది.

రాత్రి తొమ్మిదిగంటల ప్యాసింజరులో దిగిన వెంకట్రావు అత్తవారింటికి కాస్తదూరంలో వుండగానే మామగారి గొంతుకవినిపించింది. యేదో పిరికితనం ఆవరించటంవలన వెనుకకుపోదామని తలచాడు కాని కాంతం తలపుకురాగా ముందుకుసాగాడు. అనుమానించినట్లే జరిగింది గలభా. అల్లుణ్ణి చూడగానే విరుచుకపడ్డాడు అవధాన్లు. అవధాన్లగారి సాత్తైన ప్రథమ కోపప్రవాహానికి అడ్డుగా ఆనకట్ట కట్టటం అసాధ్యం।

ఓర్పుతో ఆయనమాటలన్నీ కాస్సేపు విన్నాడు. తననేకాదు, గతించిన తనతండ్రిని కూడ దూషిస్తుంటే వెంకట్రావు సహించలేక కోపానికి లొంగిపోయి 'యిక మాటలు కట్టిపెట్టండి' అన్నాడు. 'వెధవలంతా కూడి నా కూతురు కడుపులో చిచ్చుపోశారు. మళ్లా యే ముఖం పెట్టుకొని వచ్చావ్ నా గుమ్మానికి? యెలా వచ్చావో అలాపో'—మామగారి జవాబుకు కంటకితుడై 'మీచే తిట్లుతినడానికి రాలేదు. మీ అమ్మాయి వ్రాసిన వుత్తరాలుచూసి వచ్చాను. యిన్నాళ్లు దాచుకుంటూరో దాచుకోండి' అని అక్కడనుంచి వడిగానడిచి వచ్చిన దారినే పోయాడు. ఆ మాటలతో అవధాన్ల ముఖం పాలిపోయింది. దవడలు నొక్కుకుపోయాయ్. ఆ జనసమూహంలో ఆ కోపాగ్నిమధ్య వచ్చి భర్త పాదాలపై ఆ యాశ్వని యెలా వ్రాలుతుంది? వెళ్లి పోవద్దని యెలా వారిస్తుంది? ఆమె కాధైర్యం లేక పోయింది. ఆమెహృదయాంతరాలలోని సమ్మెట పోట్లబాధకు రాలిన కన్నీటి బొట్లు రక్తపు చుక్కలేమో!

అందరినీ ఆగోజుకు పంపించి గబగబ నిప్పు త్రొక్కిన కోతిలా గదిలో కాలుపెట్టి 'ఆ వెధవకు యెందుకు వుత్తరాలు వ్రాశావే? నా కడుపును కాల్చావే. నా పరువుప్రతిష్ఠలను గంగలో కలిపావే. నా మాటను బూటకం చేశావే—పో ముండా, నా యింట్లో వుండొద్దు' అని ఒక్కగుక్కలో కఠోరంగా అంటే కాంతం 'హా' అంటూ నిశ్చేష్టురాలైపోయింది. అప్రయత్నంగా చెవులు మూసుకుంది. అక్కడ నిలువ లేక పోయింది. కాంతంతల్లి తల బాదుకుంది చాటుగా. అవధాన్లు గబగబ వీధి అరుగుమీదకు పోయి కూర్చున్నాడు.

కాంతం ఒక్కరితే చివరిగదిలో చీకటిలో కూర్చుంది. 'కాంతం! ముదురాకు గాలికి రెపరెపలాడి రాలిపోతే విచారించవలసిన పనిలేదుగాని లేత ఆకు రాలిపోతే కష్టంగానే వుంటుంది. నేను గండుకోయిలనై భక్షింపదలచుకోలేదు. వెళ్లిపో మీ నాన్నతో. త్రాగుబోతుకు పెళ్లాం యెందుకు? యీ తాగుడు రక్షించడానికి అబ్బలేదు; ఆ శ్మశానానికి తీసుక పోటానికే'—భర్త పదినెలల క్రితం అన్నమాటలు జ్ఞప్తికివచ్చి శరీరం ఝల్లుమంది. యీ యింట్లో ఒక్క క్షణమైనా నిలవాలని లేదు.

మరల గలభా. తప్పత్రాగి చేతిలో పొడుగు పాటి వెదురుపుల్ల పట్టుకొని పేలుకుంటూవచ్చాడు...

దూషణలు మితిమీరుతున్నయ్. యీ గలాభాకు యిరుగుపొరుగువాళ్లు చుట్టుముట్టారు. కాంతం కళ్లు తడిసిపోతున్నా మరల భర్త వచ్చినందుకు యేదో ఆశాభావం మొలకెత్తుతోంది. పొరుగు కరణంగారు కలుగజేసుకొని అవధాన్లగారితో 'త్రాగినవాడిమీద కోపం చూపిస్తే యేం లాభమండీ? తెల్లారేక బుద్ధి వచ్చినట్లు నలుగురూ నాలుగు చీవాట్లు పెడదాం. పడుకోనివ్వండి' అంటూ పెరటివాసలోని చిఁరిగదిలో మంచం వేయించి బలవంతాన పడుకోబెట్టి నిద్రపోయే వరకూ వుండి వెళ్లిపోయారు.

ఇంచుమించు మూడుగంటల రాత్రయింది. రోజులా ఆ సమయానికే వెంకట్రావుకు తెలివివచ్చి కళ్లు తెరిచాడు. హరికేన్‌లాంతరు వెలుతురులో తన వేపు నీరునిండిన కళ్లతో చూస్తూ, చేతిలో విసన కర్రతో నిలుచున్న దేవతాస్వరూపిణి తన కంటికి గోచరించింది. కంటిరెప్పలు చెదిరాయ్. కంటిలో హెచ్చుగా నీరు అలముకుంది.

'కాంతం! నీ ఒళ్లు హూనం చేసినవాడిని ఆదరిస్తున్నావా? పిచ్చిదానవే.'

'.....................'

'అమృతం దొరికింది. త్రాగి జీర్ణంచేసుకోలేని వాడిని' అంటూ లేచాడు. చక్కని కిశోరికాంతం వ్యథితస్వరంతో 'నేను వుత్తరాలు వ్రాశానని నాన్న యెదురుగా యెందుకన్నారు? ఆయనకోపం మీకు తెలీదా?' అని ప్రశ్నించేసరికి 'హాఁ' అన్నాడు తప్పును తెలుసుకొని విచారించినట్లు. 'యీ ఒక్క రోజు త్రాగకుండా వుండలేకపోయారా?' మరల కాంతం పెదిమలు కదల్చగానే 'నా నోసటివ్రాతే' అని జబాబు చెప్పి తల దించాడు. త్రాగుడు మైకంలో యెంత హీనంగా ప్రవర్తించానో అనే ఆవేదన తల పుకు రావటంతో అక్కడ ఆగాలని లేదు. హీన స్వరంతో అన్నాడు: 'కాంతం! నీ వుత్తరాలన్నీ అందాయి. నీ బాగు నేచచ్చినా కోరతాను. నాదగ్గర వుండి యేం సుఖపడతావ్? యిక్కడేవుండు. వెళ్తాను' అని లేవబోయాడు. 'ఆగండి' అంది కాంతం, శాంత గంభీరస్వరంతో.

'నా మనసు హూనం చెయ్యలేదు. నే సుఖపడేది మీదగ్గరే.'

'సుఖం! నాలా త్రాగుబోతుమాటలే ఆడుతున్నావ్.'

'నేనూ త్రాగుతున్నాననే అనుకుంటున్నా. మీరు తప్పుచేస్తే ఒకటీ, నేనుచేస్తే వేరొకటీకాదు. ఫలితం అనుభవించవలసినవారం యిద్దరమున్నూ.'

'కాంతం! యీ వేదాంతం యెక్కడ నేర్చావే?'

'వేదాంతం నిజంకాదనా? త్రాగండి. కాని నీతిలేని కార్యం చెయ్యకండి. అదే మిమ్మల్ని కోరేది.'

'త్రాగటం ఒక నీతైన కార్యమే, పిచ్చిదానా' అంటూ భార్యను చేరదీశాడు. సుగుణవతి, సౌందర్యవతి యైన భార్యను ఆదరించని దౌర్భాగ్యజీవితం అయిందని యేడ్చుతున్నాడు.

తెల్లవారింది. తర్జనభర్జనలయ్యాయ్. 'నేను యిక త్రాగ'నని ఒట్టువేశాడు మామగారు, పెద్దల యెదుట. ఉన్న ఆస్తి కూతురుపేర వ్రాయనిది పంపించనని అవధాన్లు పట్టుపట్టాడు. వెంకట్రావ్ ఓక్క మొగం పెట్టాడు. మళ్లా గద్దించారు అవధాన్లు. 'క్షమించండి. ఆ పని చెయలేను' అని అల్లుడు అనగానే 'అయితే నే పంపించ'నన్నాడు.

తనమాట వినకుండా భర్తతో వెళ్లిపోటానికే సంసిద్ధంగావటంవలన ఆ.కూతురు మొగము యిక చూడనని అవధాన్లు ఒట్టువేసుకున్నాడు. కాంతం, వెంకట్రావూ రైలెక్కారు.

౨

కాంతం యింట్లో కాలుపెట్టింది. సామానులు చిందరవందరగా చెదిరివున్నయ్. వంటయిల్లు పట్లతో నిండివుంది. భర్తవేపు చెక్కిళ్ళపై చేయివేసి ఆశ్చర్యంతో—'యీ పదినెలలు భోజనం?' యీ ప్రశ్నకు 'ఆఁ. లేదు' అని క్లుప్తంగా సమాధానం యిచ్చాడు. 'నన్నెందుకు బలవంతంచేసి పంపించారు నాన్నతో. కొలరోజులలో పిలుచుకు వస్తాననీ, కంటచేసుకుంటూ

వనీ చెప్పి మాట నిలుపుకోలే దేమండీ?' మనసును కలచే గొంతుతో అన్న అర్ధాంగిదగ్గరగావచ్చి 'ఆ త్రాగుడు దెయ్యం నమిలివేస్తుంటే యింకేం వంట చేస్తానే. చీకటిపడకుండా నే పల్లి సామానులు తెస్తాను' అంటూ వీథిలోకి బయలు దేరాడు.

రాత్రి భోజనం చేస్తూ, 'యెంతకాలం యిలా తృప్తిగా నీచేతి పాకం తినాలని దేవుడు వ్రాశాడో. కాంతం! త్రాగుబోతు బాగుపడతాడని యెలా అనుకుంటాం!

'మీ పుణ్యాం వుంటుంది. అలాంటి కష్టమైన మాటలాడకండీ. కాలం యెప్పుడూ ఒక్కలా వుంటుందా?'

'నా విషయంలో రోజులుమారవు. నా వేషం, నా వాటం చూస్తున్నావుగా. పిల్లలను పెంచటం తెలియనివాళ్లు కనటం, మానటం మంచిదికదా' అంటూ భార్యముఖంకేసి ఒకసారిచూచి 'నాన్న గతించాడు. లోకం అంటుంది 'యేంలోటుచేశాడు, బాగా ఆర్జించి చచ్చాడని, అటువంటి దిట్టకడుపున యిటువంటి త్రాగుబోతు యెలాగ పుట్టాడని. ఏంటో యీ ప్రపంచం? పరులసొమ్ము దోచేవాళ్ళు కొండను త్రవ్వి ఎలికనుపట్టి ఛస్తారు. ఆ ఎలుక కాటు అనుభవించేది మనంగా'— మళ్ళీ పాడినవ్వు నవ్వి 'మాటలాడవేం కాంతం? నీకన్యాయంచేసింది ఆ తండ్రిగారే. మీ నాన్న కళ్ళు కప్పి తాగుబోతుకు అంటగట్టాడు. మీ నాన్న తిట్టాడంటే తప్పులేదు!'

'గతించిన గడ్డురోజులు మరచిపోండి. శాంత సహనాలు, నీతి నియమాలకు కట్టుబడివుంటే పెద్దలు చేసిన తప్పులకు ఫలితం మనం యెందుకు అనుభవిస్తాం? సుఖదుఃఖాలు మన మనస్సును బట్టి వుంటాయ్. యికనైనా...' నిర్వికారమైన మనసుతో అన్న భార్య మాటలకు విస్మితుడై 'కాంతం! నీ మాటలలో యెంతో వ్యత్యాసం కనిపిస్తోంది. మీ నాన్న చదివే పురాణాలు వింటూ కూర్చునేదానవేమో? చదివేవాళ్ళు శాంతం అలవరచుకోపోయినా నీవు అలవరచుకుంటే చే లేకపోయినా గట్టెక్కిపోతావ్.'

'మీ రలా అధైర్యమైన మాటలు ఆడుతుంటే నా హృదయం వేగిపోతోందండి' భార్య కాస్త చలించి అన్న మాటలకు మారుమాటాడకుండా పూరుకున్నాడు.

పదిగంటలరాత్రి. శరీరమంతా పీకుతోంది అన్నాడు. బాధతో నలిగిపోతున్నట్లున్నాడు. కాంతం మంచందగ్గర నిలబడి విసనకర్రతో విసురుతోంది. 'ఉష్' అంటున్నాడు అప్పుడప్పుడూ. డాక్టరుని పిలుచుకు వస్తానని కాంతం అంటే 'నా జబ్బుకు యీ ప్రపంచంలో మారికేది ఒక్కటే మందు. ఆ మందే చివరకు నన్ను చంపుతుంది' తడబడుతూ అన్న భర్తమాటలలోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకున్న కాంతం చేతిలో విసనకర్ర జారిపోయింది, తన కళ్ళతో ఆ బాధను చూడలేక 'యింతగా త్రిప్పు తెలియాగండీ? అంది.' 'పంద్రెండు వరకూ గోడ్డుమీద ఆ కొట్లో ఆ దగ్గర మేలుకొనే వుంటాడే. యిలా ధర్మస్థానుగాని త్రాగనే కాంతం. పెద్దలందరి సాగుటూ ప్రమాణంచేశాను.' కొంతసేప కూకగబగబా మంచందిగి 'కాంతం! నన్నెవరైనా శైయంలో పెట్టిస్తే యీ బాధ యేంచేసేవో. పాపకటానికి స్వతంత్రంవుంది. వేగంగా వస్తాను. నే నిద్రపోయేపరకూ నా కంట పడకు' అని గుమ్మందాటాడు.

గంటలో త్రాగి తూలుకుంటూ వచ్చాడు. 'కాంతం! రా. వస్తావా, లేదా? దాగుంటావే. నీ మొగుణ్ణే నేను' అని యిలా మంచందగ్గర నిలబడి గొడవచేస్తున్నా కాంతం యెనుగుపడలేదు. వడిగా పెరటిగదిలోనికి నడిచి తిట్లతో సహా పెళ్లాన్ని యీడ్చుకొచ్చాడు. రెండు తగిలించి యేమేమో వాగాడు. ఆమెమాత్రం పళ్ళు పెగబట్టుకొని అమాయకపు చూపులతో వూరుకుంది. వాగివాగి చివరకు నిద్రపోయాడు. మామూలుగా నాలుగంటలకి తెలివి వచ్చింది. భార్య అలా చేతిలో విసనకర్రతో పుత్తడిబొమ్మలా నిలుచుంది. వెంకట్రావు కెక్కడ అప్పటి అసలు హృదయంలో వర్ణించలేని అవమానం, ఆ వేదన రసల్కాని మోహం సిగ్గుతోనూ, పశ్చాత్తాపంతోనూ కూడుకపోయింది.

కాంతం మాట్లాడదు. ఆమెయొక్క గంభీరమైన ముఖకాంతిలో జాలికూడ మిళితమైవుంది.

చిత్తస్థైర్యంలో పురుషునకు స్త్రీ తీసిపోదు. స్త్రీ హృది సాధారణంగా జాలిగుండె అవటంవలన వేగంగా కళ్లలో నీరు తిప్పివేయగలుగుతుంది. మనసునే శత్రువుగా చేసుకున్న భర్త అభిమానంగా 'యిప్పుడు బాగా నయమైందా' అని ప్రశ్నించింది. కంపించే గొంతుతో 'హెచ్చరదా కాంతం?' అంటూ కళ్ళలో నీరు తిప్పాడు. భార్యను చేరదీసి 'నీ మనసును రంజింపజేయని వాడిపై నీ కెందుకే అంత అభిమానం? నా చే యిలా దెబ్బలుతిని బ్రతకలేవు. రేపే దిగపెట్తా. మీవాళ్ళ యింటికి వెళ్లిపో' అన్నాడు. యీ మాటలు ఆమెకు భరింపరానివిగా తోచి భర్తగారానికి ఆనుకొని వున్న ఆమె ఒకసారి నీరునిండిన కళ్లతో భర్తకళ్లలోనికి చూచింది. ఆ చూపులలోని అర్థం ఆయనమనసును కలచివేసి 'కాంతం! రేపటినుంచీ త్రాగనంటే త్రాగనే. క్షమించు' అంటూ ఆమెచేతితో తన చేతిని కలిపాడు.

## 3

గడియారంలోని చిన్నముల్లు అరవైసార్లు పంద్రెండంకె మీదికి వచ్చింది. యీ గతించిన కాలంలో వెంకట్రావు యథాతథంగానే త్రాగుతున్నాడు. రాత్రి భార్యమీద త్రాగుడుమైకంలో కార్పణ్యం చూపిస్తూనే వున్నాడు. తరువాత యేడుస్తూ క్షమాపణలను కోరుతూ వచ్చాడు.

ఒకనాడు—'కాంతం! వూరికి కాస్తదూరంగా హాయిగా బ్రతుకుదామని యీ పెద్దయిల్లు కట్టించు కున్నాడు. ఒక ముసలమ్మ నమ్మి కేసుల్లో పెద్దరికం యిస్తే సగం ఆస్తి దోచాడట. యీ యింట్లో దిగిన రెండునెలలకే అమ్మ గతించింది. మాఅమ్మశాపాలు వూరకనే పోతాయా? ముద్దుగా ఒక్క కొడుకని పట్నంలో చదువుకుంటున్న వాడిచేతిలో డబ్బులు పెట్టే వాడికి పాడబుద్ధు లబ్బకపోతే యింకేం అబ్బుతాయి చెప్పు' కాంతం యీ మాటలు విని వూరుకుంది.

ఒకరోజు పట్నం పనిమీద వెళ్తున్నాననీ, రేపు సాయింత్రం తిరిగి వచ్చేస్తాననీ, బెంగపెట్టుకోవద్దనీ కాంతం కద్దకు కబురుపెట్టి వెళ్లిపోయాడు. కాంతం ఒక్కరితే ఆయింట్లో అలా కాచుకుని కూర్చుంది. నిముషం ఒకయుగంలా చూచుకొని. మరుచటిరోజు రాత్రి పదిగంటలకు త్రాగివచ్చి 'సాని, రంగసాని, లలితాదేవట! ఛీ ముండా. నీముఖం చూడకూడదు. యెందరి మీద యిలా. యివిగో డబ్బులు తీసుకో. నన్నొదిలి వెయ్. నా కాంతం నాకు పెళ్లాం. మళ్లీ అలా పిలిచి మీదపడ్డావంటే నిన్నేం చేస్తానో చూడు. వీడు వెంకట్రావ్. మబ్బున్న పంతులు ముద్దుకొడుకు. హాహాహా... ఛీ దయ్యం, ఘాతం—బాబో నన్ను ముట్టకు' అని పడుగెత్తి పక్కమీద పడి గట్టిగా తలగడను కౌగలించుకొని కళ్లుమూశాడు.

మూడుగంటలకి తెలివివచ్చాక జోటజోట కన్నీరు కార్చివేస్తున్నాడు. కాంతంశరీరం పులకరించింది. భార్యముఖం చూడటానికి ఆవేదనతో కూడిన సిగ్గుతో కూడుకపోయాడు. 'యెవరండీ ఆ రంగసాని?' దిగజారిన స్వరంతో భార్య ప్రశ్నించేసరికి 'యిలాంటి చండాలుణ్ని బ్రతికి యేం చేయమన్నావ్?' అంటూ భార్య గెంతుచేసులూ పట్టుకొని యేకధారగా కన్నీటిని ప్రవహింపజేశాడు. 'కాంతం! క్షమించు. యీచీకటి కొట్లో ఒక్కడైనా విడిచిపెట్టాను. నాన్నకు అబ్బనిది నాకు అబ్బింది. రామినాయుడు పట్నంలో త్రాగించి సానింటికి తీసుకుపోయాడు. నిన్ను మరచి పోలేనే. నాగుండెల్లో చేతత్త కూర్చున్నావ్. దేవుడిచ్చిన ప్రేమని యీ లోకంలో ఒకే ఒకస్త్రీకి అర్పించుకున్నా. ఆమే నాకు సర్వస్వం.' అంటూ ఆమెను గాఢంగా కౌగిలించుకున్నాడు.

ఒక నాటి రాత్రి భోజనం దగ్గర భాగహారుల మీద కోపంతో అన్నాడు: 'యీ భాగహారులు భాగాన్ని హరిస్తే యే పూచీ లేదుగాని, మనుషులనే హరించేస్తారే. మనం యేదో బ్రతుకుతున్నాం. పై వాళ్లకన్నా వీళ్లే మనమీద విరుచుకపడడం హెచ్చుగా వుంది. కాంతం! నీవులేని పదినెలలూ పది యుగాలే. యెన్ని అసందర్భపుపనులో చేశాను. త్రాగివుంటే యీ వెధవలు వేలు దోచారు. అయినా ఆబంగారం, ఆదెబ్బ దోచివేయుంది నాకు శాంతి...!' కాంతం హఠాత్తుగాఅడ్డి 'వాళ్లలా అరుచుకోనీయండి. మనం ఒకరిని బాధించకుండాపోతే మనకెవరూ యేం చేయలేరు. దోచివేయుటం నీతిలేని కార్యం. యిలా అనకోడడం కూడా తప్పు. మీపుణ్యం వుంటుంది. అలాంటి పాడుపని చేయకండి. యెలా ఆర్జించిన ఆస్తి అలా పోనీయండి. అప్పుడైనా కష్టపడి సుఖంగా బ్రతుకుదాం'

భార్యవేపు ఒకసారిచూస్తూ 'చాలాకాలోషుగా బ్రతికి సుఖానికి లొంగిపోయిన యీ వెధుకలపోగు

కష్టపడి పనిచేస్తుందా? అంతా పిచ్చిభ్రమ. లేవుడేం వ్రాశాడో? యిలా నడనీ. యెంతికాలమో?' అన్న వెంకట్రావు మొగములో దురాలోచనచిహ్నాలు తాండవించటం మానిన కాంతం 'నన్ను పిచ్చిదాన్ని చేస్తున్నారు మీమాటలతో. మీరు దొంగతనం చేస్తే నేనూ మీతో జైలుకు వస్తాను. మీ యీ చెడ్డ అలవాట్లను తప్పించని దోషం మీరుచేసే పాపానికి కూడా బాధ్యురాలను. ఒకరిసొమ్ము మనకు మరొద్దు. యిప్పుడు అనుభవించింది చాలు' అని దీనంగా బ్రతిమాలే భార్యవేపు యెగాదిగా ఒకసారి చూసి మౌనాన్ని దాల్చాడు.

కాలగర్భంలో మరి రెండు నెలలు కాంతం జీవితంలో యెదుటివారి కంటికి విషాదాంతంగానే కనుపించి మునిగిపోయాయి. ఇప్పుడు వెంకట్రావు పరిస్థితి కాస్త హీనంగానేవుంది. కాంతం యెన్నో విధాల ఆయనమనసు కష్టపెట్టకుండా సంసారం సాగించటానికీ, త్రాగుడు మాన్పించటానికీ ప్రయత్నించింది. కాని, అవి ప్రయోజనశూన్యాలని ఆమె గుర్తించుకో గలిగింది. ఒంటిగా కూర్చుని భావిని తలచుకొని రెండేరెండు కన్నీటి బిందువులురాల్చేది. మరల సంబాళించుకొని ప్రస్తుతకర్తవ్య మేమిటని ఆలోచించుకొని కూర్చునేది. ఉన్న పాపపు ఆస్తి పైసలా అయిపోతే అప్పుడు జ్ఞానోదయం కావచ్చునని ఒక వెర్రి ఆశతో వూసులాడేది.

'కాంతం! ఆ రోజు మానాన్న అంత బలవంతంచేస్తే ఆ'స్తి నీపేర యెంచేత రాయలేదంటావ్. యేముందనే. ఉన్న కాస్త కడుపుకొట్టినదీ నీపేర వ్రాసి నీ పవిత్రమైన జీవితానికి కళంకం తెస్తానా? కాకులనుకొట్టి గద్దలకు వేసేరకం అయింది యీ వంశం. నాతో సరిలే. యింకెన్నాళ్లు యీ పాపపుకూడు' అన్నాడు ఒకనాడు. ఇప్పుడు భర్తను యేమన్నా కాస్త చిరాకుపడతారని ఒకసారి అశ్రుపూరిత నేత్రాలతో భర్త కళ్లల్లోకి చూచి తల దించుతుంది. యీ ఘటన ఆయనమనసును కలచివేసి పరిపరివిధాలుగా తీసుకొని చెప్పరానిబాధ పడతాడు. ఒంటరిగా కూర్చున్నప్పుడు దేవుణ్ని దూషిస్తాడు. 'యిటువంటి నవమోహనాంగిని, సుగుణవతిని తనలాంటి త్రాగుబోతుకు అప్పచెప్పి నాటకం చూచి ఆనందిస్తున్నాడని. మళ్లా తెలివితెచ్చుకొని, పెళ్లి యెందుకు చేసుకున్నానని తననుతనే దూషించుకుంటాడు.

ఒకనాటిరాత్రిభార్య తలను తన తలతో ఆన్చి దీర్ఘనిశ్వాసాలు తీస్తూ యేదో చెప్పబోయాడు. కాని గొంతుక పట్టుకుంది. మళ్లా సవరించుకొని 'కాంతం!' అని వూరుకున్నాడు. మరల సంబాళించుకొని అన్నాడు. 'కాంతం! జన్మజన్మాలకు నా భార్యగానే జన్మిస్తానని నా చేతిలో చేయి వేయ్' అన్నాడు ఆవేదనతో కూడిన స్వరంతో. ఆమె అభిమానంగా ఆయనచేతిలో చేయి వేసింది. మరల అన్నాడు—'యీ జన్మ యిలా కాలిందిలే. వచ్చేజన్మలో మొదటినుంచీ జాగ్రత్తగా......కాంతం!!'

రెండువారాల తరువాత విషయం: కాంతం అంది భోజనం చేస్తున్న భర్తతో—'అన్నీ అమ్మండి. కాదనను. కాని యింటినిమాత్రం మిగల్చండి. లోకం యెగతాళి చేస్తుంది ఇల్లూ వాకిలీకూడా అమ్మివేశారని. తలదాచుకోడానికి యిల్లంటూ వుంటే పస్తున్నా ఫరవాలేదు'—ఒక్కమాడినవ్వు నవ్వి వూరుకున్నాడు. భార్యవేపు తీక్ష్ణకరుణాదృష్టులు ప్రసరించి వూహాలోకంలో వురిత్రాళ్లయెదుట నిలుచుంటాడు కర్తవ్యమేమిటని. కొన్నాళ్లలో రోజులంటి దారుణపరిస్థితులు వస్తాయోయని పెద్దపెట్టున లోలోన యేడ్చుకుంటాడు. భార్య చెప్పిన బోధనలు విని 'ఇదీ నా ప్రపంచం' అని లేచిపోతాడు ఒకసారి. 'మంచిచెడ్డలు పాలు-నీరులాంటివి. మంచిలో చెడుగు కలిసిపోయి చెడుగు మంచిఅయిపోతుంది. కాని, నేను మాత్రం నీలో కలిసిపోలేకపోతున్నా. అలాంటిది నే నెందుకు బ్రతకాలి?' అంటాడు నిమ్మళంగా యింకొకసారి. భార్యమాటలు, సేవ ఆయనహృదయాన్ని మనస్కరం చేసేవికాని అంతలో యేదో హాలాహలం గొంతులోనూ, బుర్రలోనూ మండిపోయేది.

౪

వారంరోజులనుంచి మనిషి పిచ్చివాడిలా వున్నాడు. కాని భార్య యేమనుకుంటుందో అని పాడినవ్వులు నవ్వకపోలేదు. మనిషిని ఒంటరిగా చూస్తే వుద్వేగంతోనూ, సంశయంతోనూ బాధపడుతున్నట్లు గుర్తించవచ్చు.

'ఈ వేళ అమావాస్య' అన్నాడు రాట్నం త్రిప్పుతున్న పెళ్లాంతో వణికినవ్వుని పెదిమలపై ప్రసరించి. 'పాపం! నీ కెందుకే కాంతం, యింత కష్టం.

సుఖపడటానికి అవకాశం వుండగా నువ్విలా......'

కాంతం జవాబుకు నిరీక్షించకుండా 'యీ ఒక్క రాత్రైనా ఆనందంగా గడుపుమా. నే చచ్చినట్లు ఈరాత్రి త్రాగినే'. కాంతం చప్పున లేచి 'మీరు నన్ను మీ ఒట్లతో రోజూ పిచ్చిదాన్ని చేస్తున్నారు. అబ్బా బ్రతికి చచ్చేమోనండీ' కాస్త చిరాకును వ్యక్తపరుస్తూ అంది. 'కాదు కాంతం! నేను రేడుగు మాట్లాడనండే. పట్నంలో చాలా మంచిసినీమా అవుతోంది. రెండు బళ్లమీద వూళ్లో చాలామంది ఆడవాళ్లు వెళ్తున్నారు. నీవుకూడా వస్తావని చెప్పాను. తప్పకుండా వెళ్లాలి.'

వెళ్ల నన్న కాంతాన్ని బ్రతిమాలుతూ యెన్నో విధాలుగా చెప్పాడు. దొంగలు రాకుండా యింటిలో తను వుంటానని చెప్పాడు. భర్తచే అంతగా బ్రతిమాలించుకోవటం ఆమెకు భరింపరానిదిగా తోచింది. రోడ్డుమీద బండి వెనకాల కొంతదూరం నడిచాడు. 'తిరిగివచ్చేటప్పటికి తెల్లారుతుంది. మరేమీ భయపడకు. అందరూ వున్నారుగా' అని వెనకకు వచ్చాడు.

ఒంటరిగా పెరటివరండాలో కూర్చొని ఆకాశం వేపు చూస్తూ వూహలతో బుర్రను పనిచేయిస్తున్నాడు. తనలో తనే నవ్వుకుంటున్నాడు. మళ్లీ యేదో భారాన్ని మోయలేనివాడుగా గాబరింప పడుతున్నాడు. పెరటనున్న వేప చెట్టునుంచి గాలికి పండుటాకులు రాలుతున్నాయ్. 'ఇదీ నా ప్రపంచం' అన్నాడొకసారి మూలుగుతూ. లేచి జేబులోనున్న వూట కలం వేపు చూస్తూ 'నన్ను చేతిలోవుంచి దోచే ప్రపంచానికి సాయం చేశావ్. ఇప్పుడు యేం చేయబోతున్నావో!' అని వికిలినవ్వు నవ్వి లోనికి పోయి మంచం మీద చేరబడ్డాడు.

గోడగడియారం మనుషుల మనస్తత్వాలతో నాకు సంబంధం లేదన్నట్లు పదిగంటలు చూపించి టంగ్ టంగ్ మంటోంది—హరికేన్ లాంతరు వెలుతురులో వుత్తరం వ్రాసుకుంటున్న వెంకట్రావ్ ఒక్కసారి గడియారం వేపు చూసి నిట్టూర్పు విడిచాడు. యజమాని యెవరైతేనేం కలంవిధి కష్టపడటం! వెంకట్రావ్ అని సంతకంచేసి 'నా వూహల్ని వ్యక్తపరిచేవ్ విశ్రాంతి తీసుకో' అని జేబులో పెట్టాడు.

లేచాడు ముందుకు నాలుగు అడుగులు—మళ్లా వెనకకు. ఛీ అని చీదరించాడు. 'జీవితం' అంటూ ముందుకు. చివరకు చీకటిలో లీనమయ్యాడు. గంట లోపలే పని ముగించుకొని తిరిగి యింట్లో కాలు పెట్టాడు. పెట్టెలో ఒక మూట పెట్టాడు. శరీరం అంతా కంపిస్తోంది. గాఢంగా నిట్టూర్చుతున్నాడు. ఇప్పుడు తన మనసే రాబందై తననే పిక్కుతింటోంది. 'కాంతం, విడిచిపెట్టి యెలా వుండటం? విడిచిపెట్టక పోతే జీవితం!!'

గడియారం పన్నెండు కొట్టేరకు సందేహం, ఉద్వేగంతో కంటకితుడయ్యాడు. గబగబ నడిచాడు—హాయిగా వుండటానికి ఒకే ఒక స్థానం! 'ఒట్టులు యెన్ని వెయ్యాలేదు. ఇదీ నా ప్రపంచం' అంటూనే.

'వస్తావేం. పొయ్యి. త్రాగటానికి ఆఖరు రోజు. వేస్తావా, లేదా? యింద పదులు, పత్రికలు. కళ్ళు వేలవ్...!' తప్ప త్రాగాడు. చేతిలో ఒక సీసాపట్టుకొని చీకటిలో లీనమయ్యాడు.

మామూలుగా యించుమించు మూడుగంటల సమయానికి తెలివివచ్చింది. కళ్ళు విప్పాడు. విసనకర్రతో వెర్రిబాగులపిల్ల కనపించలేదు. ఆకాశం చిన్న చిన్న మేఘాలతో. 'హా, కాంతం' హృదయాంతరాళంలో ప్రతిధ్వనిస్తోంది. లేచాడు. అదిగో యేటికోన. ఇదిగో యిది మర్రిచెట్టు—హా, అవును. నే నెక్కడున్నా—బూడిదమీద—శ్మశానం! శ్మశానం!! శ్మశానం!!! అమ్మో—ఇవిగో భూతాలు—వందలు, వేలు—నా మీదపడకండి—వద్దు—వద్దు...హా...

గట్టిగా కళ్ళు మూసుకొన్నా పిశాచాలు నృత్యం చేస్తున్నాయ్. అస్థిపంజరాలు ఆడుతున్నాయ్. భీకరంగా నినాదాలు చేస్తున్నాయ్. దవడలు ఆడిస్తూ మాంసంతో వున్న ఒకే ఒక యెముకలపోగుమీద వురుకుతున్నాయ్. గుండెను పీకుతున్నయ్. మాంసాన్ని ముక్కలుచేసి పంచుకొంటున్నాయ్. 'అమ్మో'—అని పెద్ద అరుపుతో నిర్విరామంగా పనిచేసే ఒకే ఒక అవయవం శాశ్వతవిరామంతో సంతృప్తి పొందింది. భూతాలను చూడలేక. భూతాలే యీ భౌతిక దేహాన్ని చూడగలిగితే నీతిలేని మని పని దూరంగా తప్పుకుంటాయ్!

తెలతెలవారుతోంది. తొలికోడి కూసింది. వూరిలో గలాభా. మునసబు రిపోర్టు వ్రాసి అర్జంటుగా

పంపించాడు సైకిలుమీద ఒక మనిషిని. వూరికి కాస్త దూరంలో సినీమానుంచి తిరిగివస్తున్నవారికి ఆయన వైనం యెరుకపరచాడు. ముసలివాళ్లను యింట్లో పెట్టి సినీమా కెంగళొచ్చామని వెంకట్రావ్ భాగహారులు నెత్తీ నోరూ మొత్తుకుంటున్నారు. కాంతం 'పోలీసులు వచ్చి దొంగలను పట్టుకుంటాగు' అని ఓదారుస్తోంది ఆడవాళ్లని. ఓదార్చవాళ్లుంటే యేడుపు ప్రతి హెచ్చుతుంది. కాంతంకూడ కన్నీరు తెచ్చుకొని 'యే వెధవలకు పుట్టిందో ఆ పాడు బుద్ధి. పాపానికి ఫలితం అనుభవిస్తా రత్తమ్మా' అని పరిపరివిధాల ఓదార్చింది.

కాంతం యింట్లో కాలుపెట్టింది. భర్తకోసం యిల్లంతా ఒక్కసారి గాలించింది. భర్తజాడ లేదుగాని, భర్త వ్రాసినజాబు టేబిలుమీద వుంచగా తీసి యిలా—

'కాంతం! జన్మజన్మాలకు నా భార్యవుకదే. వ్రాయటానికి కూర్చున్నాగాని చేతిలోని కలం సిరాని కక్కుతోంది. నా జీవితం—నీ జీవితం—ఇదే నేనెన్నోసార్లు నీతో అన్న నా ప్రపంచం! నరకస్వర్గాలకు మధ్య నన్ను లేదా!!

'నాలాంటి త్రాగుబోతుకు మంచీ చెడ్డా తెలుసుకొనే విచక్షణజ్ఞానం యెందుకు ప్రసాదించాడా వెర్రి దేవుడు? నాన్న నమ్మినవారిధనం దోచి చచ్చాడు. నేను నమ్మినవారి జీవితాన్నే దోచేస్తున్నానని భయంగా వుంది—రక్తస్పర్శ!!

'శరీరంఅంతా పీకెడుతోందని, బాధతక్కువైనా చచ్చిపోతున్నట్లు నటించి త్రాగటానికి పరుగెత్తేవాడిని. మనసు కట్టుకోలేనివాడిని, మంచి చెప్పి ఆచరించలేనివాడిని త్రాగి నీ ఒళ్లెందుకు హూనం చెయ్యాలి? ఇదే నన్ను నలిపివేస్తున్న విషయం. నీకున్న సంతృప్తి నాకెందుకు లేకపోవాలి? నీకున్న గుండెధైర్యం నాకెందుకు దూరంగావాలి? ఇవన్నీ తలచుకుంటుంటే యీ జన్మలో నీకూ నాకూ వుస్తే ముడివలన సంబంధమే కానీ హృదయాలవలన కాదేమో?

'ముందుగానే వ్రాస్తున్నా. పోచాక మన సెలా వుంటుందో. నగలు, డబ్బు తెస్తానని ధైర్యంగా వుంది. అది నా డబ్బే. కాని, లోకం నీవుకూడ దొంగడబ్బంటారు, నీతిలేని కార్యమంటారు. యింత డబ్బు త్రాగుడుక్రింద తగలేశాను. బీదలకు ఒక్కకానీ ధర్మం చెయ్యలేదు. యీ డబ్బు నీకిచ్చినా నీవు పుచ్చుకోవని నా దృఢనమ్మకం. యీ దోచిన డబ్బుతో యిల్లు వదలి పేదలకు పంచిపెట్టి జైలుకుపోతాను. విడిపించటానికి ప్రయత్నం చెయ్యకు. సంఘంపెట్టిన నియమాన్నిబట్టి నాతోనే నీసంబంధంకాబట్టి ప్రయత్నం చేస్తే నీకే నష్టం. జైలులో వుంటే ఆ మన సెలా కట్టుబడిదో చూస్తాను. నా యీ పనివలన యెందులాభాలు—పుణ్యం; జీవితం చక్కబడటం వందలు బదులుగా వేలు దోచటానికి వస్తున్నా. యెవరికీ దొరకనని నా ధైర్యం.

'నీతో త్రాగనన్నా. కానీ ఆఖరుగోట్లు త్రాగాలని మనసుపోతోంది. త్రాగి తెలివి తెచ్చుకొని యెక్కడో నీవు వూహించలేని చోటుకు పోతాను. జైలు అధికారుల ధర్మమా అంటూ కష్టపడటం నేర్చుకుంటాను. అప్పుడే మన యిద్దరం క్షేమంగా కాలం గడపగలమని నా ఆశ.

'అదిగో గోడగడియారం పదికొట్టోంది. కలంలో సిరాకూడా ఆఖరు. నీ—

వెంకట్రావ్'

ఉత్తరం చేతిలోనుంచి జారిపోయింది. కళ్లల్లో నీరు తిరిగిందిగాని జారి క్రిందపడలేదు. అలా శిలాప్రతిమలా నిలుచుండిపోయింది. 'నీతిలేని కార్యం చెయ్యంది నిలవలేక పోయా రన్నమాట! దొంగలు రాకుండా యింటిని చూస్తానని దొంగతనానికివెళ్లారు! త్రాగనని ఒట్లువేసి మాట నిలుపుకోలేకపోయారు! దుర్బలు లయ్యారు. నాతో మీ అసలు మనసును చెప్తే నేనే స్తంభానికి త్రాళ్లతో కట్టి త్రాగుడు మానిపించి వుందునే—హో జీవితం!' అనుకుంటూ ఆ ప్రతిమ పెద్ద వీధిగుండా కదులుతోంది. చూచేవారు ఆశ్చర్యపోతున్నారు. యీ ఘోషాస్త్రీ యిలా రావటంతో వీధిఅరుగుమీద కొందరు గ్రామపెద్దలతో కూర్చున్న మునసబుగారితో 'బాబూ 'దొంగలుదొరికారు. నాభర్త

దొంగతనం చేసి పరారయ్యారు. ఆయన శరీరంలో అర్ధభాగాన్ని నేను. నన్ను దయచేసి జైలుకుపంపండి'— ఆమెమాటల్లో గంభీరత, నటనలో శాంతం గోచరిస్తోంది. అందరూ ఆమెవేపు జాలినిండిన కళ్ళతో చూస్తున్నారు. పరుగెత్తుకొని వచ్చాడు కాంతంచిన్నమామ. 'మరెవరూ కాదండీ మునసబుగారూ! అదిగో ఆ ట్రంకుపెట్టె లోనే. వెంకట్రావ్. ఇదిగో పెరటి ముళ్ళపొదదగ్గర వాడి వ్రాటకలం దొరికింది. వాడే, వాడే'. అని ఆతృతగా చెప్పుకపోతున్నాడు. కాంతం తల దించి అలా నిలుచునే వుంది. ఇంతలో యింకొకడు పరుగెత్తుక వచ్చి 'బాబూ! వెంకట్రావుగారు వల్లకాడులో వచ్చిపడున్నారు. కాకులు, గద్దలు మూగుతున్నాయి'.

'హా' అంది కాంతం. నీటితో నిండివున్న కళ్ళనుంచి ప్రవాహం వుబికి ప్రవహించింది. అధిక దుఃఖం మానవులను పిచ్చివాళ్ళగానైనా చేస్తుంది. లేదా గుండెనైనా ఆపుతుంది. ఆ దొంగతనానికి శిక్ష అనుభవించంది కాంతం చనిపోదేమో!

పోలీసులు వచ్చారు. ఇల్లంతా సోదాచేశారు. పెట్టెలో నగలు, డబ్బు దొరికింది. కాంతంకు వ్రాసిన ఉత్తరంకూడా దొరికింది. శవపంచాయితీకూడా జరిగింది. ఆమెమాట విన్నవారెవరు? ఆమె జైలుకు వస్తానంటుంటే కనికరం, కళ్ళనీరూ అందరినీ చుట్టుముట్టింది. డోలీకట్టి శవపరీక్షకు పట్నం తీసుకపోతున్నారు వెంకట్రావ్ భౌతికశరీరాన్ని. 'నన్ను శిక్షించండి. ఆ దొంగతనం నే చేస్తే ఒకటి కాదు. నా భర్త చేస్తే వేరొకటి కాదు' అంటూ ఆమె వెనుక పరుగెత్తబోయింది. ఆడంగులు ఆమెను వారించి పట్టుకున్నారు.

వెళ్ళిపోతున్న డోలీవేపు చూచి బిగ్గరగా నవ్వుతూ "హా హా హా దొంగ. నీతిలేని చావు. ఛీ ఛీ జన్మజన్మాలకు భర్త ఛీ ఛీ వద్దు వద్దు. చావటానికి జైలుకు పోవడానికి నీతిలేని పని ఛీ ఛీ వద్దు వద్దు హా హా హా..." తల విరగబోసుకుని నవ్వే ఆమెవేపు చూసి అందరూ కళ్ళల్లో నీరు తెచ్చుకుంటున్నారు.

మాటాడితే 'పిచ్చిదానా' అని సంబోధించిన వెంకట్రావ్ పిచ్చిదాన్ని చూడలేకపోయాడు. దోచే ప్రపంచానికి సాయంచేసిన కలం దోచిననాడినే చూపించినందుకు దానిపై పెంచిన ద్వేషాన్ని కాల్చలేకపోయాడు.

సాయంత్రమయే సరికి వచ్చిన తండ్రివేపు చూచి— 'మురళి—హా' అంటూ నిశ్చేష్టురాలైంది. అప్రయత్నంగా చెవులు మూసుకుంది. అక్కడ నిలువలేక యెక్కడికో పరుగెత్తబోయింది. అపధాన్ని గోడకు చేరబడలేదు. యేడుస్తూ భార్యలా తల బాదుకుంటున్నాడు.

---




శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్య

ఆధునికయుగములో, అనగా గత నాలుగువందల సంవత్సరములుగా—ఒక్కొక్క కాలమందు ఒక్కొక్క దేశము ప్రపంచమునందంతట అగ్రస్థానము వహించుటకు ప్రయత్నించెను. 16 వ శతాబ్దమున స్పెయిన్ దేశము, 18 వ శతాబ్దమున ఫ్రాన్సు ఇంగ్లండు దేశములు, 19 వ శతాబ్దమున ఇంగ్లండు జర్మనీదేశములు, ప్రస్తుతకాలమున అమెరికా రష్యా దేశములు ఈ స్థానమునకై ప్రయత్నించినవాటిలో పేర్కొనదగియున్నవి. ఇవన్నియు పాశ్చాత్యదేశములు. రాజకీయముగ ప్రాబల్యమును సంపాదించుటయే వీటి ఉద్దేశము. ఏషియాఖండములో ఆధునికయుగమందు ఇట్టి ప్రయత్నము గావించిన దేశములు లేవని దీని భావము కాదు. కాని ఒక జపాన్ దేశముతప్ప ప్రాగ్దేశములలోని మరి ఏదేశముకూడ ఇట్టి ప్రయత్నమునకు దిగినది లేదు. మొగలాయీసామ్రాజ్యమునాటి భరతఖండముగాని, చైనాదేశముగాని ఈలాటి ఉద్యమమును తలపెట్టియుండలేదు. ఈ కారణముచేతనే ఆధునికయుగమును ఐరోపియనుల యుగమని చరిత్రకారులు పేర్కొనుచున్నారు. ఐరోపియనుల యుగమనగా ఐరోపియనుల ప్రాబల్యము ప్రపంచమందంతట వ్యాపించిన యుగమని అర్థము. అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలెండులు పూర్తిగా ఐరోపియనుల నివాసస్థానము లగుటయు, ఆఫ్రికాఖండములో చాలభాగమునందును, ఆసియాఖండములో అనేకదేశములందును వారిప్రభుత్వము స్థాపితమగుటయు దీనికి తార్కాణము.

ప్రస్తుతము ఈ ప్రపంచపు ఆధిపత్యమునకై పోరాడుచున్నవి అమెరికా రష్యా దేశములు. ఇందులో ఏది గెలుచునో, ఏది ఓడిపోవునో చూడవలసియున్నది. ఇవి కోరుచుండునది ప్రపంచఆధిపత్యముగుటచేతను, ఇతరదేశములను తమ పలుకుబడిలోనికి తెచ్చుకొనినగాని వీటి యుద్దేశములు నెరవేరజాలని కారణముచేతను, వీటిని పరిపాలించు ప్రభుత్వముల వారు దినదినము వేయుచుండు ఎత్తులు అన్నిదేశముల వారు గమనించవలసియున్నది.

అమెరికా అధ్యక్షపదవికై నవంబరు 2 వ తేదీన జరిగిన ఎన్నికల ప్రాధాన్యమును ఈ దృష్టినుండియే గుర్తించవలెను. ఈ ఎన్నికలలో ట్రూమన్ గెలుచుటయు, డ్యూయీ ఓడిపోవుటయు సంభవించెను. మనకు ఎన్నివేలవేల మైళ్ల దూరమందుండు అమెరికాలో ఎవరు అధ్యక్షులైన మన కేమి అను ఉదాసీనభావము తగినది కాదు. ఏలనగా: దీనిమూలమున అన్ని దేశముల వ్యవహారములలో కొంత మార్పు కలుగుట తప్పదు. ట్రూమన్ ఇదివరకు మూడుసంవత్సరములుగ అధ్యక్షుడుగ నుండినవాడు. అమెరికాప్రజలు తిరిగి అతనినే ఎన్నుకొనుటవలన అతడిదివరకు అనుసరించుచుండిన రాజనీతిని వారు ఆమోదించిరనియు, అట్టి రాజనీతిని మరింత పట్టుదలతో అతడు అనుసరించు ననియు స్పష్టమగుచున్నది. మరి నాలుగు సంవత్సరముల కాలము అతడు అధ్యక్షుడుగ నుండును. ఈ నాలుగు సంవత్సరములలో అమెరికాదేశపు అంత

రంగికవ్యవహారములలోను, విదేశవ్యవహారములలోను ఇతఁ డిదివరకు తలపెట్టిన ఉద్దేశముల నన్నిటిని ఎక్కువ వీలుతో అతఁడు సాధించుటకు ఈ ఎన్నికవలన ఎక్కువ అవకాశము ఏర్పడినది.

ఈ ఎన్నికలలో ఇంకొక విశేషముకూడ ఉన్నది. అధ్యక్షుని ఎన్నికలతోపాటు అమెరికాలో కాంగ్రెసు అనుపేరఁ బరఁగు కేంద్రశాసనసభలకుగూడ ఎన్నికలు జరిగెను. అందులో ట్రూమన్ పక్షమగు డెమాక్రాటిక్ పక్షమునకు చెందిన అభ్యర్థులే అధిక సంఖ్యాకులుగ ఎన్నుకొనబడిరి. ఇదివరకు—అనగా ఎన్నికలకు పూర్వ ముండిన—కాంగ్రెసులో అతని ఎదటిపక్షమువారు అధికసంఖ్యాకులుగ నుండినందున అతని ఉద్దేశములు సులభముగ కొనసాగకుండెను. ఇప్పు డట్లుగాక, అతనికి అనుకూలమగు శాసనసభ ఏర్పడినకారణమున, అతఁడు తలపెట్టిన కార్యము లన్నియు జరుగు నని చెప్పవచ్చును.

ట్రూమన్ ఉద్దేశములు ఏవి యనెడి ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. అంతరంగికవ్యవహారములలో ఇతఁడు కొంతవరకు నీగ్రోలయొక్కయు, కార్మికులయొక్కయు పక్షపాతి. అమెరికాలో సుమారు ౧ కోటి ౩౦ లక్షల నీగ్రోలున్నారు. వీరు నల్లరంగుజాతివా రన్నకారణముచే అచ్చట బహుసంఖ్యాకులుగ నుండు శ్వేతజాతివారు వారిని అత్యధికముగ అనాదరించుచుందురు. అస్పృశ్యతవలన మన దేశములో హరిజనులు ఇదివరకు పడుచుండిన బాధలకంటె నీగ్రోలు పడుచుండు బాధ వేయిరెట్లు ఎక్కువగ నున్నది. ఇదిగాక అస్పృశ్యత తొలగిపోవలె ననియు, సవర్ణులు అవర్ణులు సమత్వసిద్ధాంతము నవలంబించి ఒకేజాతిగ ఏర్పడవలె ననియు విశ్వసించనివారు మన దేశములో ఒక్కరుకూడ లేరు. అస్పృశ్యులు అస్పృశ్యులుగనే ఉండవలె నని వాదించు మూఢులు, పూర్వాచారపరాయణులు లేరని చెప్పవచ్చును. కాని అమెరికాలోని పరిస్థితులు ఇట్టివి కావు. నీగ్రోలు శ్వేతజాతులవారితో సమత్వము ననుభవించుట కర్హులని చెప్పువారి సంఖ్య చాల తక్కువ. వారి ఉద్ధరణమునకై పాటుపడువా రెందరో లేరు. అట్టి స్థితిలో వారిపట్ల సానుభూతిని చూపుటకు ట్రూమన్ సంకల్పించియున్నాఁడు. అతని సంకల్ప మిట్టిది యని గ్రహించియుండియే, వారు అతనిని ఎన్నుకొనుటనుబట్టి, వారుకూడ కొంతవరకు నీగ్రోలవిషయమై తమ యభిప్రాయములను మార్చుకొనుచున్నా రని చెప్పుటకు అవకాశము కలుగుచున్నది. ఇదిగాక ట్రూమన్ కార్మికులయందు ఎక్కువ పక్షపాతము కలవాఁడు. సమ్మెలు అక్రమము లనియు, సమ్మెలలో దిగు కార్మికులను కొన్ని పరిస్థితులలో శిక్షింపవచ్చు ననియు విధించిన శాసనములకు విరోధి. కంట్రోలుద్వారా వస్తువుల ధరలను తగ్గించి సామాన్యప్రజల స్థితిగతులను చక్కజేయవలె నని కోరువారిలో అతఁ డొకఁడు. కనుక ఈలాటి వ్యవహారములన్నిటిలో ట్రూమన్ తన ఉద్దేశములను సాధించుకొనగల డని ఊహింపవచ్చును.

విదేశవ్యవహారములలో అతఁ డొక ప్రధాన సంకల్పము కలవాఁడు. రష్యాయొక్క రాజకీయ ప్రాబల్యముగాని, రష్యా అనుసరించుచుండు కమ్యూనిస్టు సిద్ధాంతముగాని ప్రపంచమందంతట వ్యాపింపరాదు అని అతని ఉద్దేశము. ఇట్టి వ్యాప్తికి రష్యా చేయుచుండు ప్రయత్నముల నన్నిటిని విఫలితములుగావించుటకై అతఁ డిదివరకే ఎంతో కృషి చేసినవాఁడు. అతని ప్రత్యర్థులలో నొకఁడగు వాలేసు రష్యాతో సౌహార్ద మైత్రిని ప్రకటించినవాఁడు. అట్టివానిని ఓడించి, ట్రూమనునే గెలిపించుటచేత అమెరికా ప్రజలు రష్యాప్రాబల్యమును, కమ్యూనిస్టుతత్త్వమును ఖండించుటకు సిద్ధపడినా రనియు, అవసరమైనచో యుద్ధము చేసియైనను రష్యాను వారు అరికట్టుటకు తలచియున్నా రనియు స్థిరమయ్యెను. రష్యా అమెరికాలమధ్య ఇదివరలో ఏర్పడిన విరోధము మరింత వృద్ధియగునేగాని తగ్గజాల దని ట్రూమన్ ఎన్నిక ఋజువుచేసిన దని చెప్పవచ్చును.

రష్యాయొక్క బలమును తగ్గించుటకు ట్రూమన్ అనుసరించిన మార్గము లన్నిటిలో పశ్చిమ యూరోపుదేశము లన్నిటికి ఆర్థికముగ సహాయముచేసి, అచ్చట అమెరికాయొక్క సైనికశిబిరములను, నౌకాశ్రయములను, విమానాశ్రయములను స్థాపించుకొని,

వారు ఈ సమ్మెలను అణచివేయగలిగిరిగాని శాశ్వతమైన శాంతిపరిస్థితులను కల్పించలేకున్నారు.

ఫ్రాన్సుదేశములో ప్రస్తుతము డీగాల్ అను ప్రముఖనాయకు డొకడున్నాడు. ఇతడు కమ్యూనిస్టులకు పరమవిరోధి. సాధారణమైన సోషలిస్టు విధానముకూడ ఇతనికి గిట్టదు. ఇతడు ఒకమోస్తరు నియంతృత్వవిధానమును స్థాపించి ఫ్రెంచిజాతియొక్క పేరుప్రతిష్ఠలను పునరుద్ధరింప సంకల్పించినవాడు. జర్మనీ, జర్మనులు అన్న ఇతనికి అపరిమితమైన బెదురు. మూడు పర్యాయములు—గత ౮౦ సంవత్సరములమధ్య—జర్మనులచేత ఫ్రెంచివారు దెబ్బలు తిన్నవారగుటయే ఈ భయమునకు కారణము. రెండవ ప్రపంచయుద్ధకాలమున అక్షపాతికులైన జర్మనులు ఎన్నటికికూడ తలయెత్తరాదని ఇతని దీక్ష. ఫ్రాన్సులో ఇతనికి గల పలుకుబడి కంతకు ఇదియే కారణము. నవంబరులో శాసనసభకై జరిగిన ఎన్నికలలో ఇతని పక్షమువారు రనేకులు జయముగాంచిరి. ందుచేత ఇతని ప్రాబల్యము హెచ్చుచున్నదని చెప్పవచ్చును. ఇది మరికొంతమేము స్థిరగాంచినయెడల దేశమున కితడు నియంతయై హిట్లరు జర్మనీని నడిపినవిధమున కొంతవరకు ఇతడు ఫ్రాన్సును నడుపునని అనుట అతిశయోక్తి కాదు.

జర్మనీవిషయమై డీగాలు కున్న అభిప్రాయములకును, ఇదేవిషయమై బ్రిటిష్, అమెరికావారికి గల అభిప్రాయములకును గల భేదము గమనించదగియున్నది. పశ్చిమయూరపుదేశముల ఆర్థికస్థితి చక్కబడుటకు జర్మనీలో ఉత్పత్తియగు బొగ్గు, ఇనుము, ఉక్కు మొదలైన సామగ్రి అత్యవసరమని రెండుపక్షములవారు అంగీకరించుచున్నారు. ఈ సామగ్రిని రెండవ ప్రపంచయుద్ధమునకు పూర్వము జర్మనులు ఎంత అధికముగ తయారుచేయుచుండిరో అంత అధికముగ ఇకమీదటకూడ తయారుచేయవలసిఉన్నదనికూడ వీరు అంగీకరించుచున్నారు. కాని ఈ తయారగుట అంతయు ఎవరి అధీనమున జరుగవలెను? తయారైన సామగ్రి ఫ్రెంచివారు, ఇతరులు ఎంతెంత వినియోగించవలెను? పంపకము ఏపద్ధతిని జరుగవలెను? అన్న విషయములనుగురించి విపరీతమైన అభిప్రాయభేద మేర్పడియున్నది.

జర్మన్ కార్మికులయొక్కయు, నాయకులయొక్కయు సహాకారము లేక ఆ దేశములోని బొగ్గుగనులనుగాని, ఇనుము ఉక్కు పరిశ్రమలనుగాని నడుపుట సాధ్యముకాదనియు, ఆకారణముచేత కొంతవరకైన వీటిని వారి అధీనమందుంచుట అవసరమనియు, వారి అధీనమును పూర్తిగ మాని అన్నిటిని తమ యాజమాన్యమున ఉంచుకొని బ్రిటిష్ అమెరికా ఫ్రెంచివారు ఈ పరిశ్రమలను నడుపుట ఆకాశమందు హర్మ్యములు కట్టజూచుట అని బ్రిటిష్ అమెరికనుల వాదము. జర్మనులు యుద్ధమందు ఓడిపోయిన మాట వాస్తవమే. కాని అంతమాత్రముచేత వారి సహాకారసానుభూతులు లేక జర్మన్ సామగ్రిని తయారుచేయుటకు వీలగునా? ఈ సామగ్రీసహాయము లేక పశ్చిమయూరపుదేశములోని తక్కినదేశములు ముందుకు రాగలవా? ఇవి ముందుకు రానియెడల రషియావారలమునను, కమ్యూనిస్టులమునను పశ్చిమయూరపునకు రానున్న ప్రమాదమునుండి తప్పించుకొనుట సాధ్యమగునా? కాదనియే బ్రిటిష్ అమెరికావారి అభిప్రాయము. కాని డీగాలు ఈ వాదమును పరిపూర్ణముగ అంగీకరించుట లేదు. పారిశ్రామికముగ జర్మనులు ముందుకు వచ్చినయెడల వారు వారి బలమును ఫ్రాన్సుదేశవినాశమునకై ఉపయోగింతురని అతనినమ్మకము. కాని ఆ బలమును రషియాను అణచుటకై ఉపయోగించవచ్చునని బ్రిటిష్ అమెరికావారి ఊహ. బలమును సమకూర్చుకొన్నతర్వాత జర్మనులు ఫ్రెంచివారిపై విరోధమును వహింతురా అన్నదే ఇప్పుడేర్పడిన సమస్యలలో గడ్డుదిగనున్నది.

ఈ సమస్య పరిష్కారమగుటకై నవంబరులో ఈ మూడుదేశముల ప్రభుత్వప్రతినిధులకు లండనులో అనేకసంప్రతింపులు జరిగినవి. ఇంకను జరుగుచున్నవి. ఓడిపోవుటకు పూర్వము జర్మనీ ఎంత ప్రమాదకరముగనుండెనో ఓడిపోయినతర్వాతకూడ అంత ప్రమాదకరముగనున్నది.

కాని కమ్యూనిస్టు తత్వమును, రషియాయొక్క ప్రాబల్యమును అరికట్టుటకు పశ్చిమయూరపుదేశముల

వైపు దృష్టిని కేంద్రీకరించుట తగిన సాధనమా అన్న సంశయము అనేకులకు ఇదివరకే ఉండెను. ప్రస్తుతము చైనాలో ఏర్పడుచున్న పరిస్థితులననుసరించి ఈ సంశయము మరింత బలపడినది.

నవంబరులో కమ్యూనిస్టులు చైనాలోని ప్రధాన రాష్ట్రములలో మిక్కిలి ఐశ్వర్యవంతమైన రాష్ట్రమగు మంచూరియాను పూర్తిగ స్వాధీనముచేసికొని, ఉత్తర చైనాను ప్రవేశించి అచ్చటి రాష్ట్రములను కొన్నిటిని వశపరచుకొని, తుదకు చైనాకు ప్రధానపట్టణమగు నాంకింగుపై దాడిచేయుచున్నారు. కొద్దిరోజులలో ఇదికూడ వారి స్వాధీనమైనను కావచ్చును. అది జరిగిన యెడల చైనాలో సగభాగము కమ్యూనిస్టు పాలనలోనికి వచ్చినట్లగును. అనగా సుమారు 20కోట్ల జనము వారికి వశులగుదురు. పశ్చిమయూరపులోని జనసంఖ్యకూడ ఇంతటిదే. కాని ప్రమాదము ఇంతటితో మాత్రము ఆగదు. ఉత్తరచైనాను ఆక్రమించిన కమ్యూనిస్టులు దక్షిణచైనానుకూడ క్రమింగి వేయగలరు. 40 కోట్ల జనము గల చైనా అంతయు వారి పాలనలోనికి వచ్చినతరువాత కమ్యూనిస్టువ్యాప్తిని అరికట్టవలయుట సముద్రపుతరంగము లను అరికట్ట ప్రయత్నించుటయే. ఇదిగాక ఆగ్నేయ ఆసియాల్లోని ఇండోనీషియా, ఇండోచైనా, మలయా, సయాం, బర్మాదేశములలో ఇదివరకే కమ్యూనిస్టులు ప్రబలియున్నారు. అధికారమును సంపాదించుటకై వారు యుద్ధములను గావించుచున్నారు. కొంతవరకు చైనాలోని కమ్యూనిస్టులే వారికి అండగా నిలబడి యున్నారు. ఇట్టి పరిస్థితులలో చైనాదేశములో చాల భాగము కమ్యూనిస్టుల అధీనమైనయెడల ఈ దేశములు కూడ కమ్యూనిస్టుపాలనలోనికి వచ్చుట సులభమగును. ఇదంతయు కొద్దికాలములోనే జరుగవచ్చును. కొరియాలో ఉత్తరభాగమంతయు ఇదివరకే వారి పాలనలో నున్నది.

ఇట్టి పరిస్థితులలో అమెరికనులు వారి దృష్టిని వారి ఆర్థికసహాయమును ఒక పశ్చిమయూరపుదేశములందుమాత్రమే కేంద్రీకరించుట లాభకారి యగునా? అన్న సందేహము కలుగకమానదు. తూర్పుఏషియా అంతయు కమ్యూనిస్టుమయమైనయెడల దానిని నిరోధించుటకు అమెరికావారికి సాధన మేమి కలదు?

ఈ ఆందోళనలోనే ట్రూమన్ ఇప్పుడు పడియున్నాడు. చైనాలోని కమ్యూనిస్టులతో అనేక సంవత్సరముల నుండి యుద్ధము సాగించుచున్న చియాంగ్ షేకుకు సహాయము చేయుటయా, మానుటయా అన్నదే అతనిని కలవరపరచుచుండు ప్రశ్న.

ఇందులో సాధకబాధకములు రెండును కలవు. సహాయము చేయనియెడల తూర్పుఏషియా అంతయు కమ్యూనిస్టుపాలనక్రిందికి వచ్చుట తథ్యము. ఇది జరిగిన యెడల మూడుసంవత్సరములుగ ట్రూమన్ ఏర్పరచుకొన్న సంకల్పమంతయు భగ్నమైనట్లే. కాని ప్రస్తుత పరిస్థితులలో చియాంగుకు సహాయముచేయుట సాధ్యమా, దానివలన ప్రయోజనమేమైన ఉండునా? అన్నదికూడ ట్రూమన్ ఆలోచించవలసియున్నది.

ఇరవై సంవత్సరములుగ చియాంగ్ చైనాకు నియంతగ నున్నాడు. కాంగ్రెసుపక్షమునకు ౧౯౪౭లో మనదేశమందు ఎంత పలుకుబడి ఉండెనో, అంతకంటె ఎక్కువపలుకుబడి అతని పక్షమగు కోమింటాంగుపక్షమునకు ఉండెడిది. ప్రజలందరు అతడే దేశరక్షకుడు కాగలడనియు, అతని పక్షమొక్కటియే అనుసరణీయమైన దనియు భావించి ప్రవర్తించుచు వచ్చిరి. వారి ఆశలు నిరాశలు కాకుండ అతడు దేశమును జపానువారినుండి రక్షించి స్వాతంత్ర్య స్థాపకు డయ్యెను. కాని ఈవిజయము లభించినతర్వాత, గతమూడుసంవత్సరములలో అతని ప్రభుత్వము ప్రజల ఆదరమునంతను కోల్పోయెను. ప్రభుత్వాధికారులు స్వలాభపరులై, లంచగొండులై ప్రజలను పీడించ సాగిరి. సైన్యాధిపతులు కమ్యూనిస్టులతో యుద్ధము చేయుటకు బదులు తమలో తాము యుద్ధమునకు దిగిరి. సైనికులు అమాయకులగు ప్రజలపై బడి వారిని దోచుకొనసాగిరి. ప్రభుత్వమువారు సామాన్యులపై విస్తారములగు పన్నుల విధించి, వచ్చిన ఆదాయములో చాల భాగమును ప్రజలసౌకర్యములకు గాక సైన్యముక్రిందను, ఉద్యోగస్థులజీతములక్రిందను ఖర్చుపెట్టసాగిరి. ఖర్చులకు కావలసిన ఆదాయమునంతను పన్నుల మూలమున సంపాదించలేక చెలామణిద్రవ్యమును విపరీతముగ వృద్ధిచేసిరి. అందుచేత అవసరపదార్థముల ధరలు

వేయి రెట్లు పెరిగి జీవితమే దుస్తరమయ్యెను. జమీందారీవిధానమును, ధనికుల దౌర్జన్యమును తొలగించి రైతుల స్థితిగతులను చక్కజేయుటకు కావలసిన సంస్కరణము నొక్కదానినిగూడ ప్రభుత్వము చేయక పోయెను. చియాంగ్ ప్రభుత్వము మూలమున లాభము లేకపోవుటయేగాక ప్రజలనుభవించు కష్టములు దుర్భరము లయ్యెను. అతని సేనాప్రతినిధులు అడుగంటెను. ఇదివరకు అమెరికనులు అతనికి చేయుచుండిన సైనిక సహాయమును అతడు చక్కగ వినియోగింపలేక పోయెను. వారు పంపిన సైన్యసామగ్రి కమ్యూనిస్టుల హస్తగతమయ్యెను. అతనియందు సానుభూతి చూపు ప్రజలు చైనాలో ప్రస్తుతము ఎవ్వరునులేరని చెప్పుటలో అతిశయోక్తి లేదు. అతని ప్రభుత్వముకంటె దౌర్జన్యముతో గూడిన కమ్యూనిస్టుప్రభుత్వమే మెరుగనుండు నను భావము దేశమందంతట వ్యాపించియున్నది.

మహామహుడనియు, దేశభక్తుడనియు ఒకప్పుడు ప్రఖ్యాతిగాంచిన చియాంగ్ ప్రజలదృష్టిలో ఇట్టి స్థితికి వచ్చుట ఆలోచించదగిన విషయమే.

ఈ కారణముచేతనే ట్రూమన్ చైనాకు సైనిక సహాయము చేయ సందేహించుచున్నాడు. అసమర్థుడును, ప్రజల ఆదరమును గోల్పోయినవాడును అగు చియాంగుకు సహాయముచేయుట వలన లాభము లేదని అతడు అభిప్రాయపడుచున్నాడు. కాని కమ్యూనిస్టులను అరికట్టుటకు ఉపాయాంతర మేమైన నున్నదా?

కమ్యూనిస్టు కోమింటాంగ్ పక్షములుగాక చైనాలో ప్రజాస్వామ్యవిధానమునందు విశ్వాసము గల మధ్యపక్షములు కొన్ని ఉన్నవి. వీటి నాయకులు కమ్యూనిస్టులతో సమాధానము చేసికొని, మిశ్ర ప్రభుత్వము నొకదానిని స్థాపించి, సర్వవినాశకరమగు అంతర్యుద్ధమును ఆపి, శాంతిభద్రతలను ఏర్పరచి, ప్రజలకు కావలసిన సంస్కరణముల గావించుట కిదివరకు కొన్ని ప్రయత్నముల చేసియుండిరి. అట్టి మిశ్రమ ప్రభుత్వము నొకదానిని స్థాపించుట మంచిదే. కాని కమ్యూనిస్టుప్రమాదము అంతమాత్రముచేత తప్పిపోవునా? కమ్యూనిస్టులు లేని, మధ్యపక్షములవారి ప్రభుత్వమును స్థాపించి, దానికి సైనికసహాయము చేయుట మంచిదని ట్రూమన్ సలహాదారులలో కొందరి అభిప్రాయముగ నున్నది.

తుదకు చైనాదేశములో ఇప్పుడు ఏర్పడిన పరిస్థితులు చైనాకే గాక ఏషియాలోని తక్కిన దేశములకును, అమెరికాకును చిక్కులను కలిగించిన వనుట నిర్వివాదాంశము.

చైనాలో ఏర్పడుచున్న ఇట్టి పరిస్థితులను, ఇండోనీషియా ఇండోచైనా మొదలగు దేశములలో స్వరాజ్యార్థమై యూరోపియన్ సామ్రాజ్యాధిపతులతో ప్రజలు గావించుచున్న పోరాటములను గమనించియే మన ప్రధానియగు పండిత నెహ్రూగారు ఐక్యరాజ్యసమితి మహాసభలో గావించిన మహోపన్యాసమున, "ఏషియా వ్యవహారములను విస్మరించి ప్రపంచశాంతిని నెలకొల్పుటకై మీరు చేయు ప్రయత్నములు ఎన్నటికిని సఫలములు కాజాలవు. ఏషియాఖండవాసులు ఇంతకాలము నిద్రపోవుచుండినమాట వాస్తవమే. కాని వా రిప్పుడు మేల్కాంచిరి. ఇక కొద్దికాలములో వారిని అరికట్టుట సాధ్యము కాదు. వారిని కాదని ప్రపంచసమస్యలను పరిష్కరింపబూనుట హాస్యాస్పదము" అని హెచ్చరించెను. ప్రపంచశాంతికి యూరోపుకంటె ఏషియాఖండమే కీలకమన్న సత్యమును పాశ్చాత్యులు గ్రహించవలెను.

చైనానుగురించిన వివరములు మనము తెలిసికొనుట నిరర్థకము కాదు. అది మనకు చాల అవసరము. క్రొత్తగ మనము సంపాదించిన స్వరాజ్యమును, స్వాతంత్ర్యమును సామాన్యప్రజల ఉపయోగార్థము వినియోగించినగాని దేశములో శాంతిభద్రతలు స్థిరముగ ఏర్పడి ఐశ్వర్యమభివృద్ధిగాంచ దను గుణపాఠము చైనాయొక్క ప్రస్తుత చరిత్ర సాటించుచున్నది.

ఈ సందర్భములో నవంబరుమాసమున మన దేశపు వ్యవహారములలో హర్షింపదగిన విషయ మొకటి కలదు. సంవత్సరమునుండి కాశ్మీరములో పోరుచున్న మన సైన్యములకు కొన్ని ప్రదేశములందు అఖండవిజయము కలిగినది. పాకిస్థాన్ సైన్యములకును, దోపిడి

వలె ననియు వారి నాయకులలో కొందరు ప్రచారము చేయుచున్నారు. సైన్యములో ప్రాధాన్యము వహించియుండునట్టియు, సరిహద్దురాష్ట్రమగు తూర్పుపంజాబులో నివాసముచేయుచుండునట్టియు శిక్కులలో సంకుచితమగు ఇట్టికులతత్వము మొలకలెత్తి వృద్ధిగాంచుచుండుట బహుప్రమాదకరము. కులతత్వమును నిరసించువారని పేరుపెట్టుకొన్న కాంగ్రెసుసంస్థలోకూడ ఇట్టి తత్వము ప్రబలియున్నదని అనేకులకు తెలిసియున్నది. ఇట్టిసందర్భములో కాంగ్రెస్ ప్రభుత్వమువారు ఏవిధముగ శిక్కుల సమస్యను పరిష్కరింతురో చూడవలెను. కాంగ్రెసునుండి కులతత్వము నిర్మూలమైనగాని తక్కిన సంస్థలలోను, జనసామాన్యమునందును అది నిర్మూలము కాజాలదు.

భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమును గురించి విచారించుటకై ఏర్పాటుగావింపబడిన ఉపసంఘము నవంబరు ఆఖరుకు నివేదికను సమర్పించును అని అందరు అనుకొనియుండిరి. కాని అది జరుగలేదు. బొంబాయి రాష్ట్రములో సాక్ష్యమునిచ్చిన ప్రముఖులలో అనేకులు —ముఖ్యముగా జయకర్, పరంజపి, ఖేర్—వెంటనే భాషాప్రయుక్తరాష్ట్రములను నిర్మించవలసినట్లు చెప్పిరి. దీనిని ఆక్షేపించినవారి సంఖ్య బహుస్వల్పము. కాని ప్రభుత్వమును నడిపించుచుండు పండిత నెహ్రూ, సర్దార్ పటేల్ గార్లు ఎందుకో దీనికి విరోధులై ఉన్నారు. కేంద్రశాసనసభాధ్యక్షులగు మవలంకారు కూడ ఈనిర్మాణమునకు సుముఖులుగానే ఉన్నారు. కాంగ్రెసుఅధ్యక్షులగు పట్టాభి సీతారామయ్యగారుకూడ ఇది వెంటనే జరుగవలెనని ఈసమస్య ఉద్ఘాటించిరి. "జనవాక్యం చ కర్తవ్యం" అన్న సూత్రము ననుసరించి భాషాప్రయుక్తరాష్ట్రములను వెంటనే నిర్మింతురుగాక అని మనము ఆశించవలెను. అనవసరముగ దీనిని వాయిదావేసినయెడల కాశ్మీర్ కాందిశీకులు శిక్కులు సమస్యలతో పాటు ఈ సమస్యకూడ ప్రబలరూపమును ధరించి మరికొన్ని చిక్కులకు కారణమగును. గోటితో త్రుంచివేయదగినదానికి గొడ్డలి ఉపయోగించవలసి వచ్చుట అగును. (1-12-48)






# రంగురంగుల దీపాలు - సూర్యకాంతి గొట్టాలు

మానవుడు ఆశించేవాటిలో సూర్యరశ్మి ఒకటి. రాత్రిగూడ సూర్యుడు ప్రకాశింపవలె నను కోరికే ఎక్కువెక్కువ వెలుతురు నివ్వగలిగిన దీపములు కనిపెట్టుటకు దారితీసినది. అనాదినుండి జంతువుల బారినుండి మానవునిని సంరక్షించగలిగిన ఏకైకాయుధము అగ్ని. మానవుడు అగ్నిని తనకు దేవత్వము కలిగించునట్టిదిగా భావించి పూజించినాడు.

కాలక్రమేణ కాల్చబడిన పదార్థము వెలుతురు నిచ్చునని గ్రహించుటచేత క్రొవ్వొత్తులు, నూనెదీపములు, గ్యాస్‌దీపములు వెలయింపబడినవి. వెలుతురు వస్తువుఉష్ణోగ్రతనుబట్టి యుండును. నూనెదీపములలో వేడి మితము గాబట్టి వెలుతురు పల్చన. గ్యాస్ దీపములలో ఉష్ణ మధికముకాబట్టి కాంతి ఎక్కువ. విద్యుద్దీపములలోగూడ ఇదే సూత్రము. వీటిలో పూర్వము కర్బనకేసరములు (*filaments*) వాడెడివారు. ఇవి చాల పెళుసుగా, పసుపురంగువెలుతురు నిచ్చునవిగా నుండినవి. నేడు వాడుకలో నున్న దీపములు చాలవరకు తుంగస్థకేసరములు (*Tungsten filament*) గలవే. ఈ లోహమును ౬౧౦౦°*F* వరకు వేడిచేసినను కరగిపోదు. ఈ ఉష్ణోగ్రతలో కర్బనము ఆవిరిగా నుండగలదు. కావుననే తుంగస్థకేసరపు విద్యుద్దీపములు తెల్లని వెలుతురు నివ్వగలుగుచున్నవి.

కాని సూర్యకాంతికి సాటియయిన వెలుగు నిచ్చుటకు వస్తువుకు కావలసిన ఉష్ణోగ్రత పదివేల డిగ్రీలు! అదియుగాక ఎంత అధికమయిన ఉష్ణోగ్రతగల వస్తువయినను దాని శక్తిలో పదవపాలుమాత్రమే వెలుతురుగా నివ్వగలదు. మిగత అంతయు చుట్టుప్రక్కల నున్న గాలిని, పరిసరములను వేడిచేయుటలో వ్యర్థమైపోవుచున్నది. అందుకే శాస్త్రజ్ఞుని ఆదర్శము మిణుగురుపురుగు (*fire-fly*) యొక్క చల్లని వెలుగు (*Cold light*). ఈ వెలుతురు ఉష్ణవిహీనమైనది.

వెలుతురు స్వభావమునుగూర్చిన పరిశోధనలు దానినొక విద్యుచ్ఛుంబక (*Electro-magnetic*) తరంగముల సమూహముగా నిర్ణయించినవి. పదార్థములోని ప్రతిపరమాణువు, అధికోష్ణముకలనగాని, విద్యుత్పరమాణువుల తాకిడివలనగాని కంపించినపుడు ఏదో ఒక రంగు, లేక రంగుల వెలుతురు నిచ్చును. పరమాణువు వీణవంటిది. వీణాతంత్రుల కంపనము వివిధ స్వరముల నిచ్చునట్లు పరమాణువులోని స్పందనములు వివిధవర్ణ (*colours*) ములుగా బయల్వెడలును. సెకనుకు నాల్గువందల ఏభైయేడు లక్షలకోట్లసార్లు (౪౫౭ *billions*) కంపించు తరంగము ఎఱుపురంగుగాను, ఆరువందల ఇరవైలక్షల కోట్ల (౬౨౦ *billions*) సార్లు కంపించు తరంగము నీలిరంగుగాను, ఎనిమిదివందల ఇరువదిలక్షలకోట్ల (౮౨౦ *billions*) సార్లు స్పందించు తరంగము అదృశ్యముగాను మనకంటికి తెలియుచున్నది. వెలుతురుకు, ఇతర విద్యుత్తరంగములకు భేదము వాటి అలపొడవు (*wave-length*) లోనే. వాటి అల లెంత వేగముతో, సెకను కెన్నిమార్లు కంపించుచుండినను, వెలుతురు, విద్యుత్తు విశ్వములో సెకనుకు ౧౮౬,౦౦౦ మైళ్లప్రకారము పయనించుచున్నవి. విద్యుత్తు వాయురూపములో నున్న పదార్థములోనికి ప్రవింపజేసినపుడు వెలుతురుగా మారుచున్నది.

శూన్యీకరింపబడిన (*evacuated*) గాజు గొట్టము ఇరుప్రక్కల లోహపురేకులచే బంధింపబడి

యుండును. ఈ రేకులలోనికి జొప్పింపబడిన విద్యున్నాళికలద్వారా అధికవోల్టేజి (*voltage*) గల విద్యుత్ప్రవాహ మంపబడును. అప్పుడు గొట్టము తెల్లని కాంతితో వెలుగుచున్నది. ఇట్టి దీపములే నేడు పట్టణములలో విరివిగా వాడబడుచున్నవి. వీటిని సూర్యకాంతిగొట్టము (*sunlight tubes*) లని పిలువవచ్చును.

ఈ గొట్టములు మొదట ఒక వాయువుతోనో, ఆవిరితోనో నింపబడి, తర్వాత శూన్యీకరింపబడును. ప్రకృతిలో సంపూర్ణశూన్యము లేదు. ఎంతటి శూన్యములోకూడ కొన్ని లక్షల కోట్ల పరమాణువులు ఉండితీరును. ఇవి విద్యుత్తుచే స్పందన మొందింపబడును. ఈసూర్యకాంతిగొట్టములలో సామాన్యముగా పాదరసపు ఆవిరి (*mercury vapour*), లేక అంగారామ్లవాయువు (*carbon-dioxide*) వాడబడును. ఈ గొట్టములనే వ్యాపారపు ప్రకటనలకొరకు వివిధాకారములకు వంచవచ్చును. వీటిలో ఎఱ్ఱకాంతి లభించుటకు నియాన్ వాయువు, నీలివెలుగు నిచ్చుటకు ఆర్గనము (*Argon*) మొదలయిన వాయువులతో కలిసిన పాదరసపుఆవిరి వాడబడును. గొట్టము యురేనియమ్ లోహము కలిసిన గాజుచే చేయబడియున్న నీలివెలుగునకుబదులు మరకతదీప్తి లభించును.

రంగుదీపముల గొట్టములలోకూడ ఇవే వాయువులు వాడబడును. రంగుగాజుగొట్టములలో నియానువాయువునందు విద్యుత్స్రావము (*electric discharge*) కలిగించుటవలన ఎఱుపులో సన్నిఛాయలు కల్పింపవచ్చును. పాదరసపు ఆవిరితో లేతపసిమివన్నెనుండి చిక్కని నీలవర్ణమువరకు, హీలియమువాయువుతో అన్నిరకముల పసిమివన్నెలు, వెలుతురు పొందవచ్చును. రఙ్గుగాజు వాడుటేగాక రంగుదీపములంగు ప్లవకాంతి (*fluorescence*) నొందే పదార్థములను పూయుటయు కలదు. కొన్ని పదార్థములు వాటిపై అదృశ్యకిరణములు, అతినీలలోహితకిరణములు మొదలయినవి పడినప్పుడు కొన్ని రంగుల కాంతితో ప్రకాశించును. ఈకాంతికి ప్లవకాంతి (*Fluorescence*) అని పేరు. నియాన్ దీపములలో గాజు కాష్లియం టంగ్స్టేట్సుచే పూత పూయబడియున్న దాసానిపూవు రంగు వెలుతురున్నూ, యశదశైలితము (*Zinc silicate*) చేత బంగారువెలుగున్నూ లభించును. ఇక పాదరసపు ఆవిరిదీపములలో యశదశైలితమువలన మరకతదీప్తి (*green light*), యశదవిదుర (*Beryllium*) శైలితము వలన వైడూర్యపుఛాయల కాంతులు, కాద్మ్య (*Cadmium*) శైలితమువలన రక్తారుణవర్ణము, మగ్నఖటిక (*Magnesium and Calcium*) టంగ్స్టేటులవలన నీలి వెలుగులు లభించుచున్నవి.

పాదరసపు దీపములు సామాన్యపు టంగ్స్టన్కేసరపు విద్యుద్దీపములకంటె నాల్గురెట్లధికపు కాంతి నివ్వగలవు. పదునైదువందల గంటలు వెలుగగలవు. వీటిలోను ఏబదినుండి నాల్గువందలవరకు వాట్ పవర్ (*watt-power*) గల దీపములు చేయబడుచున్నవి. నాల్గువందల వాట్పవరుగల దీపము శంకు ఆకారము గలిగియుండును. గాజుతో చేయబడిన శంకువునందు ఒక గట్టిగాజు (*Hard glass*) గొట్టముండును. దీని కిరుప్రక్కల విద్యున్నాళికలు బిగింపబడియుండును. గొట్టమునకు, శంకువునకు గల మధ్యప్రదేశము ఉష్ణనిరోధకముగా నుండుటకొరకు వాయుహీనముగా చేయబడియుండును. ఈ దీపము ఇతరవిద్యుద్దీపములవలెనే అతిభద్రముగా సీలుచేయబడియుండును.

ఈ దీపములో విద్యున్నాళికగా తుంగస్థలోహపు తీగచుట్ట వాడబడును. ఈ తీగచుట్టలో బేరియశైలిత ముంచబడియుండును. విద్యుత్ప్రవాహవేగము తగ్గించుటకు ఒక విద్యున్నాళికతో విద్యున్నిరోధకపు పేటిక (*electrical reslstance box*) ద్వారా కలుపబడిన మరొక ఉపవిద్యున్నాళిక (*auxiliary electrobe*) అతికించబడియుండును.

స్విచ్ వేయగానే దీపములోనికి విద్యుత్ప్రవాహము ప్రవేశించి మొదట గాజుగొట్టమును వేడిచేయును. ఆ వేడికి లోని పాదరసము ఆవిరియగును. వాయురూపములో నున్న పాదరసము యొక్క పరమాణువులు విద్యుత్స్రావము (*Eleotric Discharge*) వలన కంపించి వెలుతురును వెదజల్లుచున్నది.

ఈ వెలుతురు సామాన్యముగా పసుపు, ఆకు పచ్చవన్నెలు గలది. వీటికి నీలి, ఎఱుపురంగుల వెలుతురు చేరినపుడు సూర్యరశ్మికి పోల్పదగిన కాంతి లభించును. అందుకొఱకు ఈ దీపములలో పాదరసపు ఆవిరికి తోడుగా ఆర్గన (*Argon*) వాయువు, యశద (*Zinc*), కాద్మి (*Cadmium*) లోహముల ఆవిరులు, లేక వాటి గంధకిదములు ఉపయోగింపబడును.

ఈ దీపములకు సూర్యరశ్మిని బోలిన వెలుతురు నిచ్చు గుణమేగాక, సూర్యునినుండియే మనకు లభించు అతినీలలోహితకిరణములను గూడ ఇవ్వగలిగినగుణమున్నది. ఈ అతినీలలోహితకిరణములు వైద్యములోను, పరిశ్రమలలోను చాల ముఖ్యమైనవి. పాదరసపు దీపము నల్లగాజుతో చేయబడినపుడు దానినుండి ఈ అతినీలలోహితకిరణములే లభించును. ఈ నల్లదీపము (*black lamp*) ను వస్త్రములపై నూనెమరకలు, చారలు తెలిసికొనుటకు, పరిశ్రమలలో రబ్బరు, కాగితము మొదలయినవాటి పరిశీలనకు, నేయి మొదలయిన ఆహారద్రవ్యముల శుద్ధతను పరీక్షించుటకు విశేషముగా వాడుచున్నారు. ఈదీపముక్రింద మంచి, సరిక్రొత్త కోడిగ్రుడ్లు ఎఱ్ఱగాను, చెడినవి నస్యపు (*snuff*) వన్నెతోను నగుపించును. ఇట్లే అసలు వెన్న (*pure butter*) బంగారువన్నెతోను, కృత్రిమపు వెన్న ఎఱ్ఱగాను తెలియును.

నాటకరంగములలో ప్లవకాంతి నొందే రంగు పదార్థముల (*Dyes*) లో నద్దబడిన దుస్తులను నటులు ధరించినపుడు ఈ నల్లదీపములు వారిపై కేంద్రీకరించుటవలన రంగస్థలమున మనోహర వర్ణదృశ్యములచే ప్రేక్షకుల నానందింపజేయవచ్చును.

పాదరసపు దీపములకంటె సోడియదీపము లెక్కువ కాలము మనగలవు. ఇవి ఇరవైయైదువందల గంటలు వెలుగును. వీటిని రోడ్డులాంతర్లుగాను, సర్చిలైట్లుగాను పెద్దపట్టణములలో వాడెదరు. కర్మాగారములలోను, ఫొటోగ్రఫీలోను, ఫ్లడ్ లైటింగ్ (*Flood-lighting*) స్కీములలోను ఉపయోగింపబడుచున్నవి.

సోడియలోహపు ఆవిరి సామాన్యపు గాజును తినివేయు స్వభావము గలిగియుండుటచేత ౩౦౦ C వేడి భరింపగల ప్రత్యేకమయిన గాజు వాడబడును. ఈగాజులో నూటికేబది పాళ్లు తెల్లఇసుక, పదిపదిపాళ్లు యశదకాద్మిఆమ్లజనిదములు, ఇరువదిపాళ్లు అల్యూమినామ్లజనిదము, పదిపాళ్లు బోరికామ్లమునుండును. ఈ గాజుతో ఒక 'U' అక్షరపు ఆకారము గల గొట్టము చేయబడును. ఈ గొట్టములో గాలిఅంతయు తీసివేసి కొంత సోడియపు ఆవిరి, నియాన్ వాయువు ప్రవేశపెట్టబడును. గొట్టపు రెండుకొనలు బేరియమాక్సైడుపూత గల విద్యున్నాళికలచే బంధింపబడియుండును. ఈ గొట్టము వాయువిహీనముగా చేయబడిన మరొక పొడుగాటి గాజుబల్బులో పాదరసపు దీపములోవలెనే బంధింపబడియుండును.

సోడియముదీపములు నాల్గురకములుగా తయారు చేయబడును. అవి ౫౦, ౬౫, ౧౦౦, మరియు ౧౫౦ వాట్ల పనను గలవి. ఇవి ౧౫౦, ౨౦౦, ౩౦౦ మరియు ౫౦౦ వాట్ల పనిచేసే సామాన్యవిద్యుద్దీపములకు సాటియగును.

పై సూర్యకాంతిగొట్టాలకు, పాదరసపుసోడియపుదీపములకు విద్యుత్స్రావదీపము (*Electric Discharge Lamps*)లని గూడ నామాంతరము. ఇవి సామాన్యవిద్యుద్దీపముల ఆకారముతోను, గొట్టముల వలెను కావలసినట్లు తయారుచేయబడుచున్నవి. వీటిలో చాలవరకు విద్యుచ్ఛక్తి వెలుతురుగా మారుచున్నది. వీటిలోకూడ కొంతవరకు శక్తి వేడిగా వ్యర్థమగుచున్నది. కాని వెలుతురు దాదాపు సూర్యరశ్మికి సాటియయినది లభించుచున్నది. నేటికిని వేడిలేని వెలుతురు నల్పవ్యయముగావించు విధానము కనిపెట్ట గలిగినవానికొరకై కీర్తికాంత వేచియున్నది.

**"రాము"**

# పురుషసూక్తము

శ్రీ నిర్వికల్పానందస్వామి

[పురుష, హిరణ్యగర్భ, నాసదీయసూక్తాల్ని ఋగ్వేదంలోని త్రిరత్నాలని చెప్ప వచ్చు. మూలాని కిది ధారాళమైన యథాతథానువాదం. సాయన భాష్యం ఆలంబనం.]

౧

పరమపురుషుండు విలసిల్లు పాదశీర్ష
నయనసాహస్రియై భువనతతి నిండి,
మరియు తా దశాంగుళపరిమాణమైన
నూర్ధ్వమునఁగూడ మహిమతో నొప్పుచుండు.

౨

కాలవారుణిఁ దోఁచు జగత్తులెల్ల
అమృతపతియగు పురుషుఁడే యగును నరయ;
అన్ననాయకనిజరూపహానకలన
జీవభోగార్థమై సృష్టిఁజేసె విభుఁడు.

౩

విశ్వమెల్లఁ దమపర్య్య వైభవంబు
దీనికంటె ఘను డితండు; త్రిభువనతతి
పాదమాత్రంబె యగు: మూఁడు పదములు దివి
వెలుఁగు దివ్యామృతస్థితి వీడకుండ.

౪

చరణములు మూఁడు నూర్ధ్వదేశమున నుండ
మరలమరల చతుర్థంబు మాయయందు
తగులుకొనుచుండ పురుషుండు తా స్థిరచర
వర్తియగుచు విశ్వభువనవ్యాప్తి నందె.

౫

పరమపురుషుడే బ్రహ్మాండభాండకర్త
గాగ. విరాట్పురుషుడు ప్రకాశమందె;
అతడు సర్వజీవోపజీవతను బడయ
ఉర్వి జీవదేహసహిత ముద్భవిల్లె.

౬

హవ్యమయ్యె విరాట్టు దేవాళి యజ్ఞ
మాచరించు వేళ; వసంత మాజ్య మగుచు
గ్రీష్మము, సమిత్తగుచు శరదృతువు ముఖ్య
హవ్య మగుచును నింపుగా నమరె నపుడు.

౭

అగ్రజన్ముడైన విరాట్టు యజ్ఞపశువు
గాగ, ఋషులును దేవాళి గలసి సృష్టి
నిపుణులగుటఁ జేసి యథార్థ నీతి సంస్క
రించి, మానసయజ్ఞంబు వేల్చిరంత.

౮

అవతరిల్లె సర్వాత్మకుండైన పురుషు
నాహుతి నొసఁగ, భోగ్యపదార్థరాశి;
గ్రామ్యవన్యపశువులును గల్గె, అంత
రీశుదేవత వానికి రక్షగాగ.

౯

అవతరిల్లె సర్వాత్మకుండైన పురుషు
నాహుతి నొసఁగ, ఋక్సామమంత్రలోనె
సకలఛందస్సులును గల్గె చక్కగాను
గద్యమయయజుర్వేదంబు గనెను రూపు.

౧౦

అవతరిల్లె సర్వాత్మకుండైన పురుషు
నాహుతి నొసఁగ, వెంటనే యశ్వజాతి;
జంతుజాత మంత యపుడు జన్మనందె
అవులును ఛాగమేషంబు లపుడు పుట్టె.

౧౧

దేవత లల విరాట్టు నుద్దీప్తుఁ జేసి
యెన్ని రీతులుగను వికల్పించినారో ?
ఈ పురుషవర్ణ్యనకు ముఖం బేమి తలప
నూరుబాహుపదద్వయం బొప్పె నెట్టుల ?

౧౨

బ్రాహ్మణుం డయ్యె వానికి వదన మరయ,
బాహువులుగా నమరె రాజ్యపాలకుండు,
వైశ్యుఁ డూరుద్వయం బాయె, పాదములుగ
శూద్రుఁ డొప్పారె—నప్పురుషునకుఁ దలప.

౧౩

చంద్రుఁ డుత్పత్తిగనె మానసంబులోన,
సూర్యుఁ డుదయించె వాని నేత్రములనుండి
ముఖమున మఘవుఁ డగ్నియును మూర్తిగనంద,
ప్రాణమున జన్మమందెను వాయు వపుడు.

౧౪

అంతరిక్షంబు ఘట్టలె నంద నాభి
కతన; శీర్షమున ద్యులోకంబు గలిగె,
ధరణి యుద్భవము గనె పాదములనుండి,
కర్ణములనుండి కల్గె దిక్కులు; నంత—

౧౫

ఆ మనోమయయాజ్ఞమర్త్యమున యూప
బద్ధమాయెను శ్రీపురుషపశువు; సప్త
ఛందసులు పరిధులుగాఁగ సమిధలును గ
చక్కఁగ నిరువదియు పైన నొక్కటగుచు.

౧౬

స్వర్గము లభించు నిట్లుపాసన నొనర్ప—
దేవతాగణంబులు నా దేవదేవు
పూజసల్పగ స్వర్గంబు బొందఁజాలె ;
వేదమంత్రంబు మహిలోన విదిత మయ్యె.



# విమర్శనము

## ప్రాచీన యోగులు

గ్రంథకర్త : చారిత్రకశిరోమణి కొడాలి లక్ష్మీనారాయణ బి. ఏ. గారు, మోపఱ్ఱు, తెనాలి తాలుకా, గుంటూరుజిల్లా. వెల రూ. ౨.

ఈ సంక్షిప్తగ్రంథములో భారతదేశమున గత ౭వేల సంవత్సరకాలములో నుద్భవించియుండిన యోగులను మహాపురుషుల ప్రస్తావము, ఆధునికులగు వివేకానంద, రామతీర్థాదుల ప్రసంగమును, ఆంధ్రదేశమున ప్రసిద్ధముగ వెలిగిలుచుండిన శ్రీ మలయాళ స్వామి మున్నగువారి చర్చయును కలవు. అనగా ఒక అనంతకాలములో భారతదేశముయొక్క ఆధ్యాత్మిక ఔన్నత్యమును—౭ వేలవర్షముల కాలమునుండి నిరంతరాయముగ ప్రవహించుచున్న దానిని— మన మనోనేత్రము ఎదుట చలనచిత్రమువలె చురుకుగ నడచిపోవునట్లు చేసినాడీ గ్రంథకర్త. ఈపుటల నొక్కసారి తిరుగవేసినయెడల, ఒక్కొక్క మహాత్మునిగురించి ఇంకను ఎంత గ్రంథము వలువవలసియున్నదో యని అనిపించుటయేగాక, ఇంత కొంచెముగ చెప్పిన గ్రంథకర్తమీద విసుగుకూడ గల్గును. విషయము అంత ఉదాత్తమైనది.

ఈక్షేత్రమున ఎవరో యొకరు దిగి "పిల్లికి గంట కట్టిన" పుణ్యమును సంపాదింపవలసియున్నారు. ఒక్కొక్క యోగిచరిత్రయును, బోధనలును విశదీకరించి వ్రాయవలెను.

గ్రంథకర్తయొక్క ఈ ప్రాథమికకృషి అభినందనీయమే గాని, తొందరపడి వ్రాసిన వాక్యములు తిలతండులన్యాయమున గ్రంథమునందంతటను ఉన్నవి. "పునర్జన్మసిద్ధాంతము అనాగరకులనుండి గైకొనబడినది." "(7) వేదవిరుద్ధమగు తత్త్వశాస్త్రకాలమునకు మధ్యనున్నవాడు యాజ్ఞవల్క్యుడు" (8) మున్నగునవి. దిద్దుబాటు అవసరము.

"... ఆర్యులనార్యులనుండి నేర్చియుండవచ్చును" (8) ఈ వాక్యముగూడ పైజాతిలోనిదే. సంస్కార మవసరము.

చరిత్ర తిరుగతోడి వ్రాయవలసిన యుగసంధిలో మనము ఉన్నాము. అనార్యులు, ద్రావిడులు మున్నగువారి కేకాలమునను ఈదేశములో అస్తిత్వము లేకపోయినను, ఆంగ్లభాషాద్వారమున మన హృదయములలో తిష్ఠవేసికొనియున్నారు. ఈ పదములబూజు మన శబ్దకోశములనుండి ఎంత తొందరగ పోయిన అంత మంచిది. ఈదేశమున వెలసిన జాతి ఒక్కటే. వారు ఆర్యులుమాత్రమే. అది ముక్తిలేక స్వాతంత్ర్యము. ఇది ప్రాచీనయోగు లందరును ఐకకంఠముతో నుద్ఘోషించిన వాణి.

**శ్రీ నిరీశ్వరానందస్వామి.**

## స్వీకారము

### శ్రీమదాంధ్రభాగవతము

దశమస్కంధము. పూర్వభాగము. సచిత్రము. ప్రకాశకులు : దావులూరి కోటిసూర్యప్రకాశరావు గారు, కొత్తపేట, తెనాలి. వెల రూ. ౮.

### నవమాలిక

నవల. రచయిత: త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి గారు. ప్రకాశకులు : జయా పబ్లిషర్సు, తెనాలి. వెల రూ. ౧.

### మల్లికార్జునపండితవిజయము

పద్యకావ్యము. రచయిత : ముదిగొండ వీరభద్రమూర్తిగారు, మాదల. వెల రూ. ౧-౮-౦.

### కట్టమంచి

పద్యకావ్యము. కవి : జి. జోసఫుగారు, గోకనకొండ, కొమ్మలపాడుపోస్టు, గుంటూరుజిల్లా. వెల ౧-౮-౦.

### కుటుంబం

కథల సంపుటి. కథకుడు : పంతుల శ్రీరామశాస్త్రిగారు, బి. యస్ సి., రాయఘడ, [illegible] జిల్లా. వెల ౧ రూ.

### ఆభాసకైస్తవము

రచయిత : కోట వెంకటాచలంగారు, గాంధీనగరం, విజయవాడ. వెల రూ. ౧-౮-౦.

### సద్గురు బావూసాహెబ్ (విఠోబా) మహారాజుగారి చరిత్ర

మరాఠీరచనకు అనువాదము. అనువాదకుడు : మానూరు రామకృష్ణరావుగారు. ప్రకాశకులు : సుందరరామ అండ్ సన్సు, తెనాలి. వెల రూ. ౧-౮-౦.

### కిన్నెర

కొత్త సచిత్రమాసపత్రిక. నవంబరులో వెలువడిన ప్రథమసంచిక పేరుకు దగిన రూపరేఖలతో సలక్షణముగా ఉన్నది. సంపాదకులు : పండిరి మల్లికార్జునరావుగారు, ౧౬, బోసువీథి, మద్రాసు. విడిసంచిక

